॥ శ్రీ గురుభ్యో నమః ॥

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత

## వ్యాసమంజరి

(ద్వితీయ సంపుటము)




రచయిత :

"పరిపూర్ణ దర్శనాచార్య" "సదానంద"

శ్రీ ఖిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు

నర్సాపురం (పశ్చిమ గోదావరి జిల్లా)





ద్వితీయ ముద్రణ 2000

ప్రతులు 1000

॥ శ్రీ గురుభ్యో నమః ॥

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత
# వ్యాసమంజరి
## (ద్వితీయ సంపుటము)




రచయిత :

"పరిపూర్ణ దర్శనాచార్య" "సదానంద"

**శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు**

నర్సాపురం (పశ్చిమ గోదావరి జిల్లా)





ద్వితీయ ముద్రణ 2000
ప్రతులు 1000

॥ శ్రీ గురుభ్యో నమః ॥

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాసమంజరి

## (ద్వితీయ సంపుటము)




రచయిత :

"పరిపూర్ణ దర్శనాచార్య" "సదానంద"

**శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు**

నర్సాపురం (పశ్చిమ గోదావరి జిల్లా)





వెల

రు. 15-00

# పీఠిక

రాజయోగి వేదాంత మాసపత్రిక యందు నాచేతను, నాసహధర్మచారిణియగు సీతామహాలక్ష్మి చేత రచింపబడి, ప్రకటింపబడిన వ్యాసములన్ని పుస్తకరూపంలో ప్రకటించిన అవి శాశ్వత రూపంలో నిల్చి పరిపూర్ణ బోధయందు కృషి చేయు వారికి ఎంతయో సహాయకారిగా ఉండుననియు, గ్రంథ ముద్రణకు వలయు ధనము విరాళముగా తాము భరింతుమనియు భక్తాదులు వాగ్ధానము చేసి యుండుటచే సీతామహాలక్ష్మి వ్రాసిన వ్యాసములన్నియు ప్రథమ సంపుటముగా 1983లో వార్షిక ఆరాధన నాడు ప్రకటించి యున్నాము. నాచే రచింపబడిన వ్యాసములు కొన్ని ద్వితీయ సంపుటముగా ప్రకటించియున్నాను. ఈ గ్రంథము కూడా భక్తాదుల ఆర్థిక సహాయముచే ముద్రింపబడెను. గంజామ్ జిల్లా బరంపురం, పట్టణ నివాసి శ్రీమతి గుడిసెం బంగారమ్మగారు ఈ ధర్మము నందు కృషి చేస్తూ గురుఋణం తీర్చుకునే విధానంలో ఈ గ్రంథము పునర్ ముద్రణ తమ స్వంత ద్రవ్యముతో ముద్రింపజేసి పాఠకులకు అందించి ధన్యులైరి. వీరి సంగ్రహ జీవిత చరిత్ర విడిగా ప్రకటించ బడుచున్నది. శ్రీ గురుపరమాత్మ అనుగ్రహముచే వీరికి సమస్త సుఖములుకలిగి జీవితాశయము నెరవేరు గాక. మాచే రచియింపబడిన గ్రంథములన్నియు శ్రీ అచలఋషి దయానంద పొన్నాల రాజ యోగీంద్రుల వారి దివ్యశ్రీచరణ సరోజములకు పూజాపుష్పములుగా సమర్పింపబడి యున్నవి. అట్లే ఈ గ్రంథము మరొక పూజాపుష్పముగా సమర్పించు కుంటున్నాము.

ఇట్లు
బుధజన విధేయుడు
**యిలపకుర్తి వీర వెంకటరామచంద్రరావు**

A2

# ముందు మాట

పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్ర రావుగారు, శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంధరచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగ్రతమొనరించినారు. వారి శిష్య, ప్రశిష్యులు వలయు అర్థిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేకాక గురు ధర్మనిర్వహణలో శ్రీ రామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని , గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారం చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీ శ్రీ శ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ"ను గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటు చేసి శ్రీ గురుదేవుల అదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తి అందించు చున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించ వలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురుదేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారిచరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరువున శ్రీ గురువరమాత్మను ప్రార్థించుచున్నాము.

ఇట్లు
భక్తమండలి తరుపున
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**



గ్రంథ పునర్ముద్రణ దాత శ్రీమతి గుడిశా బంగారమ్మ

బరంపురం

# శ్రీ గురుభ్యోనమః

ఈ గ్రంథమునకు ద్రవ్య సహాయము చేసిన గుడిశా బంగారమ్మ గారి జీవిత చరిత్రలో కొన్ని ముఖ్యవిషయములు :

శ్రీకాకుళం జిల్లా ఇచ్చాపురము వాస్తవ్యులు పొట్టా రామమూర్తి పొట్టా తరిణమ్మ గార్ల సంతానము. బంగారమ్మ గారు 1918 సం॥ మార్గశిర మాసంలో జన్మించినారు. ఈమెకు 8వ సం॥ వయస్సులో గంజాం జిల్లా బరంపురం పట్టణ వాస్తవ్యులు శ్రీ గుడిశా వెంటరమణ, గుడిశా బుచ్చిరాముడు గారి ఏకైక కుమారుడు అయిన గుడిశా వెంకట క్రిష్ణారావు గార్కి ఇచ్చి వివాహము చేసినారు. వీరు 13 సంవత్సరం కాపురానికి వచ్చారు. వీరికి కుసుమకుమారి, రామరత్నం అను ఇద్దరు కుమార్తెలు జన్మించిరి. వీరి చిన్నతనములోనే వీరి తండ్రి గారయిన వెంకట క్రిష్ణారావుగారు పరలోక గతి చెందినారు. వీరు వీళ్ళ నాయినమ్మగారయిన గుడిశా బుచ్చిరాయుడు ఆదరణలో పిల్లలు భక్తి మార్గంలో పెరిగి పెద్దవారు అయ్యారు. వీరి చదువులు అంతమాత్రంగానే ఉండెను. బంగారమ్మ గారి పెద్ద కుమార్తె అయిన కుసుమకుమారికి బరంపురం పట్టణ వాస్తవ్యులు అయిన పలివెల సన్యాసయ్య, రంగమ్మగారి కుమారుడు అయిన పలివెల నాగభూషణ రావు గారితో 1954లో వివాహము చేసిరి. ఈమె రెండవ కుమార్తె అగు రామరత్నంకు శ్రీకాకుళం జిల్లా పైడిభీమవరం గ్రామ వాస్తవ్యులు అయిన బండారు వెంకట అప్పారావు, నారాయణమ్మ గారి కుమారుడుఅయిన బండారు రామారావు గార్కి ఇచ్చి వివాహము చేసినారు. వీరి పెద్ద కుమార్తె నిత్యము శివారాధన, పురాణ పఠనములు, సత్సంగ కాలక్షేపములుచేస్తూ నిత్య జీవితం గడిపేవారు. వీరి పూర్వజన్మ ఫలము వలన అదృష్టవశాత్తు అదే చిన్నబజారు నివాసియగు శ్రీమతి బత్తుల పార్వతమ్మ గారితో పరిచయము జరిగి, వారు శివరామ దీక్షితీయ సాంప్రదాయము, జన్మరాహిత్య విధానము కృషిచేయుచున్నామని, వారు చేసిన కృషి విధానములు గురించి క్లుప్తముగా తెలిపినారు, మరియు గురువు యొక్క ఆవశ్యకత గురించి చెప్పిన తరువాత అందులో ఏదో విశేషము ఉన్నదని భావించి దానిపై ఎక్కువ మక్కువ కలిగి పార్వతమ్మగారితో ఉపదేశము ఇప్పించమని కోరిన తరువాత 1993 సం॥రం కార్తీక మాసం ద్వాదశినాడు

మంగళగిరి మండలం, యర్రబాలెంలో గల శ్రీశ్రీశ్రీ సీతారామ చంద్రవరిపూర్ణ బోధోపదేశమందిరంలో శ్రీ సదానంద యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారి ప్రియ శిష్యులైన విజ్ఞానంద శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి, సుగుణావతి గార్ల ద్వారా శ్రీమతి పార్వతమ్మగారు పెద్దకుమార్తె అయిన కుసుమకుమారి గార్కి, పెద్ద అల్లుడయిన శ్రీ పలివెల నాగభూషణరావు గార్కి మరియు బంగారమ్మగార్కి కూడా ఉపదేశము ఇప్పించినారు. తదనంతరము 1995, ఏప్రిల్ నెలలో బరంపురంలో వీరి పెద్ద కుమార్తె కుసుమకుమారి సంతానము అయిన పి.వి.బి.ఆర్.కె. గుప్త, కోడలు భాగ్యలక్ష్మి, పి.ఉపేంద్ర గుప్త, కోడలు మాధవి, పి. ఉపమామహేశ్వరరావు గుప్తా, కోడలు సంధ్యారాణి మరియు వీరి ఏకైక కుమార్తె అయిన విజయలక్ష్మి మొత్తం అందరూ శ్రీ విజ్ఞానానంద మంచిరాజు శ్రీనివాసమూర్తి సుగుణావతి గార్ల ద్వారా ఉపదేశము పొంది, సాంప్రదాయక పద్ధతియందు నిర్దేశించిన అనుష్ఠాన, ఆచరణ విచారణల యందు శ్రద్ధగా కృషిచేయుచున్నారు. గురు ఋణము తీర్చుకొనే పద్ధతిలో సేవా పద్ధతిగా బంగారమ్మగారు ఈ గ్రంథ పునర్ముద్రణకు వలయు ఆర్థిక సంపత్తి సమకూర్చి ధన్యులైరి. శ్రీ గురుమూర్తి అనుగ్రహము వీరిఎడల సర్వదా ప్రసరించి జన్మ సాఫల్యము గాంచగలరుగాక !

ఇట్లు

**పి. ఉపేంద్ర గుప్త & శ్రీమతి మాదవి**

A5

# విషయసూచి



A6

శ్రీ గురుభ్యో నమః

# శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావుగారి సంగ్రహ జీవితచరిత్ర

రచన : **మంచిరాజు శ్రీనివాసమూర్తి**

శ్లో ॥ యోగాయోగ వినిర్ముక్తం నిత్యాచల ప్రబోధకమ్ ।
సుగుణాకర సదానందం శ్రీ రామచంద్ర గురుం భజే ॥

ఈ గ్రంథకర్త శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావుగారు పశ్చిమగోదావరిజిల్లా యిలపకుర్రు గ్రామ కాపురస్తులు. శ్రీ శేషమాంబ వెంకట శివరామయ్యగార్ల ఏకైకపుత్రుడై 11.2.1905వ తేది రాత్రి 12 గంటలకు జన్మించెను. వీరి అక్కగారగు కాదంబరి వెంకటసుబ్బమ్మ గారు అంతకుపూర్వము 15 సం॥ల క్రితమే పుట్టినను ఆపిదప మరల సంతానము లేకపోవుటచే వీరి తాతగారగు సుబ్బారాయుడుగారు మంత్రదీక్షనుగైకొని ఒక కొబ్బరి కాయను మంత్రించి నేలయందుపాతి అది మొలకెత్తినచో, నీకు పుత్రుడుదయించ గలడని చెప్పియుండిరి. అట్లు పాతినసంవత్సరము లోపలనే ఈ గ్రంథకర్తగారు జన్మించుట జరిగెను. వెంకట శివరామయ్యగారు పెద్దాపురములో డిప్యూటి నాజరుగా పని చేయుచుండిరి. ఆ అప్పటికి ఈ గ్రంథకర్తగారికి 5వ సంవత్సరము వచ్చెను. ఆవూరిలో క్రైస్తవమిషనరి స్కూలు తప్ప మరొక సరిఅయిన బడిలేదు. ఆ స్కూలులో చదివించుటకు తండ్రిగారు నిరాకరించి కుర్రవానిని యింటివద్దనే యుంచి వేసిరి. కాని అదృష్టవశాత్తు కుర్రవాని అక్కగారయిన వెంకట సుబ్బమ్మగారు పురుడుపోసుకొనుటకై పుట్టింటికేతెంచి 7,8 మాసములు అచ్చటనే వుండిపోయిరి. ఆకాలములో ఈ గ్రంథకర్తగారికి అక్షరములు గుణింతములు, మొదటి వాచకపుస్తకము పూర్తి గానేర్పి ఆమె అత్తవారింటికి కేగిరి. ఆ తరువాత 6 మాసములవరకు యింటివద్దనే వుండవలసివచ్చుటచే "నన్ను స్కూలులో వేయనిచో నేను నూతిలోపురికి చనిపోయదను" అని పిల్లవాడు మారాము చేయుచ్చుండుటచే తండ్రి గారు గ్రామములో లేనిసమయమున మరొకరి సాయముచేత 2వ తరగతిలో కుర్రవానిని, మిషనుస్కూలులో చేర్పించిరి. ఆ రోజులలో 2వ తరగతి నుండియే యింగ్లీషు బోధించుచుండిరి. కాకినాడ పి.ఆర్.కళాశాలలో హాస్టలులో వుండి ఇంటర్మీడియెట్‌ను, రాజమండ్రి ఆర్ట్స్ కాళాశాలలో బి.ఎ.ను గ్రంథకర్తగారు చదివిరి. వీరికి యింజనీరింగులోచేరి మదరాసులో చదువవలెనని

ఉండెడిది. కాని వుద్యోగములో చేరినచో దూరస్థలమునకు బదిలీ జరుగునని 'లా' చదివి పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురంలోనే ప్రాక్టీసుపెట్టవలెనని తాను, స్వగ్రామమైన యిలపకుర్రులోనే నుందునని, తండ్రిగారు కబురంపుటచే, గంటలోవచ్చి వాలవలెనని తండ్రిగారు ఆజ్ఞాపించుటచే మద్రాసులోనే 'లా' చదివి పాసై 1929 లో నర్సాపురంలోనే గ్రంథకర్తగారు ప్రాక్టీసుపెట్టిరి.

"పువ్వు పుట్టుటతోనే పరిమళించును." అని పెద్దల వాక్యము. అట్లే గ్రంధకర్తగారు చిన్నతనము నుండియు రూపాయి, అర్ధా, ఎవరయినను యిచ్చినచో దానిని దుర్వినియోగము చేయక, భగవద్భక్తిపూరితములగుగ్రంధములో లేక శతకములో కొని చదువుచుండెడివారు. వీరికి పదవ ఏటనే ఉపనయనము జరిగెను. తదాది (13వ సం॥ లోనే) వివాహము జరిగేవరకు సహస్రగాయత్రిని ప్రతిదినము చేయుంచుండెడి వారు.

'లా' చదువు రోజులలోనే గ్రంథకర్తగారికి సత్సహవాసము లభించి రామకృష్ణ పరమహంస, వివేకానంద మొదలగు మహాత్ముల జీవితచరిత్రలను, వారి రచనలను చదువుచుండెడివారు. భార్యయగు సీతామహాలక్ష్మిగారు కూడా నోములు, వ్రతములు, ఉపవాసములు చేయుచు భర్తతోసద్గోష్ఠి సలుపుచు కాలక్షేపము చేసెడివారు.

1937 సం॥ నాటికి పూర్వపుణ్యములు ప్రాప్తికిరాగా శ్రీ శివరామదీక్షిత పరిపూర్ణ బోధ, పాలూరి జగన్నాధరావు గారివలన ఈ దంపతులకు లభించినది. రమారమి 10 సంవత్సరములు ఆ బోధయందు కృషిచేసిరి.

పీఠాధిపతులగు శ్రీ దయానంద పొన్నాల రాజయోగి గారి ఆజ్ఞానుసారము పూర్వపు గురువుగారగు శ్రీ పాలూరి జగన్నాధరావు గారిచేతనే నిజసాంప్రదాయక ప్రబోధను దంపతులిరువురు గ్రహించి 1947-48 సం॥లో రజాకారుల అల్లరికారణముగా తాడేపల్లి గూడెంలో పీఠాధిపతులు కాపురముండిన కాలమందు ఈ దంపతులిరువురు వారివల్లనే సమస్త బోధ మర్మ ధర్మములను గ్రహించి పీఠాధిపతులచే బోధాధికారముపొంది "సదానంద" అను దీక్షానామముతో నిజసాంప్రదాయక మర్మధర్మము లన్నియు పీఠాధిపతులవల్లనే గ్రహించి వారి ప్రధానశిష్యస్థానము నలంకరించిరి.

ప్రధాన పీఠస్థానమైన సికింద్రాబాదు పట్టణములో పీఠమునందు ప్రతిసంవత్సరము వైశాఖ పూర్ణిమకు జయంతి, వార్షికోత్సవములేగాక పీఠాధిపతులు అందందు స్థాపించిన ఉపపీఠవార్షికోత్సవములకు కూడా పీఠాధిపతులతో పాటు తామును వెళ్ళి వేదాంతోపన్యాసములు గావించుచుండిరి.

1965వ సంవత్సరములో వైశాఖపూర్ణిమకు ఈ దంపతులు శ్రీవారిని కలుసుకున్నారు. "రాజయోగి" వేదాంత మాసపత్రికను ప్రచురించుటకు అనుజ్ఞగైకొని ఈ గ్రంథకర్తగారు

సంపాదకులుగా 1965 జూలై లో ప్రారంభించి 1977 వ సంవత్సరము జూన్ నెలాఖరువరకు నిరాఘాటముగా "రాజయోగి" పత్రికను జయప్రదముగా నడిపిరి. గురుభక్తిని వ్యక్తీకరిస్తూ శ్రీ రాజయోగి విజయంబను సద్గురుచారిత్రము అను గ్రంథమును వ్రాసి తమ గురుభక్తిని ద్విగుణీకృతమొనర్చుకొనిరి. ఇందు శ్రీ దయానందుల కరుణాకటాక్షమునకు ఏవిధమున ఎదురుచూచినది, అందలి వాస్తవములను పాఠకులకు సోదాహరణముగా విశదీకరించిరి. 1951వ సం॥లో 1) "అచలమత పరామర్శ" అని, (లేటు) మేడవరపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (ఆళ్ళగడ్డ, కర్నూలు జిల్లా) వ్రాసిన గ్రంథమునకు జవాబుగా "దుర్విమర్శాంధకార భాస్కరము" అనే గ్రంథమును ప్రచురించి "అచలమత పరామర్శ" అనే వారి గ్రంథమందలి అధ్యాయమును తొలగింపజేసిరి. 2) కోర్టువ్యవహారములతో పీఠాధిపతులు సాధించిన విజయమైన అభ్యున్నతిని తెలియజేయుచు "పీఠాభ్యుదయము" అను చిన్ని గ్రంథమును ఈ గ్రంథకర్తగారు అచ్చువేయించి ప్రచురించిరి. 3) పీఠాధిపతుల ఆజ్ఞానుసారము, పరిపూర్ణ భావము వేదసమ్మతమైనదని శృతి, యుక్తి, అనుభవములకు విరుద్ధముకాదని నిరూపించుచు "పరిపూర్ణదర్శనము" అనే ఉద్గ్రంథమును రచించి ప్రకటించి పీఠాధిపతులకు 1965 లో అంకితముగావించి శ్రీ దయానందులవారిచే "పరిపూర్ణ దర్శనాచార్య" అను బిరుదు పొందిరి. 4) అపిమ్మట "పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము" అను పేరుతో 2 సంపుటములు గురుశిష్యుల సంవాద రూపముగా రచించి గ్రంథస్తముచేసి అచ్చు వేయించిరి. 5) "భ్రాంతిరహిత ప్రకరణములు" అను పేరుతో ఎరుక, జగములు మిథ్యా స్వరూపములని నిరూపించే వ్యాసము క్రోడికరించి గ్రంథస్తము చేసి ప్రకటించిరి. 6) ఆపిదప 1973 కీర్తి శేషులైన గ్రంథకర్త గారి భార్య సీతామహాలక్ష్మిగారు రాజయోగి పత్రికలో అప్పుడప్పుడు ప్రకటించుచు వచ్చిన వ్యాసములన్నియు క్రోడీకరించి పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాసమంజరి" అనే గ్రంథమును 1983 లో ప్రకటించిరి. 7) రాజయోగి పత్రికలో అపుడపుడు ప్రకటించుచువచ్చిన ఈ గ్రంథకర్తగారి వ్యాసములును, ప్రకటించని కొన్ని వ్యాసములును క్రోడీకరించి వ్యాసమంజరి ద్వితీయ,తృతీయ భాగములు ప్రచురించడమైనది.

బ్రహ్మానంద గిరిగారు అద్వైత సాంప్రదాయమునందే కృషిచేయుచు వుండికూడా, తానుకూడా పోకలవారి సాంప్రదాయమున నిప్రబోధము పొందినట్లు వెల్లడిచేయుచు శ్రీ భాగవతకృష్ణ దేశి కేంద్రులవారి కందార్థములకు వ్యాఖ్యానము వ్రాసి ప్రకటించి, తానుకూడా పూర్ణబోధగురువునని వెల్లడిచేయుచు ప్రచారము చేయసాగెను. వారి పరిపూర్ణబోధ యందు సరియగు ప్రబోధపొందని కారణమున తాను పొందిన అద్వైతప్రబోధమును, పరిపూర్ణబోధయును ఒకటిగానే భావించి అద్వైత గురుపరంపరయును, పరిపూర్ణ గురుపరంపరయును రెండును పఠించుచు తాను వ్రాసిన కందార్థ వ్యాఖ్యాన గ్రంథములో కూడా రెండు పరంపరలును, ప్రకటించి

శిష్యప్రచారము చేసిరి. రాజయోగిపత్రికలో ఈ విషయమును విమర్శించుచు గ్రంథకర్తగారు, వ్యాసము వ్రాసిరి. దానితో బ్రహ్మానందగిరి గారి వర్గమునకును గ్రంథకర్తగారి వర్గము అనగా శ్రీ దయానంద పొన్నాల రాజయోగిగారి శిష్యవర్గమునకు వివాదము చెలరేగెను. చివర కుభయపక్షములవారు ఆసిఫాబాదు గ్రామములో సమావేశములు జరిపి వాదోపవాదములు చేసిరి. పర్యవసానముగా సికింద్రాబాదు దయానందులవారి పక్షము విజయముగాంచి సత్కారసన్మానములను పొందుట జరిగినది. (ఈ సభలలో తమ భార్యయగు సీతా మహాలక్ష్మిగారు ప్రాణాపాయస్థితిలో వ్యాధిగ్రస్తులైయున్నను, గ్రంథకర్తగారు సభలకేతెంచి ఉపన్యాసముగావించిన మరుక్షణమే తిరిగి నర్సాపుర గ్రామమునకు వచ్చివేసిరి).

"వ్యాసమంజరి" ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములు అన్నియు సంపూర్ణముగా చదివి ఆకళింపుచేసుకున్న జిజ్ఞాసవులకు పరిపూర్ణ భావమంతయు క్షుణ్ణంగా అవగాహన కాగలదని, నమ్ముచున్నాము. ఈ గ్రంథకర్తగారి వయసు 79 సం॥లు నిండి 80వ సంవత్సరము జరుగుచున్నది. కించిదస్వస్థులై యున్నారు. గురుకృపా విశేషమున వారు సంపూర్ణ ఆరోగ్యము కలిగి, యింకనూ భక్తమండలికి తమ రచనల వలన మహోపకారము చేయగలరని మేము గురు పరమాత్మను ప్రార్థించుచున్నాము.

ఇట్లు
భక్తమండలి తరపున
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**
విజయవాడ



A10

# 1. మానవ శ్రేష్ఠత్వము

సృష్టియందలి స్థావర జంగమ జీవులన్నియుకూడి ఎనుబది లక్షల తరగతులుగా విభజింపబడినవి. ఇందు మానవులు నాల్గులక్షల రకములని నిర్ణయించబడినది. అయితే మానవులందరూ ఒకే తరగతివారై యుండాలని స్థూల దృష్టికి గోచరిస్తుంది. అది సరికాదని కొంచెం విచారిస్తే స్పష్టమవుతుంది. మానవశబ్దము మనస్సు అను శబ్దము నపేక్షించి కల్గిన దనవచ్చును. ఐతే పశు,పక్షి,క్రిమి, కీటకతరు, లతా, గుల్మాదులయందు మాత్రము మనస్సు లేదా ? ఉన్నదికాని అల్పము అల్పశక్తి వంతము మాత్రమే అయి వున్నది. ఈ జీవులు ప్రకృతిబద్ధముగా మాత్రమే ప్రవర్తించి వానికి కావలసిన అహార పానీయములు సంపాదించుటకు తగినంతమాత్రంగానే తమ మనస్సును వినియోగించ సమర్ధములై యున్నవేగాని వాని మనస్సునకు యితర సంకల్పాదికము లేమీ యుండవు. ఎట్లనగా అసంజ్ఞాజీవులు లేక ధాతుజీవులు (elements) యందు పరావాగ్రూప చైతన్యము మాత్రమే కలదు. అనగా యీ చైతన్యము ఏమాత్రమూ వ్యవహార సమర్థము గాదు. అంతస్సంజ్ఞాజీవులని చెప్పబడే తరు లతా గుల్మాదులయందు పశ్యంతి అని చెప్పబడే తెలివి లేక చైతన్యము కలదు. ఈ రెండు రకముల జీవులు స్థావరములని లేక అచరములని (అనగా ఒకచోటి నుండి మరొకచోటుకు పోజాలనివి) అందురు. ఇవి తమోగుణాధిక్యత కలవి. క్రిమి, కీటక, పక్షి, పశువు మొదలగు సంజ్ఞాజీవులకు సాంఖ్యులు (ప్రాధానీకులు) రజోవిశాలతిర్యగ్ సర్గమని పేరిడిరి. వీనియందు మధ్యమావా గ్రూపమగు చైతన్యము కలిగి వున్నవి. ఏ భావము ప్రకటించవలెనన్నను యివి తమ నోటిద్వారా ఒకేశబ్దమును వెలువరించును. మానవునియందున్న మనో వాక్ శరీరములు సంపూర్ణ వికాసముచెంది వున్నవి. మానవుడు వైఖరీవాక్ కలిగి తన భావములన్నియు, వర్ణాత్మకమగు శబ్దజాలముతో కూడిన వాక్కుద్వారా సర్వవ్యహారములు జరుపుటకు సమర్థుడై వున్నాడు.

ఒక్క ఐహిక ప్రయోజనములకు మాత్రమే గాక మానవుడు తన మానసిక శక్తులను విద్యా,ధ్యాన తపోనుష్ఠానాది సాధనలచే వికాసము చెందించి ఏకాగ్రత సాధించి పారమార్థిక విషయములను సైతము మానసిక ప్రత్యక్షము గావించుకొనుచున్నాడు. సృష్టిమూలమునన్వేషించి, మానవాతీతశక్తి మహత్వములను సాధించుచున్నాడు. తన మానసిక శక్తులను వికాసముగావించుకొని తన మానసేంద్రియమును తన స్వాధీనమందుంచుకొనగల శక్తి మానవుని కొక్కనికే గలదు. అట్లయ్యును తన మానసికశక్తులను నిద్రాణము గావించి ప్రాపంచికమగు

స్థూల భోగాదికములను మాత్రమే వినియోగించువారిని మానవులనుట సరిగాదని అట్టివారికి మానవపశువులని పేరుపెట్టబడినది. కేవలము యింద్రియ విషయములయందు మాత్రమే వర్తించు అన్ని యితర జీవోపాధులతో పాటు అన్నిజీవులకు సమానములగు జాగ్రదాద్యవస్థల యందు మాత్రమే వర్తించు వీరికిన్ని పశువులకున్నూ తేడా ఏమియు లేదని ------

శ్లో॥ ఆహార నిద్రా భయ మైధునాని
సమాన మేకం పశుభి ర్నరాణాం
జ్ఞానం నరాణాం అధికం విశేషో
జ్ఞానేన హీనః పశుభి స్సమానః ॥

తా॥ ఆహార నిద్రా భయ సంగమములు మానవులకు పశ్వాదులకు సమానమే. గాని, మానవునకు జ్ఞాన మధికము. అట్టిజ్ఞానము లేనిచో మానవుడు పశువుతో సమానుడు.

ఇందుపయోగింపబడిన 'జ్ఞాన' శబ్దమున కర్థమేమి ? జ్ఞానమనగా సామాన్యరూపమగు తెలివికాదు. అట్టి తెలివి అన్ని జీవరాసులయందు న్యూనాధిక్యతలతో నుండనేయున్నది. శరీర పోషణకై అవి ఆహార పానీయములను వెదకుకొని మానవులవలెనే సంపాదించుకొనుచున్నవి. మానవులు గృహనిర్మాణ మొనర్చుకొనునట్లే అవియును గూళ్ళో, గుహలో చూచుకొనుచున్నవి. అంతేగాక కొన్ని విషయములయందు పశ్వాదులయొక్కయూ క్రిమి,కీటకాదులయొక్కయు తెలివి మానవుని తెలివి కన్నా అధికముగనే యుంటున్నది. ఉదాహరణకు చీమకు దివ్యజ్ఞానము, కోడికి కాలజ్ఞానము. చీమ మధురపదార్థము ఎంత గహనాతిగహనమగు స్థానమునందు జాగ్రత్త పెట్టినను దానిని బహుతేలికగా గుర్తించగలదు. ఆ పదార్థమును జాగ్రత్తపరచిన మానవుడుకూడ ఎంతో శోధించిన మీదటగాని ఆ మధుర పదార్థమును కనుగొనజాలకున్నాడు. కోడి కాలమును గుర్తించి రాత్రి నాల్గుఝాములు యందు కొక్కొరోకో యని కూయుచున్నది. అనేక పరికరముల సృష్టించిన మానవుడు ఆయా పరికరముల సహాయము లేనిచో కాలమును తెలిసికొనజాలకున్నాడు. సాలెపురుగు యొక్క నేత, తేనెపట్టు, పిచ్చుకగూళ్ళు వగైరాల యొక్క నిర్మాణములు పరిశోధించినచో ఆ పనులయందు మాత్రము ఆయా జీవుల యొక్క నైపుణ్యము మానవుని నైపుణ్యము ఎన్నో రెట్లు మించుచున్నది. కనుక పైశ్లోకము నందుపయోగింపబడిన జ్ఞానమనగా లౌకికజ్ఞానము కాదని తెలియబడుచున్నది.

అయితే యీ జ్ఞానశబ్దమునకు సరియగు అర్థ మేమి? మానవమనస్సు కామనామయి మాత్రమే కాదు: సంస్కారముల మూటమాత్రమేగాదు. సంకల్ప వికల్ప ద్వయదోషాత్మకం మాత్రమేకాదు విషయ యదార్థతను గుర్తించునపుడు జ్ఞానమనీ, నిశ్చయాత్మకమగుచో బుద్ధియనీ, చింతనాయత్త మైనపుడు చిత్తమనీ, క్రియాకారమై కర్తృత్వాభిమానము పూనినపుడు అహంకారమనీ వివిధ నామములను పొందుచుండు అంతరేంద్రియ పంచకముగాదు. వాని అధిభౌతిక

వ్యవహారరూపకార్యమున్నూ గాదు. అంతఃకరణ పరిణామ రూపమగు జ్ఞానము అను ఇంద్రియము, యుక్తాయుక్త నిత్యానిత్య ఆత్మానాత్మ వివేకయుతమైనపుడే దాని నామము సార్థక్యత గాంచుచున్నది. కాని యీ యింద్రియమే సర్వులయందూ సామాన్యరూపముగ నుండి విషయములను గుర్తెరుగునపుడు దానికి జ్ఞానమను పేరుగూడ సార్థకముగాదు. ఉదాహకరణకు ఆవు దాని దూడను లేక తన యజమానినీ గుర్తించును. జ్ఞానమునకు అధి భౌతికము ఎరుగుట. అంతమాత్రమున ఆ ఆవుయందు జ్ఞానము లేదు. జ్ఞానమను ఇంద్రియము యొక్క అల్పప్రకాశము మాత్రమే కలదు అని అనవలసి యున్నది. జ్ఞానశబ్దమును భగవద్గీత యెట్లు నిర్వచించి వివరించినదో కొంచెము తెలిసికొందుము .

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం, తత్వజ్ఞానార్థ దర్శనం
ఏతత్ జ్ఞానమితిప్రోక్త మజ్ఞానం యదతో ఽ న్యథా

తా॥ నిత్యమగునది ఆత్మయొక్కటియే యని యెరింగి ఆత్మతత్వము యొక్క సాక్షాత్కారము పొందియుండుటయే జ్ఞానముగాని మిగతా అంతయూ నజ్ఞానమేయని భావము.

శ్లో॥ యద్జ్ఞాత్వాన పునర్మోహ,
మేవం యాస్యసి పాండవ।
యేన భూతాన్యశేషేణ,
ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ భ॥గీ॥ 4-35

తా॥ దేనిని తెలిసినచో తిరిగి మోహము గలుగదో దేనిని తెలియుటచే నీయందునూ నాయందునూ గూడ సకల భూతములను చూడగలవో అదియే జ్ఞానము

మరియును "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని" అనగా తనయందు సర్వభూతములను, సర్వభూతములయందును తననూ చూడగల్గుటయే జ్ఞానము.

ఇట్టి జ్ఞానము మానవునియందు మాత్రమే సాధ్యము. మానవుని మనస్సుకు అతీతశక్తులున్నవి. "మనోహిజతువత్" అనగా మనస్సు-లక్కకరగించి ఏమూసలో పోసిన ఆ యాకారం ధరించినట్లు ఏ వస్తురూపంనందు మనస్సు ఏకాగ్రమగునో ఆ వస్తురూపము మనస్సు ధరించగలదు. ఆ వస్తువు యొక్క స్వరూప స్వభావములను సంపూర్ణముగ మనస్సునందు వ్యాపకము కాగా మనస్సు తన్మయమైపోవును. యిదే వస్తుసాక్షాత్కారము. 'తత్వజ్ఞానార్థ దర్శనం' అనగా యిదే. యిట్టి దర్శనము లేకుంటే జ్ఞానము లేదనే చెప్పాలి. అట్టి జ్ఞానరూపం వహించు శక్తి గల మానవ మనస్సును కేవలం ఐహికప్రయోజనములకు మాత్రమే వ్యతీతముచేసినచో కేవలము పశుసమానుడే. కాగా అట్టి జ్ఞానసముపార్జన గావించుటకై మానవులు తమ అభినివేశము ననుసరించి తత్వవిచారణయో. యోగాభ్యాసమో, మతనిర్ణయమో, భక్తియో, లేక మంత్రోపాసనయో, అంతరేంద్రియ పంచకంలోని జ్ఞానమనో బుద్ధి చిత్తహంకారాలను

పురస్కరించుకొని సాధనగావించుచున్నారు. వీరిని సాధారణ మానవు లనవచ్చును. ఇట్టి సాధకులు ఏ సాధన జేయనివారి కన్న యుత్తములేగదా ! ఈ సాధనలయందు గలిగిన ఏదో శక్తినో, మహత్తునో తమ స్వార్థప్రయోజనాలకై వినియోగించుకొని ప్రజాసామాన్యమునకు తాము గొప్ప మహాత్ములమని చాటుకొనుచు నమ్మకము కల్గించి మూఢజనులను మోసగించి ధనసముపార్జన గావించు దుష్టులే మానవరాక్షసులు.

అట్లు తాము పొందిన ఆత్మజ్ఞానమువలన కేవల జన్మరహితము కాజాలదని గుర్తించి "ఆత్మాతీతం కేవలాత్మ" అని చెప్పబడే కేవలాత్మ స్వరూపమగు పరిపూర్ణ బ్రహ్మమును తెలియజేయు పూర్ణగురువులను ఆశ్రయించి తద్వారా తరించుట మాత్రముతో తృప్తిపొందక "స్వయంతీర్థః పరాంస్తారయతి" అనే న్యాయంగా తోటిమానవుల జన్మ తరణోపాయానికై తోడ్పడుచు స్వార్థరహితముగ సమిష్టి శ్రేయోదాయక కర్మలనే ఆచరింపువారే మానవులయందలి దేవతలు. వీరే నిజమగు భూసురులు. ప్రాపంచ పారమార్థికులను యిరువురిలో యీవిధంగా మానవ పశువులు, మానవులు, మానవరాక్షసులు, మానవదేవతలు అను నాల్గు విధముల వారు గలరు.

1. మానవుడొక్కడే వ్యవహార యోగ్యమగు తన వాక్కు ద్వారా సర్వ వ్యవహారములుచేయగల సమర్థుడు.

2. మానవ మనస్సు చాల మహిమావంతము. విద్యాధ్యాన తపోనుష్ఠానాది సాధనములచే, మంత్రయోగశక్తులను సాధించుటయేగాక, తన మనస్సును వికాసము చెందించి కేవలము దేనిని తెలిసినచో తిరిగి మోహము కలుగదో దానిని తెలుసుకొనగలుగుచున్నాడు.

3. మానవ శరీర నిర్మాణమునందుగూడ కొన్ని విశిష్ఠ లక్షణములు గలవు. యితరజీవుల శరీరనిర్మాణముతో బోల్చిన వాని మెదడు బహు అల్పము. మానవుని మెదడు కున్నూ, శరీరమునకున్నూ పోల్చిచూచినచో యీ నిష్పత్తి (ratio) అధికముగానున్నది. ఇతరజీవుల శరీరముల యందలి వెన్నెముక (వానియందలి సుషుమ్న నాళ సహితముగా) భూమితో సమానాంతరముగ నుండునట్లు మాత్రమే గమనాగమనములు చేయును. ఒక మానవుడు మాత్రమే తన వెన్నెముకను నిక్కించి నిడివిగానుండి నడువగలుగుచున్నాడు. వెన్నెముక అడ్డముగా నున్నంత మాత్రమున ఆయా జీవులకు లోపమేమి ? నిడివిగానున్నంత మాత్రమున మానవునకున్న అధిక్యత ఏమి? తెలుసుకొనవలసియున్నది, ఎట్లనగా స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞాయ చక్రములకు పైనున్న సహస్రార పద్మము యొక్క స్థానము మూర్ధ్ని. మానవుని శిరోభాగమందుగల కపాలమందలి బ్రహ్మరంధ్రము వెన్నెముకయందలి సుషుమ్నా నాళము యొక్క పూర్ధ్వ భాగమునందున్నది. బ్రహ్మలోకమునుండి అదిత్యమండలమునకు, దానినుండి బ్రహ్మరంధ్రమునకు, దానినుండి హృదయస్థానమునకును చక్కని రాజబాట ఏర్పడియున్నది. ఆత్మప్రకాశము నేరుగా యీ రాజమార్గముద్వారా మానవుని అంతఃకరణకు చేరు సౌలభ్యము ఒక్క మానవునికి మాత్రమే గలదు. మిగతా జీవరాసులయందు వానివాని బ్రహ్మరంధ్రములు అగ్ని చంద్ర, ఆదిత్య

మండలములకున్నూ వానికతీతమగు బ్రహ్మలోకమునకున్నూ అభిముఖములై యున్ననూ, బ్రహ్మరంధ్రము నుండి హృదయస్థానమునకు గల మార్గము వంపుతిరగవలసి యున్నది. కనుక వానియందలి అంతఃకరణ ప్రకాశము యొక్క అభివ్యక్తి చాల యల్పముగా నుండును. మానవునకున్న నిశితమగు సూక్ష్మప్రజ్ఞ వాని కుండజాలదు.

4. ఇరువదియైదు తెలుపులుగలవాడు మానవుడు. శబ్ద స్పర్శరూప రస గంధము లన్నిటిని సంపూర్ణముగా గ్రహించి అనంద దుఃఖములను బొందగలుగుచున్నాడు. మిగతా జీవరాసులకు ఇట్టి తర్కదృష్టి చేత వస్తుపరిశీలనాత్మకముగ చేయగల కార్యగ్రహణశక్తి లేదు. వస్తుజాతమునుండి సూక్ష్మాతి సూక్ష్మంగా కారణపరంపరను శోధించుచూపోయి అన్నిటికీ అత్యంత మూలకారణమైయున్న బ్రహ్మమునే సులువుగా తెలుసుకొనగలడన్నచో, దృశ్యమానమగు సర్వవస్తువులను పరిశీలించి భౌతికవిజ్ఞానమును పెంపొందించగలడని వేరే చెప్పనక్కర లేదు. కనుక వాఙ్మనశ్శరీరేంద్రియములయందు దేని యందు పరీక్షించి చూచినా మానవాధిక్యత గోచరించుచునే యున్నది.

సృష్టిలో మానవున కెంత శ్రేష్ఠత్వమున్నదో యనిదోచును. ఐనను మానవుని అశ్రేష్టత్వము గూడ ఇంచుక విమర్శింతము. శ్రేష్ఠశబ్దము కూడా సాపేక్షికమేగనుక, మానవుడు వేనికన్న శ్రేష్ఠుడు? అని మాత్రమేకాని కేవల శ్రేష్ఠత్వము లేదు. పశు పక్ష్యాదులకంటె ఒక విధంగా శ్రేష్ఠతయున్ననూ దేవతల కన్న ఒక విధంగా అశ్రేష్ఠుడేగదా! ఐననూ దేవతల కన్ననూ శ్రేష్ఠుడగుటకు లేదా! పశువులకంటెను అశ్రేష్ఠుడగుటకూ మానవునికి శక్తి సామర్థ్యము లున్నవి. అందుకనువగు కర్మశరీరమున్నది పరికరములున్నవి. మానవుడొక్కడే ప్రకృతిబంధము నుండి విడివడి కేవలం యీశ్వరునితో పోటీ చేయ గల్గిన శక్తి సామర్థ్యములు గలవాడు. నిజంగా యోచించినచో పతనమై అశ్రేష్ఠుడగుటకే యెక్కువ అవకాశములున్నవి. ఎట్లన పరమాత్మ సృష్టి అనుకూల ధర్మములచే జీవితము గడిపి సృష్టికారణ వస్తువగు స్వస్వరూపమును గుర్తించి పరిపూర్ణ బొధచే జన్మరాహిత్యము పొందుటకు స్వతంత్ర సమర్థత గలవాడు. సఫలత విఫలత నాతని సాధన ప్రయత్నములపై నాధారపడియున్నవి. లేదా "భజంగ, (కురంగ) మాతంగ, పతంగ భృంగామీనాః పంచభి రేవపంచ" అన్నట్లు శబ్దములచే లేళ్లు పాములున్నూ, స్పర్శచే ఏనుగులున్నూ, రూపముచే మిడతలున్నూ రసముచే, చేపలున్నూ గంధముచే తుమ్మెదలున్నూ ఒక్కొక్క విషయానంద వ్యామోహమువల ఒక్కొక్క జీవిపతనమై నశించుచున్నవి. శబ్ద స్పర్శ రూప, రస గంగాధి సర్వవిషయ వ్యామోహముచే ఆకర్షింపబడే మానవుడు తరించుట ఎంత కష్టము? ఏలననగా యిందే యొక్క విషయమైననూ అతని పారమార్థిక సాధనను వ్యర్థము చేయుటకు చాలు. విషయానందమునే జీవితలక్ష్యముగా గొని అధికాధిక సుఖప్రాప్తికొరకై ప్రకృతి నియమబద్ధమగు జీవితమును విడనాడి స్వేచ్ఛాను సారంగా ప్రవర్తించు మానవుడు అశ్రేష్ఠుడు మాత్రమే కాడు. పశువుతో సమానుడు మాత్రమే కాడు, పశువులకంటే హీనుడు గూడ నగుచున్నాడు.



# ౨. సేవా ధర్మము

మానవుడు సంఘజీవి, ఏకాకియై పర్వతవనాదులలో నుండుటకిచ్ఛగింపడు. సంఘజీవితములో ఒకరికొకరు అన్యోన్య సహకారము చేసుకొంటూ వుండటము తప్పదు. ప్రతి ఒక్కడున్నూ తన పొట్టకొరకై తానొకవృత్తి నవలంబించి పనిచేయటయు, ఆకర్మవలన లబ్ధిపొందు వారాతని పనివిలువ ననుసరించి ప్రతిఫలం ముట్టజెప్పుటయు, సామాన్యవిషయమే, ఐనా నేడు ప్రతిమానవుడున్నూ తానొక ప్రజాసేవకుడనని్న్నీ లోకం తనకు ఋణపడియున్నదని్న్నీ కాని తన సేవను గుర్తించి తనకు సత్కార సన్మానములు జరుపుట లేదని్న్నీ, భావించుచున్నాడు. పుల్లలూ, బొగ్గులూ అమ్ముకొనేవాని లగాయతు ప్రభుత్వము నాయకులవరకు, అందరికీ యిదే వూహ. వీరు చేసేపని సమాజమునకు ఉపయోగించేదనుటలో ఏమాత్రం సందేహం లేదు. ఐనా వీరందరూ ప్రజాసేవకులు, దేశసేవకులు, లోక సేవకులేనా ? ఎవరు నిజమగు సేవకులు ? ఏ రూపంలో ఎట్టి ప్రతిఫలమాశించి, ఏపని చేసినా, అది సేవకానేరదు. ధనము నాశించిన వాడొకడు, కీర్తి నాశించినవాడొకడు, పెత్తనమాశించినవాడొకడు, బిరుదులాశించిన వాడొకడు, వరములాశించినవాడొకడు, పుణ్యమాశించిన వాడొకడు, ఉత్తమజన్మలాశించినవాడు మరొకడు; ఏ ఆశతో మానవుడు ఏకార్యం చేసినా, ఎవరికి ఏ విధమైన సేవచేసినా, కొంత త్యాగ మందు యిమిడియున్నా, అతడు త్యాగికాడు, ప్రజాసేవకుడు కాడు, నిస్వార్థుడూ కానేరడు. నిజమైన భక్తుడూ కానేరడు. కామ్యదృష్టి తో దైవసేవ చేసినా, ప్రతిఫలమాశించి పనిచేసే కూలివానితో సమానుడే అగుచున్నాడు. లేదా క్రయ విక్రయములుచేయు వ్యాపారస్తుడగుచున్నాడు. కనుక ఐహికాముష్మికములలో ఎట్టి సుఖమాశించినా అతడు నిజమగు దైవభక్తుడు గాని, నిస్వార్థ ప్రజాసేవకుడుగాని కానేరడు.

సేవాధర్మమును గురించి సమగ్రంగా తెలుసుకొనవలెనంటే, సేవ్యవస్తువు, సేవకుడు, సేవ అను యీ మూడింటి విషయం విమర్శించి తెలుసుకొవలసియున్నది. ఒక్కముక్కలో చెప్పాలంటే సృష్టిస్థితి లయములకు, అత్యంత మూలకారణమైన ఆత్మ లేక బ్రహ్మము మాత్రమే యుత్తమమగు సేవ్యవస్తువు. అట్టి పరబ్రహ్మమును వస్తునిశ్చయరూపంగా, సాక్షాత్కరింపజేసుకొని, తానే ఆ బ్రహ్మ స్వరూపుడనని ఆరూఢజ్ఞానము గల్గి తనయందు సర్వమూ, సర్వమునందు తానూ అను ఆత్మదృష్టిని పూనియున్నవాడే, సేవాధర్మమును సక్రమంగా నిర్వహించగలడు. అతనికి దోచు సర్వమూ ఆత్మస్వరూపమే. "ఆత్మనోన్యం నకించన" అనగా ఆత్మవినా ఏమి లేదు. ఆత్మకు అస్తి భాతి ప్రియములే స్వరూప లక్షణములు. కనుక కేవలం ఆత్మ ప్రేమ స్వరూపమే " ఆత్మవస్తు

కామాయ। సర్వం ప్రియం భవతి" (బృహదారణ్యకోపనిషత్) అనగా, ఆత్మయందలి ప్రేమచేతనే సర్వమును ప్రేమాస్పదమగుచున్నది. మరియు ఆత్మనుంచి స్థూలాతిస్థూలంగా విజృంభించిన సృష్టి యంతయు ప్రేమ స్వరూపమే. కారణం? "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్" అనగా యీ విశ్వమంతయు శ్రేష్ఠమైన బ్రహ్మస్వరూపమే అంటోంది ముండకోపనిషత్. కనుక ఆత్మయే తానై యున్న బ్రహ్మజ్ఞానికి ఏవిధంగా చూచినా సర్వమును ప్రేమాస్పదమే. అతడే కరడుగట్టిన ప్రేమస్వరూపుడు. చిజ్జడము లన్నియు తానే కనుక అతడు ఏపని ఎందుకై చేసినా, తన కొరకు తానుచేసుకొన్నట్లే. అనగా బ్రహ్మము నిమిత్తం చేసినట్లే. అపుడే అది బ్రహ్మకర్మ అవుతుంది తనకంటె యితరం లేనేలేదు కనుక అతనికి "స్వ" అని చెప్పదగినదే లేదు. అథవా చెప్పవలసివస్తే అంతా "స్వ" యే అని చెప్పాలి. ఏకల్పంలోనూ "స్వార్థ" "పరార్థ" పదములు అర్థరహితమే అయిపోతున్నాయి. కనుక అతనికిక స్వార్థ ప్రయోజన మేమి యుండగలదు ? 'కిమిచ్ఛన్ కస్యకామాయ' అనగా అతడేమి సంకల్పించును ? ఏమి కోరును ? అతనిని కృతకృత్యుడనీ పూర్ణకాముడనీ అనాలి. ఐననూ అతడు నిరంతరం లోకసంగ్రహార్థం కర్మ చేయుచునే యుండును. యిట్టి వారిని గూర్చియే అదిశంకరులు తమ వివేక చూడామణిలో

శ్లో॥ శాంతా మహాన్తో నివసన్తి సన్తో
వసంతవ ల్లోకహితం చరంతః॥
తీర్ణా స్వయం భీమ భవార్ణవం జనా ః
నహేతు నాన్యానపి తారయన్తి ॥

అని సెలవిచ్చినారు.

తా॥ శాంతులును, మహాత్ములును, సంత్ సత్పురుషులును అయిన యీ బ్రహ్మజ్ఞానులు వసంతఋతు వెట్లు సర్వ జీవోపాధులకు ఆహ్లాదకరమై ప్రమోదమును గూర్చునో, అట్లే సర్వులకు ప్రమోదమును గూర్చుచు, భయంకరమైన సంసారార్ణవమును తాము తరించి యున్నప్పటికీ, కేవలం ఇతర జనులను తరింపజేయుటయే తప్ప, అన్యాపేక్ష లేకయే, లోకమున తిరుగుచుందురు.

ఇట్టి ఆత్మదృష్టితో చేయు కృషియే సేవయని చెప్పబడును. సేవ్యవస్తువు తానేయై సేవచేయుటయే సేవా ధర్మము యొక్క ఆదర్శము. ఏరూపముదాల్చినసేవ యుత్తమోత్తమము? అన్న వస్త్రాదులు, గృహక్షేత్రాదులు ఆరోగ్య ఐశ్వర్యములు, విద్యా పాండిత్యములు, యితరులకు చేకూర్చుటకై నిస్వార్థముగ తన సర్వముగూడ కేవలకైంకర్య బుద్ధితో త్యాగము చేయుట సర్వవిధముల కొనియాడదగినదే. కాని ఐహిక సుఖ సాధనములగు యివన్నియునశ్వరములేకదా! అట్లుగాక, జనన మరణ రూపమగు యీ ఘోర సంసారబ్ధిని దాటించి శాశ్వతముగా తోటి మానవుల నుద్ధరించు సంకల్పముతో ప్రచారము గావించుచూ తమ ఆచార విచారములచే మార్గదర్శకులైన మహాపురుషుల సేవాధర్మమే పరమోత్కృష్టము.



# 3. గురుస్వరూపము

1) తనకు మంత్రోపదేశము చేసిన గురువు మానవాకృతిలోనున్నాడు. ఆయనయున్ను పాంచభౌతికమైన శరీరము కల్గి యెల్ల శరీరధారులకు సామాన్యమైన జన్మ మృత్యుజరా వ్యాధులకు లోనై యున్నాడు. గురు అనగా పెద్దది. స్వరూప మనగా తనయొక్క రూపము. అనగా తనయొక్క తొలి రూపము. తొలిరూపమనగా సృష్టికి పూర్వము వున్నది. ఆ రూపమే సృష్టియందు అనేక రూపములై అందుకు తగిన నానా నామములు (పేరులు) వహించినది. సృష్టికి పూర్వం ఏకమైయున్న వస్తువే, "ఏకం అనేకం భవతి" అని చెప్పబడినట్లుగా నానాత్వము పొందినది. అరూపములలో మంత్రోపదేష్టయగు గురుని రూప మొకటి. కనుక గురుని యొక్క నిజరూపము లేక తొలి రూపము సృష్టికి పూర్వమున్న 'పరమాత్మ యొక్క' రూపమే; కనుక మానవాకృతిలో నుండి మంత్రోపదేశము చేయు గురువున్ను యీదృష్టితో చూచిన గురుస్వరూపమే అయివున్నాడు.

2) 'అపరమాత్మ'ను, తటస్థ లక్షణము, స్వరూప లక్షణము, అతద్వ్యావృత్తి లక్షణము అనువానిచే గుర్తించవలెనని శాస్త్రము చెప్పుచున్నది. సృష్టి స్థితి లయములు చేయువాడే లేక ఆ విధంగా మారెడువాడే పరమాత్మయని చెప్పుట 'తటస్థలక్షణము' ఆద్యంతములయందు అనగా సృష్టికి పూర్వాపరములయందు తొలిరూపము మాత్రమే గుర్తించు వాడే వుండడు. తటస్థ లక్షణముచే దానిని గుర్తింపజాలము. యిదికాదు, యిదికాదంటూ నామ రూపము లన్నిటినీ నిషేధించగా శేషించునదేదో అదే పరమాత్మయని చెప్పుట 'అతద్వ్యావృత్తి' లక్షణము. యీ లక్షణముచే నిషేధింపబడిన వస్తువులే తెలియును గాని శేషించిన వస్తువేదో తెలియబడదు. ఏ లక్షణములు సహజమై పరమాత్మను విడచియుండవో ఆ లక్షణములచే పరమాత్మను గుర్తింప ప్రయత్నించుట 'స్వరూప లక్షణ'మని చెప్పబడినది. పరమాత్మను గాని ఆ పరమాత్మ పొందిన నానా నామ రూపాత్మకమగు జీవేశ్వర జగత్తును గాని ఆ సచ్చిదానందములు విడచి వుండవు.

శ్లో॥ అస్తి భాతిప్రియంరూపం నామచే త్యంశపంచకం.
ఆద్యత్రయం బ్రహ్మరూపం, జగద్రూపం తతోద్వయం

--- వేదాంత పంచదశి

అనగా 'అస్తిభాతి ప్రియ'ములు (సచ్చిదానందము) మూడూ ఆ పరమాత్మ స్వరూపములనిన్ని, రూపనామములు రెండూ జగద్రూపమనిన్ని చెప్పబడినదేగాని, నిజంగా యోచిస్తే, నామరూపములున్న చోటనే సచ్చిదానందములు తెలియబడుచున్నవి. కనుక

'స్వరూపలక్షణ' మని చెప్ప బడ్డ సచ్చిదానందములు 'జగజ్జీవేశ్వరులయందూ సృష్టికి పూర్వమందున్న పరమాత్మ యందున్నూ కూడనున్నవని చెప్పి తీరవలసినదే. 'పరమాత్మ యందున్న'వని యెట్లు చెప్పనగునని సందేహము కలుగవచ్చును. ఆపరమాత్మ యందు 'లేనిచో' పరమాత్మనుంచి వచ్చిన కార్యరూపజీవేశ్వర జగత్తునందు యెట్లువచ్చును ? యీదృష్టితో చూస్తే సర్వమూ (సాకార నిరాకారములన్నీ) స్వరూపముతో గూడియున్నవే యగును. కనుక గురుని పాంచ భౌతికరూపముగూడా గురు స్వరూపమే యనదగును. కనుకనే "గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వర । గురుస్సాక్షాత్ పరబ్రహ్మ ....." అంటూ గురుగీత కీర్తించినది. కనుక సృష్టియందున్న సమస్తమూ సృష్టి కారణమగు బ్రహ్మమూ గురుస్వరూపమే,యీ స్వరూప లక్షణముచే మాత్రమే గురుస్వరూపమును తెలుసుకొనగలము.

గురుస్వరూపమనగా పెద్దదికదా ! దేనికన్నా పెద్దది ? అంటే, సృష్టిలో కేటాయించియే ఒక్కవస్తువును తీసుకొన్నా వాని అన్నింటికన్న పెద్దదన్నమాట. సృష్టిలోపంచభూతములు పెద్దవి. పృధివి మొదలు వుత్తరోత్రావకదానికంటే మరియొకటి పెద్దది. పెద్ద, చిన్న, అణువు విభువు యిత్యాదివన్ని సాపేక్షిక శబ్దజాలములు, కనుక గురుస్వరూపము కూడా సాపేక్షికమే. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అని గురుస్వరూపము అణువుగానూ విభవుగానూ కూడా యున్నది. కనుక కొద్ది గొప్పలుగా నుండేదంతా గురుస్వరూపమే.

ఐతే పరిపూర్ణ పరబాహ్యమో ? అది పెద్దది కారు, చిన్నదీగాదు. రెండవదే లేదు. కనుక దానిని దేనికంటే పెద్దదీ దేనికంటే చిన్నదీ ననవలెను ? ఆ పరిపూర్ణము తప్ప రెండవ దేమీలేనేలేదు కనుక అది కేవలం నిరపేక్షికమై యున్నది. అది గురుస్వరూపమూకాదు. లఘుస్వరూపమూకాదు. ఐతే శ్రీశివరామదీక్షితులవారు తమ గ్రంథములో "శరీరం లేనిది పుట్టని చావనిది, మొదలు కొనా లేనిది, రాకడ పోకడ లేనిది, సకల దేశాలయందు చలించకయున్నది, సర్వకాలాలయందు జ్ఞానకర్మలు లేక వున్నదీ, తనకుతానే స్వతస్సిద్ధమై చలించకయున్నది. గురుస్వరూపము అటువంటింది" అన్నారే. అంటే పరిపూర్ణమే గురుస్వరూపమని అన్నట్లేకదా ! అని శంకకలుగ వచ్చును. ఐతే యీ వాక్యములను యీ క్రింది విధముగా సమన్వయింపవచ్చును. (1) గురుస్వరూప మటువంటిది అన్నారు. గాని అదే గురుస్వరూపమన లేదు. నా నిజరూపమే గురుస్వరూపము కాని యిది యెంతపెద్దదైనా నిరావరణమైన పరిపూర్ణములోనే ఆవరణసహితము అగు నేను వున్నాను కనుక నాకంటే (చెప్పవలసివస్తే) అదే పెద్దది అనవలెను. కనుక ఆ దృష్టితో అది గురుస్వరూపము అనగాపెద్దది అని దీక్షితుల వారన్నారన్న మాట. నేను వుండి దాన్ని గురించి చెప్పటానికి పూనుకుంటే దానిని నాతో పోల్చుకొని నాకంటే పెద్దది గురుస్వరూప మనవచ్చునుగదా ! (2) దీనికి మ్రొక్కే రితర జేజేలు అని అన్నప్పుడు మాత్రమే అది గురువుకు గురువై బయలుకు బయలై వున్నది. యీ దృష్టితో దానిని గురుస్వరూపమన్నారు.

కనుక సృష్టి కారణమైన బ్రహ్మము (పరమాత్మ) మాత్రమే గురుస్వరూపము. పరమాత్మతో తాదాత్మ్యము చెందియున్న వారికి మాత్రము పరిపూర్ణమే గురుస్వరూపమని చెప్పవలెను. నిక్కచ్చిగా చెప్పవలెనంటే, పరిపూర్ణమును గురుస్వరూపమనిగాని, మరొకటనిగాని చివరకు పరిపూర్ణమనిగాని నోటితో పలుకనేరాదు. పలికితే అట్లు పలకబడినది యెరుకయే గాని పరిపూర్ణం కాజాలదు.

వున్నవి రెండే. (1) పరిపూర్ణము (2) లేని యెరుక (లేక గురుస్వరూపము) లేని యెరుకయే సృష్టికారణముగు బ్రహ్మము.

శ్లో॥ స్వయం బ్రహ్మమయో భూత్వా,
తత్పరం చావలోకయేత్.

అంటూ గురుగీత విధించుచున్నది. కనుక బ్రహ్మస్వరూపమగు గురుస్వరూపమే నీవై నీకన్యంగానున్న పరిపూర్ణ పరబ్రహ్మమును అవలోకనము చేయమంటోంది పైగురుగీత శ్లోకము. రెండు గురు స్వరూపములుండజాలవు గనుక గురు స్వరూపమైన తనకు అన్యమగు పరిపూర్ణము గురుస్వరూపము అని కూడ ననరాదు.



## 4. గురుగీతా ప్రయోజనము

గురుగీత యెట్లా విర్భవించెనో తెలుసుకొంటే గురుగీతా ప్రయోజనం తెలియగలదు. పార్వతీపరమేశ్వరులు కైలాస శిఖరం పైన ఉపవిష్టులై యుండగా ప్రపంచమందలి జీవులశ్రేయస్సు కోరి, పరమేశ్వరుని పార్వతి కొన్ని ప్రశ్నలడగ సాగెను. అందు ముఖ్యమగు ప్రశ్న యిది -

శ్లో॥ కేన మార్గేణ భో స్వామిన్ !
దేహి బ్రహ్మమయోభవేత్ ........?

అన్నదే ఈప్రశ్న. "ఏ మార్గముచేత జీవుడు బ్రహ్మమయుడు కాగలడు?" యిందుకు సమాధానంగానే గురుగీత చెప్పబడినది. కనుక గురుగీత ప్రయోజనం జీవుడు బ్రహ్మస్వరూపుడగుటయే అని వేరేచెప్పనక్కరలేదు. జీవుడు బ్రహ్మస్వరూపుడగుట అనగా ఏమి? యినుము పరుస వేదీ స్పర్శచే బంగారము అగుట వంటిదా ? కానేకాదు. తనకు తెలిసినా, తెలియక పోయినా, జీవుడు బ్రహ్మస్వరూపుడయ్యే వున్నాడు. కాని జీవుడు అది మరచి తాను కర్తయూ, భోక్తయూనై వివిధ కర్మలు చేయుచూ తత్ఫలితముగ జనన మరణరూప సంసారచక్రమున బద్ధుడగుచున్నాడు.

చక్రవర్తి పరుండి నిద్రపోతూ, కలలో తాను దరిద్ర స్థితిలో వున్నట్టున్నూ, అష్టకష్టములనుభవించుచు దుఃఖించుచున్నట్లున్నూ కలలో తనకు దుఃఖమెట్లు పోవునని ఆలోచించుచున్నట్లుగానే జీవుడు ఈ ప్రపంచమున అనుభవించు దుఃఖము యొక్క అత్యంత నివృత్తికి అనేక మార్గములను అన్వేషించు చున్నాడు. కలలోనున్న చక్రవర్తి దుఃఖమెట్లు పోవును? నీవు చక్రవర్తివిగాని దరిద్రుడవు కానేకావు అని ఆ కలలో ఆతడాప్తవాక్యము విని ఆరూఢం చేసుకుంటే వెంటనే అతనికి దుఃఖనివృత్తి కలుగును. అట్లే శిష్యుని కలలో తోచిన గురునిబోధ శ్రవణం ద్వారా జీవుడు మరచిపోయిన స్వస్వరూపము మరలనెరిగి తనకన్యంగా పరిపూర్ణబ్రహ్మమున్నదని తెలిసి సర్వభ్రాంతి రహితస్థితి చెంది జన్మరాహిత్యము చెందుచున్నాడు.

గురుగీత ఏసందర్భములో ఆవిర్భావము చెందినదో ముందుగా గ్రహించవలెను. పార్వతీదేవి పరమేశ్వరునికి మ్రొక్కి (1) గురుమహాత్మ్యమెట్టిదో, (2) జీవుడు సంసారము నుండి ఎట్లు విముక్తి చెందునో (3) జీవుడు ఏమార్గములో బ్రహ్మమయుడు కాగలడో వివరించి తెలపమని తొలుదొల్త ప్రశ్నించెను.ఈ ప్రశ్నలన్నిటికీ సటూధానములు విపులముగా గురుగీతలో వివరింపబడినవి. అంతియేగాక గురుమంత్ర జపము సక్రమంగా చేయు భక్తుడు ఏకామ్యార్థ సిద్ధికై చేయునో అందుకు తగిన, దేశకాలముల నిర్ణయించిఏదిశకుసమ్ముఖంగా ఏఆసనంపై కూర్చుని జపము చేయవలెనో గురుగీత వుపదేశించుచున్నది.

గురుడు నరుడు అనేభావన మేమాత్రమున్నా శిష్యుని ఆశయసిద్ధి కాజాలదు. కనుక గురుమూర్తి కేవలం పరమాత్మ స్వరూపుడే అను లక్ష్యము సిద్ధించుటకై గురుమూర్తికి శిష్యుడు వినయముతో శరణాగతుడైతను మన ధనము లేవిధముగా అర్పణ చేయవలెనో గురుగీత విధించుచున్నది.మానసిక పూజా విధానంలో శిష్యుడు శరీర యింద్రియ మనఃప్రాణప్రత్యగాత్మలను మనోవాక్కాయ కర్మలచే ప్రతినిత్యము గురునికి నివేదన చేయువిధానము గురుగీత పేర్కొనుచున్నది. ''తస్మైశ్రీగురవే నమః'' అనేమకుటంతో అనేక గురుస్తోత్రశ్లోకములు గురుగీతయందు పొందుపరపబడియున్నవి. అంతఃకరణ పరిశుద్ధికొరకును శిష్యుని మనోఏకాగ్రతకును శిష్యుడవలంబించవలసిన కర్మాచరణ విధానము నిర్ణయింపబడినది.

గురుస్వరూప నిర్ణయము గావించుటేగాక, కేవలాత్మ నిర్ణయము గావించి పరిపూర్ణబోధ దృఢమగుటకై గురుగీత తోడ్పడుచున్నది.

ఇంతేగాక గురుగీత సద్గురు సచ్ఛిష్యుల అధికార లక్షణములు. శుశ్రూషావిధానము, ముక్తిలక్షణములు వివరింపుచున్నది. కనుక గురుగీతపఠించనివాడు గురుభక్తుడు కాజాలడు. గురూపాసన, గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ, పరిపూర్ణ రాజయోగమును అవలంబించినవానికి ఎంతో ముఖ్యము. గురుగీతాజపము, యిది సిద్ధించుటకు ప్రధానసాధనము.



# 5. గురుపూజయెందుకు ?

శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడును, అరూఢ జ్ఞానియునగు సద్గురుప్రాప్తి గలుగుటయే దుర్లభము. అథవా, అట్టి మహానుభావుడు లభించినను, యాతని (1) యుపదేశము (2) బోధ (3) మార్గదర్శకమగు నాతని యాచరణము మాత్రమే మనకవసరముగాని, యాతని పూజించి యర్చించి యిష్టదైవమురీతి నాతని నారాధింపనేల ? తనవంటి మానవ మాత్రు నొకనిని యారాధించుటవలన గల్గు ప్రయోజన మున్నూ లేనిచోగల్గు హానియునేమి ? యిత్యాది విషయముల విచారించుటయే యీ వ్యాసోద్దేశము. ఇందుకు శ్రుతి స్మృతి ప్రమాణములు యీ వ్యాసకర్తరచించిన పరిపూర్ణదర్శనం 327,328 పేజీలయందు కాననగును.

"తనకు గురువగుగాక ! తనవంటి మానవుని పూజించుట యవివేకము గాదా" యని యధిక్షేపించువారుగూడ స్వార్థ భూయిష్ఠులై తమ వంటి మానవులను పూజించుచున్నారో లేదో తమ హృదయములను ముందుగా కొంత శోధించి చూచుకొనుటెంతయు ముఖ్యము. ఉద్యోగమాసించియో యుద్యోగాభివృద్ధి నాశించియో, యున్నతోద్యోగులకు వీరు ఫల పుష్పాదులు సమర్పించుటలేదా ? పడి పడి పాదాక్రాంతులగుట లేదా తన బిడ్డల కాయుద్యోగి పేరు కూడ బెట్టుకొనుచున్నాడే ! ఇది యంతయు నాయుద్యోగిని పూజించుట గాదా ? పై యుద్యోగి ప్రాపక సంపాదమునకు కృషి చేయుచు కేవలము భగవంతుని సహితము విస్మరించుచున్నాడు. స్వార్థులై మహాకవులగు కాళిదాసాదులు సహితము రాజాశ్రయము గోరి "యీవే యింద్రుడ వీవే చంద్రుడ' 'వని యాయా రాజన్యుల దోషాపనయనము చేయుచూ గుణాధానము కల్పించుచూ త్రిమూర్తుల గూడ నాతని కీడురారని గేలిచేయు స్తోత్ర పాఠముల చేయుట మానవపూజ గదా ? వీర పూజ నెరుంగని దేశము పృథివిపై గలదా ? వీర పూజ మానవపూజ గాద్యా ?

సజీవులై తమ భావి సుఖోదయమునకు తోడ్పడగల వారిని దేవునికన్న మిన్నగా పూజించుటయే గాక చనిపోయిన అధికారి మృతకళేబరములపై గూడ పూలవానలు గురిపించుటయూ ! ఖనన దహనసంస్కారములకు పూర్వము వారి కళేబరముల చెంత దీర్ఘోపన్యాసములా ! వారి గోరీలకు భర్మహర్మ్య నిర్మాణములా ? చనిపోయిన వాని కళేబరమునకు అంత్య సంస్కారమునకు పూర్వ మాతని బంధువులు యేదో యొకరూపమున అర్చన జరిపించుట అన్ని మతముల వారిలోనూ ప్రత్యక్షముగా మనము జూచుట లేదా ! అయ్యరు కాఫీ హోటలులో యిడ్లీసాంబారులో యిస్లామియా మిలటరీ హోటలులో అంతకన్న తామసాహారములో

బ్రహ్మముహూర్తముననే భక్షించి నోరువిప్పిన ధూమకాష్టగంధము తప్ప విద్యాగంధ మణుమాత్రము బయల్పడని బ్రాహ్మణ నామదేయమాత్రుడగు నొకమూర్ఖుని పితృదేవతల పేరున తన యింటి కాహ్వానించి పూజించి, యర్చించి యాతని పాదోదక లేశస్నానమున తాను తరించితిననియు తన పితృ దేవతలకు శాశ్వత బ్రహ్మలోకప్రాప్తి చేకూరెననియు మన వారు విశ్వసించుట లేదా ? కన్యాదాన సమయమున, పెండ్లి కుమార్డు తనకన్న చిన్నవాడైనను ఎంత నిరక్షర కుక్షి అయిననూ మూర్ఖుడైనను, యాతని పాదములు కడిగి యా పాద తీర్థము శిరస్సున చల్లుకొని తనున్నూ తన పూర్వోత్తర వంశస్థులున్నూ తరించినామని యుప్పొంగుట లేదా ? విగ్రహారాధన మన హిందూ మతముననే గాక యితర మతముల యందునూ ఏదో రూపమున కొద్దియో గొప్పయో వ్యాపించియుండ, జడరూపమైన లోహశిలాదారు ప్రతిమలున్నూ పైన వుదహరించిన నిర్జీవ కళేబరములున్నూ, అనర్హులైన మానవ నామధేయుల నామరూపములున్న పూజనీయములై యుండ తనకు శాశ్వత నిర్వాణస్థితి చేకూర్చ గల సద్గురుమూర్తి పూజనీయుడు గాదా !

మరియును గురుపూజ యనునది సర్వమతములయందునూ సర్వదేశముల యందునూ న్యూనాధిక భేదములతో యేదో రూపమున వర్ధిల్లుచునే యున్నది. మన దేశమున ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతస్థు లాయాపీఠాధిపతులను ఆయా సాంప్రదాయక సన్యాసులను పూజించుచున్నారు. బౌద్ధ, జైన, శిఖ్ఖు గురువులును పూజాదికముల పొందుచుయున్నారు. మహమ్మదీయ క్రైస్తవులయందును వారి వారి మత గురువులను దేవుని తరువాత దేవునంతటివానిగా చూచుకొనుట మనము గమనించుచునే యున్నాము.

అదియును గాక లౌకిక విద్యలను గఱపి శిష్యులకు బ్రతుకు తెరువు చూపి వారి యైహిక సుఖములకు మూలకారణుడగు యుపాధ్యాయుడు సహితం వందనీయుడని సర్వులంగీకరించిన విషయమే.

తనకా విధమున పరమోపకార మొనర్చిన గురువునందు శిష్యులకు గల కృతజ్ఞతా బుద్ధియే యిందులకు కారణముగదా ! బ్రహ్మవిద్యోపదేశికుడగు గురువునందు గూడ యట్టి కృతజ్ఞత చూపిన చాలదా ? యనిన చాలదు. ఏలనన లౌకికి విద్యల బోధించునతడు కార్యగురువు, జగద్రూపముగా బ్రహ్మపదార్థము తోచబడుటకు హేతుర్భూతమైన యజ్ఞానము మూలా జ్ఞానమనబడును లేక కారణాజ్ఞానము యని అనబడును. జగత్తు నందు తోచబడు వస్తు సముదాయము యొక్కయు ఆయా వస్తువుల యొక్క గుణాదుల యొక్కయు విజ్ఞానము కలుగక పోవుటకు కారణమగునది తూలాజ్ఞానము లేక కార్యస్వరూపా జ్ఞానము యని యనబడును కనుక కార్యగురువు యీ అజ్ఞానము నశింపచేసి భౌతిక విజ్ఞానము గల్గించి యిహలోక సుఖమునకు మాత్రమే తోడ్పడగల్గుచున్నాడే గాని కారణగురువువలె యీ మూలాజ్ఞాన నాశముగావించి జనన మరణ ప్రవాహము నుండి యుద్ధరింపజాలడు. పరబ్రహ్మమును తాను స్వయముగా గుర్తెరిగిన

గురువు యీ పరబ్రహ్మ స్వరూపుడే గాని అన్యముగానది శాస్త్ర ప్రతిపాదన. అందుచే అట్టి యీ గురుతత్వ మెద్దియో విచారించి పిదప యాతని పూజాదిక మెట్లవసరమో గమనింపవలసియున్నది.

గురు స్వరూపము సగుణ నిర్గుణ రూపములై యున్నది. సగుణ స్వరూపము సత్వ రజ స్తమోగుణాత్మకము నామరూప క్రియా సహితము. శ్లో॥ గురుస్సత్వ యోవిష్ణు ః రాజ సశ్చతురాననః తామసోరుద్రరూపేణ .... । సత్వగుణ స్వరూపుడగునపుడు గురువే విష్ణువు ; రజోగుణోపేతుడగునపుడతడే బ్రహ్మ ; తమోగుణ విశిష్టుడగునపుడతడే రుద్రుడు. అందుచే నాతడు 'అత్రినేత్రశ్శివస్సాక్షాత్' మూడవ కన్ను లేని శివుడు 'ద్విబాహుశ్చహరిస్స్వయం' రెండుచేతులు మాత్రమే గల విష్ణువు, 'అచతుర్వదనో బ్రహ్మ' నాలుగు ముఖములు లేని బ్రహ్మయునై యున్నాడు. అంతియే గాక నామరూపాత్మకమగు సర్వమునూ త్రిగుణాత్మకమే గనుక సర్వమును గురుస్వరూపమే మరియును ప్రణవ పాదచతుష్టయమున గల 'అ'కార 'ఉ'కార 'మ'కార అర్ధమాత్రకలలో 'అ'కార 'ఉ'కార 'మ'కారములు మూడున్నూ సత్వ రజ స్తమస్సులగు గుణస్వరూపముగాను అర్ధమాత్ర నిర్గుణ స్వరూపమగు పరమాత్మగాను శాస్త్రములు చెప్పుచున్నవి. కనుక 'అ'కార 'ఉ'కార 'మ'కారములు మూడున్నూ గురుని యొక్క సగుణ స్వరూపమును, అర్ధ మాత్రక గురుని నిర్గుణ స్వరూపమును అయివున్నవి. గనుక గురువే పరమాత్మ స్వరూపుడగుచున్నాడు అందుచే త్రిగుణ గర్భితమును త్రిగుణ సామ్యస్థితియునగు అవ్యక్తనామక మూలప్రకృతియును; త్రిగుణాతీతమనియు, అర్ధమాత్రకా స్వరూపమనియు నిర్ణయించబడిన యధిష్ఠాన వ్యాపక బ్రహ్మమును గురునియొక్క నిరాకార స్వరూపములు. 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి' గురస్సాక్షాత్ పరబ్రహ్మ' 'గురుమధ్యే స్థితం విశ్వమధ్యేస్థితో గురుః' 'గురోః పరతరం నాస్తి' యిత్యాదిప్రమాణము లిచ్చట ననుసంధేయములు. గు,రు, అను అక్షరద్వయమును 'గు'కారము మాయాస్వరూపమనియు 'రు'కారము మాయా భ్రాంతి విమోచక మనియు గురుగీత చాటుచున్నది.

కనుక పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సకల జడాజడ స్వరూపములలో 'గురోరన్యం నవిద్యతే' గురువుకన్న నన్యమగు జ్ఞేయవస్తువెద్దియును లేదు. కనుక తానున్నూయా గురుస్వరూపుడే. కనుకనే పరమభాగవతాగ్రేసరుడగు ప్రహ్లాదుడు. 'తనయందు నిఖిల భూతములందు నొకభంగి సమహితత్వంబున' వర్తించగల్గెను. ఆ గురుస్వరూప మపరోక్ష సాక్షాత్కారమగుట చేతనే 'విష్ణుడింతియగాని వేరొండు లేదని' యానంద వార్ధిలో తేలిపోగల్గెను. 'సర్వవ్యాపకో విష్ణుః' కనుక స్వరవ్యాపకమగు నాగురుస్వరూప మును (గొప్ప స్వరూపమును) విష్ణువు పేరిట వినుతించెను. కనుకనే 'యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం' అని గీతావచనము, ఎవరేయేరూపమున భక్తి ప్రపత్తులు జేసినను, అతడు నిజముగా గురుభక్తుడే, గురుపూజనే సేయుచున్నాడు. కాని యాగురుమూర్తి దివ్యానుగ్రహమున గురుస్వరూపమెట్టిదియో గుర్తించి భక్తిప్రపత్తులు చేసిన వాని భాగ్యమింతింతని వర్ణింప నలవికాదు.

సగుణారాధన, నిర్గుణారాధన, యని యారాధన ద్వివిధము. అందు సగుణారాధనయే సర్వేసర్వత్ర వర్ధిల్లుచున్నది. అరాధన యనుటలోనే యారాధ్యవస్తువు సగుణమని సిద్ధించుచున్నది. నిర్గుణారాధన యనునది ఎందునూ పొసగదు. ఏలనన -----

శ్లో॥ కిమావాహన మవ్యక్తే వ్యాపకే కిం విసర్జనం।
ఆమూర్తాచ కథం పూజా కథం ధ్యానం నిరామయే॥

అనగా ధ్యానా వాహనాదికములు నిర్గుణ స్వరూపమునకు ప్రవర్తింపజాలవని భావము. ఉపాసనాభాగమున గూడ ఏమంత్రాధిష్ఠాన దేవత నుపాసించినను యా మంత్రమూర్తిని మానస ఫలకమున గీలించవలెను గదా! అనగా మూర్తివంతమగు యుపాస్య ముండిననే యుపాసన సాధ్యమగును. మాకు మంత్రమును మంత్రమూర్తియు లేదు మేము నిర్గుణోపాసకులమని మహమ్మదీయులు, క్రైస్తవులు, బ్రహ్మసమాజికులు మొదలగువారందురు. కాని సంస్కృత భాషలోనున్నదే మంత్రము లేక ఆద్యంతములు యందొకానొక విలక్షణ పదములున్నదే మంత్రము అను భావన సరికాదు అనియు, మననము చేయబడునదెల్ల మంత్రమేననియు వారు గుర్తించినచో వారి వారి ప్రార్థనా సమయముల నుచ్చరించు వాక్యములు సహితము మంత్రమే. శబ్ద శక్తికి లోబడి వాక్కులు కందెడి పదార్థము శుద్ధనిర్గుణ మెట్లనదగును? కనుక నిర్గుణము యుపాసన యనునవి రెండునూ పరస్పర విరుద్ధములు. అందువలన పూజ, ఆరాధన, ఉపాసన యిత్యాదులన్నియు సగుణమునకేగాని నిర్గుణమున కన్వయింపజాలవు. కనుక ఏమతస్థులైనను భక్తిమార్గమవలంబించు వారందరునూ తొలుదొల్త సగుణారాధకులై యుండక తప్పదు. విగ్రహారాధన మౌఢ్యమనియు, యవివేకమనియు, నిరసింపరాదనియే యిందువల్ల సిద్ధించుచున్నది. విగ్రహారాధన చేయువారాయా విగ్రహములయందలి దారు, శిలా. లోహాదులను మాత్రము పూజించుటలేదనియు, వారివారి యిష్టదేవతల యొక్క మూర్తివంతమునే వారుపూజించుచున్నారనియు వారికి లక్ష్యసిద్ధి గలుగుట కాయావిగ్రహములు తోడ్పడుచున్నవనియు గుర్తించవలసియున్నది. బాహ్యభక్తియందు సాధకుడు వర్తించినంతకాలము సగుణముయొక్క సాపేక్షత తప్పదు. ఆ భక్తి పరిణతిజెంది తన యిష్టమూర్తిని నిఖిల భూతములందు చూడగల్గినచో అదియే అనన్యభక్తి. ఉపాస్య' ఉపాసక భావముగూడ నశించినపుడే యేకాంతభక్తి. అపుడే తన బాహ్యాభ్యంతరములయందు ప్రహ్లాదునకి వలె ఉపాస్యము అఖండరూపమున దోచును. ఇదియే అద్వైతసిద్ధి, ఇదియే యఖండజ్ఞానము అందుచేతనే నిజమగు భక్తుడే నిజమగు జ్ఞానియని పెద్దలు వచింతురు. అనన్యభక్తియందు సర్వ విశ్వమును భక్తుని కుపాస్యమే యగుచున్నది. ఏకాంతభక్తియందు పూజించువాడు పూజనీయుడు అను ద్వైతభావమే నశించును. అపుడే గురుశిష్యోభయ రహితము. అపుడే 'గురువు శిష్యుల నందు- గురు తొక్కటాయె' అను నుడి సార్థక మగును. అట్టి స్థిత్యానుభవము పూర్తిగా గల్గువరకు శిష్యుడు గురుదీక్ష విడువరాదు.

ఇక గురుమూర్తిని పూజించుటవలన కల్గు ఫలమేమియో తెలిసికొందము. గురుస్వరూపమే అధిష్ఠాన పరబ్రహ్మ స్వరూపమనియు అట్టి స్వరూపము తన స్వరూపముకంటే యేమాత్రమూ భిన్నము కాదనియు అట్టి అనుభవము కల్గుటే యద్వైతసిద్ధియనియు తెలిసికొంటిమి. కాని యట్టి యనుభూతి యెట్లు చేకూరును ? శ్రవణ, మనన, నిధి ధ్యాసలచే యట్టి యనుభవము చేకూరగలదనుట వెఱ్ఱిమాట. మహావాక్యముల యొక్క పద పదార్థములను అన్వయ వ్యతిరేక యుక్తులచే విమర్శించిననూ ప్రసంఖ్యానము అనగా జపము వలనను గూడ అపరోక్షానుభూతి కలుగజాలదని శాస్త్రములు ఘోషించుచున్నవి. వాక్యార్థ విచారణచే కల్గిన బ్రహ్మాకార వృత్తి నిరంతరావిచ్ఛిన్న తైలధారవలె నిలువనోపునా ? సమాధిస్థితియందు తాత్కాలికముగ నిలచిన నిల్చుగాక. ఉత్థానదశయం దుండనేరదుగాదా! అట్లుగాక మనో, వాక్,కాలయములచే చేయబడు సర్వకర్మలయందు తానా యధిష్ఠాన పరబ్రహ్మముకంటె వేరు కానే కాదనురీతిగా యాతని సాధన పరిసమాప్తి జెందవలెనన్నచో యాతని కీశ్వరానుగ్రహముండి తీరవలెనని శాస్త్రములు నుడువుచున్నవి. ఈశ్వరుడా గురుస్వరూపముకన్న భిన్నుడు కాదు. గనుక గురుని యనుగ్రహమే తదనుభూతికి సాక్షాత్సాధనముగాని అందు కల్పసాధనములు నిష్ప్రయోజనములే యగుచున్నవి. కనుక యిందుకు సద్గురుపాసనయే రాజమార్గము. గురుదీక్షయే శక్తిపాతము. అందుకే గురుగీతయందు పార్వతీదేవి అడిగిన శ్లో॥ 'కేనమార్గేణ భోస్వామిన్ దేహిబ్రహ్మమయోభవేత్' అను ప్రశ్నకు జవాబుగా 'శ్లో॥ యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ। తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః' అని మహాదేవుడు జవాబిచ్చినాడు. అందుకే గురుగీత చరమ శ్లోకము

శ్లో॥ యస్య ప్రసాదా దహమేవ సర్వం
మయ్యేవ సర్వం పరికల్పితం చ।
యిద్ధంతి జానామి సదాత్మరూపం
తస్యాంఘ్రి పద్మం ప్రణతోస్మి నిత్యమ్ ॥

(అనగా నేనే సర్వమునై యున్నాననియును, నాచేతనే సర్వము కల్పింప బడినదనియు, ఆరూఢజ్ఞానము గల్గుటకై నిత్యమూ సద్గురు పాదకమలములను గొల్చెదను) అని ప్రవచించుచున్నది.

నిజముగా యోచించి చూచినచో వేదాంత విచారణతో గూడిన జ్ఞానమార్గము (1) వెన్నెలలో వెంద్రుకను' పసిగట్టగల సూక్ష్మ ప్రజ్ఞాదురంధరుని కేగాని మందబుద్ధిగల వారికిగాదు. (2) 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' సాధన చతుష్టయ సంపత్తి చేకూర్చుకొన్న వానికే బ్రహ్మవిచారము అనియున్నప్పటికి గురుభక్తుడు మందుడైననూ సాధన సంపద్విహీనుడైనను తప్పక జనన మరణ భ్రాంతి రహితుడు కాగలడు. ఏలనన, సూక్ష్మ ప్రజ్ఞాదురంధరుడై యున్నచో సారాసార విమర్శచే

పరస్పర విరుద్ధార్థములతో గూడిన శాస్త్రాదులను శోధించి నిగ్గు తేల్చుకొనగలడేగాని అపరోక్షానుభూతి కలుగవలెనన్న గురుకృప యుండి తీరవలసినదే.

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిః,
పూజామూలం గురోః పదం
మంత్రమూలం గురోర్వాక్యం,
ముక్తిమూలం గురోఃకృపా॥"

అను ధర్మమున స్థితప్రజ్ఞుడై యుండు మందబుద్ధి సహితం నిశ్చయముగా జయమందగలడు. మరియును 'జ్ఞానంవినా ముక్తిపదం లభ్యతే గురభక్తితః, అనియు 'గురోఃప్రసాదతః స్వాత్మన్ స్వాత్మారామ నిరీక్షణాత్" అని యుండుటచే గురుభక్తుడు, జ్ఞానము లేకున్నను, మందబుద్ధియైనను, గురుకృపచేతనే తరింపగలడు. మరియును సాధన సంపద్విహీనుడైన గురుభక్తుడు గూడ తన భక్తిచేతనే యిట్టి సాధన సంపత్తి చేకూర్చుకొని ముక్తుడగుటలో సందియ మేమి లేదు.

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య విషయాక్రాంత చేత సః ।
జ్ఞానప్రభాప్రదానేన ప్రసాదం కురు మే ప్రభో ॥

అని నిత్యము గురుదేవుని ప్రార్థించు శిష్యుడట్టియఖండజ్ఞానము పొందుననుటలో సందియ యేమియును లేదు.

శ్రోత్రియబ్రహ్మ నిష్ఠుడును, ఆరూఢజ్ఞానియునగు గురుమూర్తిని పూజించుట వలన ఆ పూజనీయుని సల్లక్షణము లన్నియు పూజించువాడు తప్పక పొందుటకే గురుపూజ. తాను త్రిగుణాతీతుడగువరకు యీ సగుణ స్వరూపుడగు భౌతికవిగ్రహమునకు పూజచేసియే తీరవలెను. ఆ సద్గురువు "స్వయంతీర్ణః" తాను స్వయముగా తరించినవాడు గనుక "పరాన్ తారయతి" శిష్యులను తరింపచేయగలడు. 'అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం' అయివున్న తత్పదమును దర్శింపచేయగలడు. అట్టి సద్గురుమూర్తిని అట్టి తత్పద దర్శనకాలమందుతప్ప తదితర సమయములం దెల్లపుడు గురుభక్తుడైన వాడు తప్పక భజించవలసియున్నది. గురుపూజ నెరుగనివానికి వెయ్యేండ్లు తలకిందుగా తపస్సుచేసినను పరోక్షజ్ఞానమేగాని అపరోక్షానుభూతి యెన్నటికి కలుగ జాలదు.



# 6. గురుపూజా పరమార్థము

ఏ పూజ యైనను షోడశోపచారయుతముగా నుండును. కాని నిజముగా యీ యుపచారములన్నియు లెక్కించినచో 27 అగుచున్నవి. ఎట్లనగా :- 1) ధ్యానము 2) ఆవాహనము 3) రత్నసింహాసనము 4) పాద్యము 5) అర్ఘ్యము 6) ఆచమనీయము 7) పంచామృత స్నానము 8) శుద్ధోదక స్నానము 9) వస్త్రయుగ్మము 10) యజ్ఞోపవీతము 11) సర్వాభరణ భూషణములు 12) గంధము 13) అక్షతలు 14) అంగపూజ 15) పత్రపూజ 16) నామావళీ పూజ 17) ధూపము 18) దీపము 19) నై వేద్యము 20) ఉదకపానీయము 21) ఫల ఉపహారము 22) తాంబూలము 23) దక్షిణ 24) నీరాజనము 25) మంత్రపుష్పము 26) ప్రదక్షిణ నమస్కారము 27) ఉద్వాసనము.

**ఇందు :** 1) ధ్యానము 2) ఆవాహనము 3) సింహాసనము 4) పాద్యము 5) అర్ఘ్యము 6) స్నానము 7) వస్త్రము 8) యజ్ఞోపవీతము 9) గంధము 10) పూజ 11) ధూపము 12) దీపము 13) నైవేద్యము 14) తాంబూలము 15) దక్షిణ 16) నీరాజనము. యీ పదహారున్ను షోడశోపచారములని చెప్పబడును.

యీ షోడశోపచార విధానము లన్నియు, గురువున కవసరమైయున్నవా ? అంటే గురుమూర్తియు తనవంటి మానవుడే. గురుమూర్తికి తన అవసరములవంటి అవసరము లుండక తప్పదు. కనుక గురుమూర్తిని యర్చించి ఆయన కేవిధమైన లోపమున్ను కలుగకుండా చూచుకొనుట గురుగీతాధర్మమే. శిష్యుని విధియే. ఇందు సందేహ మేమిన్నీలేదు. ఐనను గురుడు నరుడు కాడు! పరుడే అను దృష్టి చేతనే గురుమూర్తిని శిష్యుడారాధించుచున్నాడు. కాని కేవలము మంత్రోపద్రేష్టయగు తన గురువునకు లౌకిక ప్రయోజనములను సమర్పినంత మాత్రముననే తనకు గురుకృపా సంసిద్ధి కలుగునను యుద్దేశముతో కాదనియు స్పష్టమే. లేనిచో గురుమూర్తిని కూర్చుండబెట్టి పూజించి మృష్టాన్న భోజన నూతన వస్త్రాదికము లిచ్చుటతో మాత్రము శిష్యుడు సంతృప్తిపడక నిత్యమాతని పాదుకలకు, లేక చిత్రపట విగ్రహాదులకు యీ షోడశోపచారయుతమగు అర్చన నేల గావించవలెను ? ఇందిమిడియున్న పరమార్థ మేదియో విచారించవలసి యున్నది.

**1) ధ్యానము :-** ఓ పరమపురషా ! సర్వాధిష్ఠానకూటస్థ బ్రహ్మస్వరూపుడవై సర్వభూతాంతరస్థుడవై యుండు దేవుడవు నీవు. స్వాధిష్ఠాన చిదాభాసుండనగు నేను నీస్వరూపస్థితి

చెందుటకై నిన్ను ధ్యానించుచున్నాను ఈ భావనతో ధ్యానము చేయవలెయును. అట్లు చేయుచో ఆ పరమాత్మ స్వరూపస్థితిని తానుజెందునా? అంటే తప్పక చెందగలడు. మనోహి జతువత్ = మనస్సులక్కవంటిది. కరగించి ఏ మూసలోపోసిన ఆ యాకృతి లక్క యెట్లువహించునో అట్లే మనస్సు ఏ స్వరూపముపై ఏకాగ్రత చెందునో మనస్సు ఆ రూపమునే వహించును. ఏ స్వరూపము నైనను వస్తునిశ్చయముగా గురుముఖతః తెలిసికొని ధ్యానించవలెను. అపుడు ఆ అఖండ స్వరూపుడే తాను అను భావన ఆరూఢత కాగలదు. అట్టి ఆరూఢత చెందినవానికే పూర్ణబోధ గనుక యీ దృష్టితో మాత్రమే ధ్యానము చేయవలెను. షోడశోపచార పూజలలో యీ ధ్యానమే ప్రధానమైనది. మిగతావన్నియు దాని కంగములుమాత్రమేనని గ్రహింపవలెను.

**2) ఆవాహనము :-** ఓ పురుషోత్తమా! సర్వవ్యాపక బ్రహ్మముగదానీవు! కనుక నిన్ను ఏస్థానమునకు ఏ స్థానము నుండి ఆహ్వానించవలెను! కనుక నీ కావాహనమే కుదరదు. ఐననూ అల్పదేశమే స్థానముగాగల నేను అఖండ పూర్ణ స్వరూపమును దర్శించలేను. పరిమిత స్వరూపముతో దయసేయమని నిన్ను నాస్థానమున కాహ్వానము చేసుకొనుచున్నాను. " నీకు నిజముగా ఆవాహనము చెప్పుట అనుచితము గనుక నీ అఖండ వ్యాపక రూపమంతటిలో నా తెలివిని వ్యాపక పరుచుటయే ఆవాహనము అని అర్థము చెప్పుట యింకనూ యుత్తమభావము.

**3) సింహాసనము :-** సర్వవ్యాపక స్వరూపుడవగు నీవు కూర్చొనుటకు ఎంతపెద్ద స్థానమును జూపినప్పటికి అది నీకు చాలదుగదా! కాని పరిమిత స్వరూపుడనగు నేను నా అల్ప లక్షణముచే నీకొక సింహాసన మమర్చియున్నాను. నాకొరకు మీరు " ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా " అనురీతిగా యీ సింహాసనము నధివసించుట అని శిష్యుడు గురువును ప్రార్థించుచున్నాడు. ("నీస్వరూపావరణమును వుండజూచి, అందున్నవానిగా భావించుటకే నీకు సింహాసన మమర్చుట" అనునది ఇంకనూ యుత్తమభావము. యీ భావము స్థిరపడవలెనన్న తానే ఆ రూపమును వహించ వలసియుండును.

**4) అర్ఘ్యపాద్యాచమనీయములు :-** ఓ సర్వభూతాంతరస్థ స్వరూపా ! నీవు స్వయంప్రకాశుడవు. అన్నిటికి ప్రకాశమిచ్చువాడవు. "సర్వశుద్ధ పవిత్రో ఉ సౌ" అనురీతిగా నీవు యెప్పుడును మహా పరిశుద్ధుడవే. శుద్ధస్ఫటికమం దెట్టి మలిన మంటజాలనియట్లు, అగ్ని హోత్రమును ఏదియు నపవిత్రము యొనర్పజాలనియట్లు, నిన్నెట్టి మలినము నంటజాలదు. కనుక శరీరశౌచ సంబంధమగు అర్ఘ్యపాద్యాచమనములు నీకు ఎంత మాత్రము అవసరమే లేదు. కాని కామ క్రోధాదులచేతను, శుభాశుభ వాసనలచేతను, పాపపంకిలముచేతను, భ్రాంతి రూపమగు అజ్ఞానముచేతను అపరిశుద్ధుడనైయున్న నన్ను పరిశుద్ధ మొనర్చెదవుగాక యని నిన్ను వేడుకొనుటయే నీ కర్ఘ్యపాద్యాదు లర్పించుటలో గల పరమార్థము.

**5) పంచామృత శుద్ధోదక స్నానములు : -** నీవు అశరీరుడవు గదా! నిరుపాధికుడవు గదా! నీకు స్నాన మజ్జనాదు లెందుకు ? కాని రాగ ద్వేషాది దోషదూషితుండనై యున్న నేను నిర్మల చేతస్కుడనగుటకే నీకు పంచామృత శుద్ధోదక స్నానము లర్పించుచున్నాను.

**6) వస్త్రము :-** ఓ విశ్వస్వరూపా! విరాట్పురుషుడవు నీవు. అకాశమే నీకు వస్త్రమై యుండగా అంతకంటే పెద్దది లేక గొప్పదియగు ఏ వస్త్రమును నీకు సమర్పించగలను ? కాని వస్త్రము నాకవసరము. అట్టినా అవసరమును దీర్తువనియే నీకు వస్త్రమర్పించుట. అంతియేగాక అ విద్యావరణమే సహజమైన వస్త్రముగా గల్గియున్నాను. ఈ ఆవరణ రహిత మొనర్తువని నమ్మియే నీకు దివ్య సువర్ణ పీతాంబరము లర్పించుచున్నాను.

**7) యజ్ఞోపవీతము :-** ఓ చిద్ఘనానంద స్వరూపా! నీవే సూత్రాత్ముడవై సర్వజీవులకు జ్ఞానచక్షు ప్రదాత యుండుటచే నీకు ఉపనయన సంస్కారము (జ్ఞానచక్షు ప్రదానము) గాని ఏత త్సంస్కార చిహ్నమగు యజ్ఞొపవీత ధారణగాని నీకెంతమాత్రమూ అవసరమే లేదుగదా ! కాని అపేక్షా (అప+ఈక్ష = తప్పుచూపు) యుతమై భ్రాంతిరూప యజ్ఞానములో మునిగి తేలుచున్న నాకు యదార్థ జ్ఞానము ప్రసాదించు ఉపనయన చిహ్నమగు ఉపవీతధారణ మవసరమే కనుక యట్టి కించిజ్ఞుడనైన నాకు ఆత్మజ్ఞానోపనయన ప్రదానము గావింపుమని కోరియే నీకు యజ్ఞోపవీతము సమర్పించుచున్నాను. మరియు సాక్షాత్తుగా నీవు సూత్రాత్మస్వరూపుడవై సర్వచరాచర జగత్తునందు హారములో దారమువలె నున్నావని ఆత్మదృష్టి పెంపగుట కొరుకే నీకు సూత్ర మర్పించుట.

**8) గంధం :-** ఓ నిర్వాసనా మౌనస్వరూపా? నీవు నిర్లేపుడవు. అసంగుడవు నీకు సుగంధలేపనాదులా ! ఆకాశమే శరీరముగా గలనీకు దుర్గంధయుతమగు స్వేదాదు లుండునా? సుగంధ లేపనములు కావలసి యుండునా? కాని నాకు అవసరములుకనుక వానిని పుష్కలముగా సమకూర్చుము. మరియు అశుభ వాసనాసితమగు నా అంతఃకరణమును శుభ సంస్కారములతో నింపుమనుటకే సుగంధాదులను కోరుచున్నాను.

**9) అక్షతాభరణములు :-** ఆదిమధ్యాంత శూన్య స్వరూపా! జగద్విలక్షణుడవగు నిన్ను నేనెట్లు అక్షతాభరణములతో నలంకరింపగలను? పంచకోశ విలక్షణత్వము సిద్ధించుటే మానవునికి నిజముగా అలంకరణముగాన అట్టి స్వరూప నిశ్చయజ్ఞానము అక్షతా భరణాలంకారమును కోరి నీకు అక్షతాభరణము లర్పించుచున్నాను.

**10) పుష్పాంజలి :-** నిరింద్రియ స్వరూపుడవగు నీకు పుష్ప సౌరభము లేల ? శుభాశుభ వాసనారాహితస్థితి అనగా నిర్వాసనామౌననిష్ఠ నాకు సిద్ధించవలెనని గోరియే నీకు అనేక పరిమళ పత్ర పుష్పాదులను సమర్పించుకొనుచున్నాను.

**11) ధూపము : -** దేహేంద్రియము లేని నీకు అగరు ధూపములేల? నీ సన్నిధియే దివ్య సుగంధ పరిమళములు వెదజల్లునుగదా ! ఐనను శబ్ద స్పర్శాదుల దోషరూప దుర్గంధము నన్ను ఆవరించకుండా చేయుమని నీకు కర్పూరాగరు ధూపము లర్పించుచున్నాను.

**12) దీపము :-** స్వయంప్రకాశ తేజోనిధీ! సూర్య చంద్రాగ్నులకు ప్రకాశమునిచ్చు స్వయం ప్రకాశమూర్తివగు నిన్నెట్టి అంధకారమును చేరనే లేదుగదా ! నీకు దీపప్రకాశము గావలెనా ? కాని అజ్ఞాన తిమిరాంధుడనైన నాకు నీ జ్ఞాన కిరణమొకటి ప్రసాదింపుమని కోరి నీకు దీపమును చూపు చున్నాను.

**13) నైవేద్యము :-** సదానంద స్వరూపా ! ఆప్తకాముడవు. నిత్యతృప్తుడవు, షడూర్మి రహితుడవు నీకు ఆహారపానీయములు కావలెనా! నీకు నిజముగా ఆకలిదప్పులే యున్నచో నేను దీర్పగలనా? కాని షడూర్ములలో జిక్కి ఎప్పుడికప్పుడే షడ్రసోపేత పక్వాన్న భోజనము లాసించునాకు యదృచ్ఛా లాభసంతుష్టి చేకూర్చుమని కోరి నీకు పక్వాన్న ఫల రస నైవేద్యము లర్పించుచున్నాను.

**14) తాంబూలము :-** శబ్దాది పంచక విషయ వాసనలే ఎరుంగని నీవు తాంబూల చర్వణ సుఖమెట్లు అభిలషింతువు. కాని విషయ మృగతృష్ణా పరిభ్రమణుడనైన నాకు నిర్విషయి కాఖండ బ్రహ్మాకారవృత్తి కల్గవలెనని కోరి నీకు తాంబూల మర్పించుచున్నాను.

**15) దక్షిణ :-** ఓ అఖండ సచ్చిదానందమూర్తీ! నీకే మిచ్చి గురుఋణము దీర్చగలను? అంతయు నీవే. దక్షిణగా నీకే మిత్తును ? కాని నాకింకనూ ద్వైతదృష్టి నశించక "నేను" అను అహంవృత్తి కలుగుచున్నది కనుక నా మనఃప్రాణ వాక్కులను నీకు దక్షిణగా సమర్పించుకొనుచున్నాను.

**16) మంగళ నీరాజనం :-** మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడవై నిత్య మంగళ స్వరూపుడవై యున్న వాడవుగదా నీవు! కనుకనే నీవు సదాశివుడవైతివి. అట్టి నీకు మంగళ నీరాజన మిచ్చుటలో గల అర్థమేమి ? సర్వమంగళములు ప్రకాశమానమగుటకు నీ ప్రకాశమే కారణముగాదా! అట్టి నీ దివ్య స్వరూపమే నేనై ఏక భావన చెందుటయే పరమార్థముగా నీకు మంగళ కర్పూర నీరాజన మర్పించుచున్నాను.

**17) ప్రదక్షిణ నమస్కారము :-** సర్వవ్యాపకస్వరూపా! నీకు ప్రదక్షిణ మెట్లుచేతును ? నీవు లేని చోటేది? నిన్ను మీరినచో నాకు స్థానమే లేదుగదా! నిన్ను విడచి చూచినచో అంతా కుంఠితముగాని వైకుంఠమే. అట్టి పరిపూర్ణస్థితి కల్గుటకు ముందు నేనుకూడా నీవలె పూర్ణుడ కావలె కనుక అట్టి పరిపూర్ణత సిద్ధించుటకై నీకు శరీర మానసికములచే ప్రదక్షిణ నమస్కారము చేయుచున్నాను.

**18) ఉద్వాసన :-** స్వామీ ! సర్వాంతర్యామీ! అంతటానీవే యుంటే నిన్నెక్కడికు ద్వాసన చేయగలను? అసంభవము కాని పరిపూర్ణ పరబ్రహ్మమందు నేనే లేను గనుక మూలాజ్ఞానసహితముగా మూలంలేని యీనాగుర్తెరిగే శరీరమును యీజన్మతో శాశ్వతముగ నుద్వాసన చేయుటకై నిన్నాశ్రయించు చున్నాను.

"యాదృశీ భావనా యత్ర తాదృశీ భవతి నిశ్చయం" యిట్టి లక్ష్యముతో సచ్ఛిష్యుడు గురుపూజాదికము నొనర్చి ధన్యుడగుటయే గురుపూజయందలి పరమార్థము.



## 7. నమస్కార విధానము

నాగరిక జాతులలో వ్యక్తులు ఒకరినొకరు కలుసుకొన్నపుడు తమ తమ స్నేహగౌరవములను వెల్లడించుకొను విధానము వివిధ దేశములలో వివిధ రీతులుగా నున్నది. ప్రసన్నవదనములతో ఒకరినొకరు గుర్తించుకొన్న పిదపపలుకరించుకొనుటకు పూర్వము వుభయుల సమాగమమువల్లన కల్గిన సంతోషప్రకటనకై అభినయరూపముగ హస్తవిన్యాసములు లేక హస్తచాలనాదులు చేయుట పరిపాటి. ఇంకనూ ఆత్మీయత ప్రకటించుకొనుటకై పరస్పరము ఆలింగనము చేసుకొనుటయుకద్దు. ఆ వ్యక్తులలో ఒకరు రెండవవారికంటె అధికార ఐశ్వర్యాది హోదాలలో తక్కువవారైనచో కించిద్దూరమందే నిలచి గౌరవమొక్కువగా ప్రదర్శించుచు ఆయా దేశ మత సాంఘికాచార రీత్యా వందనము చేతురు. కాని భారతీయ సంస్కృతీ సంప్రదాయముల రీత్యా చేయు నమస్కారము అత్యంత విభిన్నమూ, విశిష్టమూ, అత్యుత్తమ భావోపేతమునై యున్నది.

ఐహికసుఖములకై ప్రాకులాడక ఆముష్మికసుఖమునో లేక భగవంతుని సాన్నిధ్యమునో, లేక ప్రత్యగ్బ్రహ్మైక్యమునో లేక కేవల జన్మరాహిత్యమునో ఆశించి అట్టి ఉన్నతాదర్శనమున కనువగు పారమార్థిక జీవనమును సాగించుటయే హైందవ సంస్కృతిలోని ప్రత్యేకత. వారి నిత్య జీవన విధానమంతయును యీ ఆశయసిద్ధికి సాధనభూతముగానే యుండును.వారి ఆచారవిధానమునందంతటా యీ మహోన్నతాదర్శచ్ఛాయలు ప్రస్ఫుటముగా గానవస్తూనే యుండును. పరస్పర సమాగమమునందు వారొనర్చు అభినందన విధానము కూడ విశిష్టమైనదే అట్టి నమాస్కారమును యే రీతిగా యే భావనతో వారు చేయునదియు విచారించవలసియున్నది.

నమస్కార శబ్దార్థమునందు క్రియారూప వ్యవహారము గూడ కొంత యిమిడియే యున్నది. కర్మేంద్రియములలో వాగింద్రియం, పాణీంద్రియములచే నమస్కార క్రియ జరుగుచున్నది.వాగీంద్రియముచే "నమస్కారమండీ" అనో, "నమస్తే" అనో, లేక "దండ" మనో, "దాసోహ"మనో "రాంరాం" అనో, "జైగురో" అనో, "శ్రీగురుభ్యోనమః" అనో పలుకుచుందురు. పాణీంద్రియములచే అనగా రెండు చేతులు జోడించి, అట్లు జోడించిన చేతులను హృదయస్థానమునకో, కంఠస్థానమునకో, భ్రూమధ్య స్థానమునకో, మూర్ధ్ని స్థానమునకో చేర్చుటయే నమస్కారమునందలి క్రియాయావిశేషము. గుర్తెరుగక యేకర్మయూ (ఏపనియూ) ఎవరునూ వుద్దేశ్యపూర్వకముగా చేయరుగదా ! కనుక మనో వ్యాపారము గూడ నమస్కార క్రియయందు యిమిడియే యున్నదిని వేరే చెప్పనక్కరలేదు.

ఐతే, చేతులుజోడించుట ఆయాస్థానములకు చేర్చుట అను క్రియలయుందు (వెనుక) గల భావమేమి ? యిందుకు జవాబు తెలుసుకొనుటకు పూర్వము, అట్టి నమస్కారము ఎవరికి చేయుచున్నారు? అను ప్రశ్నకుత్తరము పొందవలసి యున్నది. ఆనమస్కారము భౌతిక రూపముగానున్న యెదుటి వ్యక్తి యెక్క శరీరమునకా లేక నిరుపాధిక సోపాధికములుగా సర్వమునందు సర్వత్ర సర్వాంతర్యామిగా వ్యాప మైయుండి మొదటి వ్యక్తి యుందునూ వుండివున్న పరమాత్మకా ? శిష్టాచార సంపన్నులగువారు చేయు నమస్కారము పరమాత్మ స్వరూపమునకే యని తెలియవలెను. కనుకనే వారు శరీర సంబంధమగు హస్త చాలనాదులుగాని పరిష్వంగాదులుగాని చేయరు. ఉత్తర హిందుస్థానమునందు హిందువులుగూడ అభివాదన సమయమున ఆలింగనము చేసుకొందురుగదా యని శంకించవచ్చును. కాని ఆదేశమున యెక్కువగా నివసించుచున్న మహ్మదీయులను జూచి వారిననుకరించిన ఆచారములలో నిదియు నొకటి గావచ్చునేగాని యిది శిష్టాచార పద్ధతిగాదు. పరమాత్మ స్వరూప మన్నియుపాధుల యందునూ వుంటే, మానవునకే యెందుకు నమస్కారము చేయవలెను ? మరియును అందులోనూ కొందరికి మాత్రమే యెందుకు చేయవలెను ? అంటే .... మానవోపాధియే యెనుబదినాల్గులక్షల జీవోపాధులయందునూ శ్రేష్ఠమైనదై పరమాత్మ ప్రకాశము అభివ్యక్తమగుటకు మిక్కిలి యోగ్యమైన దగుటయే కారణము. అందునూ పూజ్యులైన యోగుల యందునూ యితర సాధు సత్పురుషులయందునూ ఈ ఆత్మ తేజస్సు పరిపూర్ణముగా నిండియుండును. అందుకే "సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం" అని చెప్పబడినది.

ఇక చేతులు జోడించుటలో గల ప్రత్యేకాభిప్రాయమేమనగా చేతులు రెండైనా పాణీంద్రియమొక్కటేగాని రెండు యింద్రియములు కాదుగదా ! మీయందునూ నా యందునూ యున్న పరమాత్మ స్వరూపమేకమే గనుక, మీరే నేను నేనే మీరు మనమిర్వుర మొక్కటే అను ఉన్నత భావమును ప్రదర్శించుటయే యని చెప్పనగును. సర్వాంతర్యామియగు పరమాత్మకు

మానవశరీరమున ముఖ్యముగా హృదయం, కంఠ, భ్రూమధ్య, మూర్ధ్నిస్థానములు అభివ్యక్తస్థానములు. కనుకనే నమస్కారము చేయు నాతడు జోడించిన కరములను అందేదేని యొక్క స్థానముననుంచి నమస్కరించుచున్నాడు. కనుక వుభయులయందూ, ఆయాస్థానములయందు విశేష ప్రకాశవంతమై యున్న పరమాత్మకే యీ నమస్కారము గాని శరీరములకుగాదు. కనుకనే శరీరస్పర్శతో గూడిన హస్తచాలనాదులు, ఆలింగనములు, యితరేతర సాంఘిక ఆచారములు వారనుసరించవలయునని కోరరు. కనుకనే నమస్కారము అందుకొనువాడు నమస్కారము చేయువాని కంటె యెంత పూజనీయుడైన విశిష్టవ్యక్తి అయిననూ ప్రతి నమస్కారము చేయును.

కరములు ముకుళించిగాని, ముకుళించకనేగాని, వాక్కు చేత గాని, మనస్సుచేతగాని తానున్నూ పరమాత్మకు ప్రతి నమస్కారము చేయును. "రాంరాం" అని కొందరూ, "జైగురూ" అని కొందరూ ఇష్టదైవమునో, గురువునో దలపెట్టు కొందురు. సన్యాసులు తమకెవరైన నమస్కారముచేయుచో "నారాయణ" అని దైవస్మరణ గావింతురు. గురువులు తమ గురువులను లేదా స్వరూపమును సంస్మరించుకొందురు. అభ్యాసకులగు గురుపుత్రులు కర్మణా, మనసా వాచా, ప్రతినమస్కారము చేసుకొందురు. కరములు ముకుళించి శ్రీగురుభ్యోనమః యని వాచా పల్కుచూ తమ గురువులను మనస్సున సంస్మరించుకొందురు. ఈ భావన యెరుగక కేవలనాగరికతా లక్షణములను ప్రదర్శించటకై దేహమే తాను అనుకొనే యితరేతర సాంప్రదాయక పద్ధతుల ననుకరించి అభినందనము చేసుకొనుట వ్యర్థమేగాక కృత్రిమముగూడ నైయుండి హైందవ సంస్కృతిని విస్మరించి విడనాడుటయే అగుచున్నది.

సామాన్యరూపమగు పైన వివరించిన నమస్కార విధానము కంటెనూ శ్రేష్ఠమై విశేషభక్తి ప్రపత్తులను ప్రదర్శించు మరియొక నమస్కార విధానము గలదు. అది కేవలము గురుదైవములకు భక్తులచే చేయబడు సాష్టాంగ నమస్కారము దీనిని గురుగీత ఈ క్రింది విధముగా నిర్వచించుచున్నది-----

శ్లో ॥ దోర్భ్యాం పద్భ్యాంచ జానుభ్యా మురసా శిరసా దృశా
మనసా వచసాచేతి ప్రణామోష్టాంగ వుచ్యతే ॥

తాత్పర్యము :- గురుపాదములపై శిరముంచి, తన భుజములు, పాదములు, మోకాళ్ళు, వక్షస్థలము నేల కంటునట్లు కర్రవలె చాచి బోరగిలపరుండి గురుపాదములను కంటితో జూచుకొనుచూ వాక్కుచే నమస్సులర్పించుచూ మనస్సుచే సర్వార్పణ బుద్ధి బూని దృఢ భావనతో ధ్యానించుచూ చేయు నమస్కారమునకు సాష్టాంగ నమస్కారమని, శరణాగతియనీ యనవచ్చును. ఐతే పాదములకే ఏల నమస్కారము చేయవలెను ? చేతి వ్రేళ్ళ కొనలు, పాదాంగుష్ఠములు శరీరముయొక్క కొసభాగములు. తద్వారా శరీరమునందలి ప్రాణశక్తి విద్యుత్ప్రవాహములవలె

ప్రసరించుచుండును. ఆ పవిత్రశక్తిని గ్రహించి తన శరీరమునందు పూరించుకొనుటకే పాదనమస్కారము నిర్ణయింపబడినది. పాదములను స్పర్శించకుండానే దూరముగా సాష్టాంగనమస్కారము చేయుటవలన యీ ప్రయోజనము సిద్ధించదు. కనుకనే "సాధూనాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాపనాశనం" అని చెప్పబడినది. అందుకే గురుపాదములను శిష్యుడు స్పృశించుట గురువు శిష్యునికి హస్తమస్తక సంయోగము చేయుట. ఇదియే స్పర్శదీక్ష.

శ్లో ॥ తద్విద్ధ ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః॥

అని భగవద్గీత చెప్పుచున్నది. చక్కగా గురువు నర్థించితే తత్వ సాక్షాత్కారముబొందిన యీ గురువు నీకు జ్ఞానము నుపదేశ పూర్వకంగా గల్గించగలడని భావము. ఇందు ప్రణిపాతము అనగా సాష్టాంగ నమస్కారము చాల ముఖ్యము. దీనివలన కలుగు ప్రయోజన మేమో గురుగీత తెలియజేయుచున్నది.

శ్లో ॥ సాష్టాంగ ప్రణిపాతేన స్తువన్నిత్యం గురుం భజేత్
భజనాత్ స్థైర్యమాప్నోతి స్వస్వరూపమయోభవేత్ ॥

**తాత్పర్యము:** - నిత్యమూ సాష్టాంగ నమస్కారము లొనర్చుచూ గురుని స్తుతించి భజించవలెను. దానివలన స్థైర్యము (చంచలత్వము లేని స్థితి,భయ రాహిత్యము, దృఢత్వము గల్గి నీ స్వరూపమునే పొందు అనుభవము) అభిమానాహంకార రాహిత్యము కొరకు సాష్టాంగము విధింపబడినదని యెరుగవలెను. అభిమానాహంకారముల వీడిన వానికే పరిపూర్ణ బోధ. గనుకనే శ్రీ కృష్ణదేశి కేంద్రులవారీ శరణాగతి ప్రాముఖ్యతను తమ కందార్థములలో వుటంకించి యున్నారు. "తన పుణ్యోదయమున గురుని గాంచి యురుతర భక్తిన్ శరణని మ్రొక్కి" యనియును "చరణాధూళిని రెండు కరమూల గొని తన శిరమూన ధరియించి శరణాని యీ శిష్యుడెరిగించు మనెనూ" అనియును "ప్రవిమలచిత్తుడు శిష్యుడు సవినయమున దేశికునకు శరణాగతుడై" అనియును "శరణన్న వారి మస్తకమందు చెయి బెట్టి తిరమూగ యెరుకను దీసి వెయ్యనివాడు ఎందుకో యన్నా" అనియును "తనకు శరణన్న వారల మనసెట్టిదో యరసి" యనియును చెపుతూ వచ్చినారు.

సాష్టాంగనమస్కారయుతమగు యీ శరణాగతికింత ప్రాముఖ్య మెందుకీయవలెను? అంటే నవవిధ భక్తులలో కడపటిదగు ఆత్మ నివేదన మిదే. ఏమీ మిగుల్చుకోకుండా సర్వార్పణము చేయు విధానమిదే. ప్రపత్తిలక్షణము విభీషణ శరణాగతిలో పరాకాష్ట చెందినది. "శత్రు శిబిరమునుండి వచ్చిన నాశిరస్సిదే నీపాదములకడ బడవైచినాను. నాకు శరణిచ్చి రక్షించినా సరే లేదా నా తలను ఖండించినా సరే నీ చిత్తము" యిట్టి ఆత్మార్పణమే సాష్టాంగనమస్కార మందిమిడియున్నది.

ఈ సాష్టాంగనమస్కారములో ఆత్మార్పణ మెట్లుయిమిడి యున్నది? అంటే లమిత్యాది పంచపూజలని గురగీతయందు ప్రసిద్ధముగా చెప్పబడినవిధముగా సర్వమును గురువునకు శిష్యుడర్పించుకొనుచున్నాడు. ఈ 'లం' ఇత్యాది పంచపూజలలో పృథివీభూతము, దాని సూక్ష్మమగు గంధతన్మాత్రా, యింకనూ సూక్ష్మమగు లం బీజము అర్పణ అగుచున్నవి. అట్లే జలభూతము, దాని సూక్ష్మమగు రసతన్మాత్ర, దానికంటెనూ సూక్ష్మమగు వం బీజము అర్పణ అగుచున్నవి. అట్లే అగ్ని, వాయు, ఆకాశభూతములు, వాని సూక్ష్మములగు రూప, స్పర్శ శబ్ద తన్మాత్రలును వానికంటే సూక్ష్మములగు రం,హం, యం బీజములున్న అర్పణ అగుచున్నవి. అంటే బ్రహ్మాండమందలి పంచభూతములు వాని వాని స్థూల సూక్ష్మ కారణరూపములు సహా అర్పణ యగుచున్నవేగాని, పిండాండము పిండాండమందలి అహము అర్పణ యగుట లేదే! అంగడిలోని బెల్లం ఆలయములోని దేవునికి నివేదన చేసినట్లున్నది. అందువల్ల తనకేమిఫలము ? అను శంక కలుగవచ్చును. కాని బ్రహ్మాండమునుండి పిండాండముత్పత్తి అయ్యెనని తెలిసికొన్నవారి కీశంకయే కలుగదు కారణమునే అర్పించునపుడు కార్యమును మిగుల్చు కొనగలడా! బంగారు వడ్డాణములో బంగారమును యిచ్చి వేసి వడ్డాణమును దాచుకొనగలడా! బ్రహ్మాండమును అర్పించునపుడు పిండాండమును సహితం అర్పణ చేయుచున్నాడన్న మాటయే. ఐననూ శిష్యుడే పంచపూజలు చేయుటలో పైన చెప్పిన భావమును కలిగియుండి (మనసా కర్మణా వాచా అన్నారు గనుక) క్రియారూపముగ దానిని ఎట్లు ఆచరించుచున్నాడో సాంప్రదాయక భక్తులకే తెలియును. ఐననూ యించుక వెల్లడించక తప్పదు. "ల" మిత్యాది పూజలు మానసికములే ఐననూ 1) "లం" పృథివ్యాత్మనే గంధతన్మాత్రా, ప్రకృత్యానందాత్మనే శ్రీగురు దేవాయ నమః పృథీ వ్యాత్మకం గంధం సమర్పయామి - అన్నపుడు మంచి గంధమును అర్పించుట క్రియారూపముగాదు. సాష్టాంగముగ ప్రణమిల్లుచూ రెండు కరములు గురుమూర్తి పాదాంగుష్టముల క్రిందికి జేర్చి గంధమును గుర్తెరుగునది ఘ్రాణేంద్రియము గనుక తన నాసికముచే గురుమూర్తి అంగుష్టమును తాక వలెను. తన స్థూల శరీరమందలి పృథివ్యాంశ గుణములగు నరములస్థులు చర్మ నఖ రోమ మాంసాదులను తన సూక్ష్మ శరీరమందున్న గంధ తన్మాత్ర వలన కలిగిన కర్మేంద్రియ పంచకమును తన కారణ శరీరమందలి లం బీజ రూపమగు ప్రాణచలనమున్ను గురుమూర్తి కర్పించుచున్నానని భావించవలెను. అట్లే స్థూలశరీరము అందలి ఆకాశ వాయు అగ్ని జల భూతములయొక్క స్థూలాంశ గుణములను, సూక్ష్మశరీరమున ఆయా తన్మాత్రలచే గలిగిన యింద్రియములను కారణ శరీరమున ఆయా భీజసంబంధమగు ప్రాణ చలనమున్ను అర్పించుచున్నానని భావించవలెను. ఆకాశమును అర్పించునపుడు శబ్దమున గ్రహించు చెవులు వాయువు నర్పించునపుడు స్పర్శను గుర్తించు త్వగింద్రియ చిహ్నములుగా చెంపలు, అగ్ని నర్పించునపుడు రూపమును గుర్తించు నేత్రములు, జలము నర్పించునపుడు రసమును గుర్తించు పెదవులు గురుమూర్తి పాదాంగుష్టములకు తాకించవలెను. "సం" సర్వతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే శ్రీ గురుదేవాయ నమః సర్వాత్మ కాన్

సమర్పయామి అన్నపుడు పంచతన్మాత్ర స్వరూపమై ప్రత్యగాత్మా పరమాత్మల రూపముగా నున్న అఖండాత్మ స్వరూపమునే అర్పించవలెను. ఈ అర్పించు టెట్లో సాంప్రదాయక గురుభక్తులకే తెలియవలెను.

యీ విధంగా తనయందలి స్థూల సూక్ష్మ కారణమహాకారణ శరీరముల నాల్గింటిని ఏమియు మిగుల్చుకొన కుండా అర్పించు భావన ప్రధానమైనది. అప్పుడు గురుమూర్తి అంగుష్ఠముల క్రిందనుండి చేతులు కూడ తీసివైచి ఏ పట్టు లేక తన బ్రహ్మరంధ్రముచే గురుపాదాంగుష్ఠములను తాకించుచూ సర్వము విస్మరించి యుండుట శరణాగతి. సాష్టాంగ నమస్కార మన నిట్టి మహత్తర భావోపేతమైనది. ఇది యేమియు తెలియక, తెలుసుకొనుటకై ప్రయత్నించక, గురు పాదపద్మములకు నమస్కారముచేయువారిని చూచి కొందరు పరిహసింతురు. వారిని అజ్ఞులైన పసిపాలతో సమానముగాచూచి, యుపేక్షించి తమ సాంప్రదాయక పద్ధతిగా ప్రవర్తించుచూ అచరణయందుండుటయే గురుపుత్రుల కర్తవ్యము. "అవినీతులు నిందచేస్తే అయ్యే దేమోయీ! అందులో మనది పోయ్యే దేమోయీ!" అను శ్రీ కృష్ణదేశికుల వాక్యం గుర్తుంచుకొనవలసి యున్నది.



## 8. శిష్యునికి గురువు అవసరమైతే గురునికి శిష్యుడూ అవసరమే

గురువు లేనిచో శిష్యుడు గురుబోధ మర్మధర్మ ములు తెలుసుకొనలేడు. శుశ్రూషా చతుష్టయముచే గురుని సేవించక శిష్యునికి అంతఃకరణశుద్ధి కలుగజాలదు. పరమాత్మ యొక్క సాకారరూపమే గురువు అని గురుని యుపాసించని యెడల గురువాక్యమునందు శిష్యునికి విశ్వాసము కలుగ జాలదు. వస్తువును గురువు చెప్పి చూపించి స్వయంగా గురుమార్గమునందు తాను నడిచి, శిష్యుని నడపించనిచో, మార్గమందు కలుగు అవరోధములను అతిక్రమించి శిష్యుడు గమ్యస్థానము చేరలేడు గురుని కృపకలుగనిచో పరిపూర్ణము గాని, యెరుకగాని, ఎరుకను విడచువిధానముగాని, యెరుకను విడచి అశరీరపద్ధతిలో, ఆగామి రహితముగా, రాజయోగ రీతితో, కర్మలాచరించు కర్మకౌశలముగాని శిష్యునికి లభింపజాలవు. వేయేల ! గురువు లేనిచో శిష్యునికి భ్రాంతిరహిత మెన్నడూ సిద్ధించదు. ఆశయసిద్ధి యెన్నడూ పొందజాలడు. కనుక గురువు శిష్యుడు తరించుటకు అత్యంత ముఖ్యావసరమైయున్నాడు అనుటలో యెవరికిన్ని ఎట్టి సంశయములున్నూ యుండజాలవు.

ఐతే, గురువు శిష్యుని తరుణోపాయమునకు అవసరము కాని గురువునకు శిష్యుని అవసరమేమి కలదు ? అని ముఖ్యముగా విచారించవలసిన విషయమే.

1) గురుపరంపరాప్రాప్తమై తనకు భ్రాంతిరహితము గావించు బ్రహ్మవిద్య తనతో అంతముకాకుండా అచంద్రార్కము అవిచ్ఛిన్నముగా సాగి భావికాలపు జిజ్ఞాసువులకు మముక్షువులకు మేలు చేకూర్చవలెనన్నచో ప్రప్రథమంలో తనకు శిష్యులవసరము.

2) "ఆసుప్తే రామృతే కాలేన యం వేదాంత చింతయేత్" అనగా నిద్రవచ్చేవరకు తాను వేదాంత విచారణ యందే కాలము వ్యతీతము చేయవలెనని విధించబడినదిగదా! తానొక్కడే తనలో తానే సర్వకాలం విచారణ చేసుకొంటూ వుండుట కష్టసాధ్యముగదా! శిష్యులుంటే వార్కి బోధించుటతో పాటు తనకు మననక్రియకూడా ఏక కాలమందు సాగు చుండగలదు.

3) "నేటి కాలమున సాందీపునివంటి సద్గురువు శ్రీ కృష్ణునివంటి సచ్ఛిష్యుడుండుట దుస్తరము. ఎరుకకు మరుపు సహజము. గురువుకడ నేర్చిన విద్య మరచిపోవుట తటస్థింప వచ్చును. కనుక గురువు తానేర్చిన బోధను ప్రయత్నపూర్వకముగా జ్ఞప్తియందుంచు కొనవలసియున్నది శిష్యునికి పాఠములు చెప్పుటలో విషయములు తిరిగి జ్ఞప్తిలోనికి విధిగా వచ్చుటయు, గురుని స్మృతిపథములో నిలచిపోవుటయు జరుగును.

4) "విననేర్చి చెప్పనేర్చిన మనుజులకే దీనిలోని మర్మము దెలుసున్" అని శ్రీ కృష్ణదేశి కేంద్రులు కందార్థములలో శెలవిచ్చియున్నారు. కారణమేమి ? వినుటలో కష్టమేమియును లేనేలేదు. కాని చెప్పవలెనన్నచో 1) విషయము జ్ఞప్తి లోనుండవలె 2) అది క్షుణ్ణముగా తనకు అర్థమైయుండవలె. 3) శ్రోతలకు తాను చెప్పు విషయము బాగుగా వారికర్థమై హృదయమున హత్తుకొనుటకై, శ్రుతి యుక్తి అనుభవములు దృష్టాంతములు జతకూర్చి బోధించవలెను. యిందుకొరకు గురువు కష్టించి ఎప్పటికప్పుడు బోధనకు తగిన సాధనసామాగ్రి సమకూర్చుకొని శిష్యులకు బోధించుచుండవలెను. 4) చెప్పునపుడు తనకే కొన్ని సందేహములు కలుగు చుండును. వాటి పరిష్కారమునకై బాగుగా ఆలోచించుటయున్ను తనకు తోచనిచో తన గురువు నడిగి తెలిసికొనుటయున్ను తను నేర్చిన బోధ తనకు ఆరూఢ మగుటయున్ను జరుగును. 5) వినేవారికి, అర్థము కాకుంటే చెప్పేవానిదే లోపము కనుక చెప్పే నేర్పు అవసరం. అది కలుగుటకై శ్రద్ధగావిని, నిరభిమానముగా శంకలడిగి తెలుసుకొను శిష్యులవసరము.

6) దీర్ఘకాలము గురువును సేవించి, యింటనేనా, లేక వెంటనేనా గురువుతో కలసియుండి సర్వసందేహనివృత్తి గావించుకొన్న వాడే నిజముగా ఆదర్శవంతుడగు గురువు కాగలడు. నేటి కాలమున యిట్టి అవకాశములు బహుతక్కువ. తాను సందేహవిముక్తుడైగాని బోధాధికారము స్వీకరించరాదు. కాని అట్లుగాక ముందుగానే బోధాధికారులై ప్రచారమునకు పూనుకొన్న వారుకూడ

తాము తరించవలసియున్నది కదా! వారికి శిష్యులుండినచో శిష్యులకు చెప్పునిమిత్తమైనను కృషి చేయుట కల్గుచున్నది. నిత్యమూ శిష్యులకు ఆచరణ విధానమును గూర్చి యుపన్యసించుటలో, దొంగసన్యాసి నిజసన్యాసి అయినట్లు కొంత కాలమునకు తాను బోధించు విషయములను ఆచరణలో పెట్టవలెనని తాను మార్గదర్శకుడై, గురూపదిష్ట మార్గమున తన శిష్యులను నడిపించవలెనని కోర్కెగల్గును. ఆచరించి చూపించినవాడే ఆచార్యుడు కదా! కనుక జన్మరహిత మోక్షమునందు తనకు ఏమాత్రము అభిలాషయున్నా గురువు శిష్యులను సేకరించి వారిని నడిపించుటలో తానుకూడ బాగుపడి కృతార్థుడు కాగలడు.

కనుక గురువు ఆరూఢజ్ఞానము పొందుటకు శిష్యులుండుట కూడ చాల అవసరము. శిష్యులు లేనిచో ఎవరికి చెప్పును ? చెప్పుటలో కాని తన లోపములు తనకు తెలియవు. సర్వము తెలయుననీ, అందుకే తనకు బోధాధికారము ప్రసాదింపబడెననీ అపోహచెంది, అహంకారియై, తనను తానే మోసగించుకొన్న వాడుగుచున్నాడు.

మా తట్ట మేము తగులపెట్టుకొంటే చాలు, మేము తిరిగి పుట్టకుండాపోతే చాలు మేము గురువులమూ కానక్కరలేదు, లోకాన్ని వుద్ధరించనూ అక్కరలేదు" అని చాలామంది అనుట సమంజసమే కాని "అది స్వార్థదృష్టి. నీ మార్గం సరి అయినది; దీనివలన తప్పక జన్మరాహిత్యము కలుగును అని నీకు సంతృప్తి కల్గిన రోజున, నీవంటి మానవులకు దారిచూపి వారికికూడ యిట్టి యుత్తమస్థితి లభింపచేయుట నీవిధి. మరొక విధంగా నీగురు ఋణము యెట్లు తీర్చెదవు? సమర్థత లేనపుడు యితరులకు చెప్పబూనుట యెంతదోషమో, సమర్థత వున్నపుడు ఇతరులకు బోధింపకుండా వూరుకొనుటకూడా అంతే దోషమని పెద్దలంటున్నారు. మరిన్ని అదిలో సమర్థతలేదని తోచవచ్చును. కాని శిష్యులను చేరదీసి వారికి బోధించినకొద్దీ నీకు సమర్థతయూ చేకూరగలదు. అందరూ పల్లకీ యెక్కితే మోయువారెవరు? అని కొందరనవచ్చును. పల్లకీ యెక్కి మోయించుకొనుటకు, సత్కారమానపూజాదులకొరకు ధన కీర్తిప్రతిష్ఠలకొరకు గాదనియు, గురుత్వము గైకొనుట "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ" అన్నట్లు తన జన్మ తరుణోపాయము నిమిత్తమున్నూ లోకకల్యాణార్థమున్నూ అని గుర్తించవలెను. అందుకే శ్రీ కృష్ణ దేశికేంద్రులు --

"దేశాటనంబు చేసితి, వ్రాసితి గ్రంథములు కొన్ని
వర గురు శిష్యుల్ చేసేటి చర్చ వింటిని,
రోసితి మోక్షాద్యపేక్ష రూఢిగ వినుమీ
నీవిట్టి యారూఢత గనుమీ;
దేశికు దయబుట్ట చేసి శుశ్రూష, వుపదేశముకొని
వుపదేశమిచ్చితి మెచ్చి. . . . "

అంటూ కందార్థం వ్రాసినారు "మీపీఠంలో శిష్యులకంటె గురువుల సంఖ్య హెచ్చుగానున్నదే" అని యితరులంటారని భాధపడనవసరంలేదు. అందులో మనది పోయ్యేదేమోయీ అని యూరుకొంటేనే మంచిది. శిష్యులు సరిగా కృషిచేయుట లేదు అని యేగురువున్నూ బాధపడనవసరంలేదు. తాను సక్రమమంగా కృషిచేస్తూవుంటే శిష్యులపుడే తమ గురువునుచూచి బాగుపడగలరు. నాకు ద్వాదశాంతమైపోయినది. నేనేమి చేసినా, ఏమిచేయకున్నా సరే అని ఆత్మవంచన చేసుకొంటూ తాము చెడినదేగాక తన్నాశ్రయించిన వారిని గూడ చెరుపక "యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరే జనాః" అని సదా జ్ఞప్తిలోనుంచుకొని ఆచరణకలిగియుండవలె.

మానవుడు జన్మాది మరణపర్యంతం ఒక విద్యార్థియే యైయున్నాడు. ఏది తెలుసుకొంటే సర్వం తెలియబడునో దానిని తెలుసుకొన్న పిదప అతని జిజ్ఞాస పూర్తియగును. ఆ పిమ్మట జన్మరహిత విధానమునందు ఆరూఢత సాధించవలెను. మానవుడై పుట్టినందులకూ గురుచరణముపట్టి నందులకూ ఈ పరిపూర్ణబోధయందు నిష్ణాతుడగుటయే చరమలక్ష్యము. గురుశిష్యన్యాయంలో తప్ప ఈ లక్ష్యము సిద్ధించదు. గురువు తానుగూడ శిష్యుడనే విషయం జ్ఞప్తియందుంచుకొని చతుర్విధ శుశ్రూషలు గావించుకొనుచు తన శిష్యులకు మార్గదర్శియై ఆదర్శప్రాయమైన జీవితము గడపవలెను. గురువైనంతమాత్రంతో తానశరీరియు అచలపరిపూర్ణుడును యైపోతినని అపోహపడరాదు. కనుక ప్రతి శిష్యుడున్ను తాను గురువగుటకును, శిష్యులను చేర్చి వారికికూడ తరణోపాయం కల్గించుటకును ప్రయత్నించుట వుత్తమ లక్ష్యమే యగును.



# 9. ఆత్మ సాక్షాత్కారము సాధన ధర్మములు

మోక్షమునాశించిన ప్రతివ్యక్తికి ఆత్మసాక్షాత్కారం ముఖ్యావసరము. కేవలము జన్మరాహిత్యముకొరకు నిర్ణయింపబడిన పరిపూర్ణ బోధయందుకూడా ఆత్మను, కేవలాత్మను వస్తునిశ్చయముగా తెలుసుకొనవలసియున్నది. పరిపూర్ణ గురువు, ఆత్మయొక్క వస్తునిశ్చయము శిష్యునకు బోధరీత్యా కలిగించును. కాని ఆ బోధను శ్రవణము చేసిన శిష్యునికి ఆత్మ వస్తువునందు బుద్ధినిశ్చయమేకాని వస్తు సాక్షాత్కారము కలుగదు. అట్లుకలుగుటకై గురువు తెల్పిన అనుష్ఠాన ఆచరణము గురువు చెప్పిన వస్తువునందు ధ్యానము చెందించుట ముఖ్యావసరము. అట్టి ఏకాగ్రతాసాధనకు శిష్యునకు సహాయభూతముగా ఉండు కొన్ని ధర్మములు నియమములు ఈ

వ్యాసములో తెలియపర్చుచున్నాము. వానిని పాటించినచో శిష్యుడు తప్పక కృతకృత్యుడు కాగలడు.

1) ఈజన్మలోనే తాను తప్పక జన్మరాహిత్యస్థితిని సాధించితీరవలెనని సాధకుడు దృఢమైన దీక్షను పూని యుండుట ముఖ్యావసరము. గురూపదిష్ట మార్గమందు ప్రతినిత్యము అలసత్వములేక సాధనచేయవలెను.

2) ధ్యాన సమయమున తన కెట్టి అవరోధములు వికల్పములు యితరులవలన కలుగకుండా ఒక ఏకాంతప్రదేశ మందు సాధన చేయవలెను.

3) తన అంతఃకరణయందు మిగతా సమయములందు పారమార్థిక చింతతో నింపివేయవలెను.

4) ఇష్టదైవమునందు గురుస్వరూపమునందు భక్తిప్రపత్తులుకలిగి విశ్వమంతా గురుస్వరూపమేననే భావముతో ప్రతిప్రాణిని ప్రేమించుట అలవర్చుకొనవలెను.

5) చెట్టు మొదట నీళ్ళుపోస్తే చెట్టుఅంతకు ఎట్లు బలముచేకూరునో అట్లే ఏప్రతీకమునందు గురుస్వరూపదృష్టి నిలిపి అర్చించినా విశ్వమయుడైన గురుపరమాత్మనే పూజించినవాడగును.

6) అహంభావముగాని, ఆత్మోత్కర్షగాని పనికి రాదు. దురహంకారము వదలి గురుపరమాత్మకు ఆత్మనివేదనము చేసుకొన్నవాడై తాను గురుపరమాత్మ చేతిలోని కీలుబొమ్మ అయివున్నట్లు భావించుచూ ఉండవలెను. అప్పుడే తన వ్యష్టి అహంకారము పూర్తిగా నాశనము కాగలదు.

7) ఇతరుల తప్పులను యెంచక తనయందుండు దోషగుణములనే అన్వేషించి వానిని రూపుమాపుటకే ప్రయత్నించవలెను.

8) నీకు బలము చేకూరేవరకు నీ సాధన అంతయు రహస్యముగానే కొనసాగించుకో వలెను.

9) నీ స్వార్థమువిడచి ఎట్టికోరికలు లేక భూతదయ కల్గి ప్రవర్తించవలెను.

10) గొప్పకొరకు పదిమందిచూచి, నిన్ను మెచ్చుకొనవలెనని ఏమాత్రము ఆశించక రాజసిక తామసిక సాధనల జోలికిపోక కృషిచేయవలెను.

11) "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం" అను పెద్దల వాక్యం విస్మరించక చేతనయినంతలో ఉపకారమే కాని అపకారముమాత్రము యెవరికి చేయరాదు. నీకపకారము చేసినవారియెడల ఉపేక్షవహించి నీకుచేసిన కీడును సాధ్యమైనంత త్వరగా మరచిపోవుటకే ప్రయత్నించవలెను.

12) నీ అంతఃకరణకు నొప్పి కలిగించు విషయములను గూర్చి ఏమాత్రము స్మరించక సంతోషముకలిగించు మంచి విషయములను నీవువిన్న గురుబోధలను మాత్రమే జ్ఞప్తిలోనికి తెచ్చుకొనవలెను.

13) ధ్యాన కాలమునందు నీ నేత్రములు మూసుకొనుటయు ఇతర శబ్దములు చెవులపట్టకుండుటయు ముఖ్యమని గమనింపవలెను.

14) నీ భుక్తిక్రియ కొరకు తాపత్రయము చెందకూడదు. ఏలననగా నీవు నీ ఇష్టదైవముతో లేక నీ గురుమూర్తితో కలసి ప్రయాణము చేయుచున్నావు. కనుక నీకేలోపము రాదను ధైర్యముతో యదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి జీవయాత్ర సాగించవలెను.

15) శౌచమనగా స్థూలశరీశుద్ధి మాత్రమే అని భావించక అంతఃశౌచము ముఖ్యముగా ఉండవలెను. అంతఃకరణశుద్ధి కలుగుటకై సత్ కర్మాచరణము కలిగిఉండవలెను. అయ్యోనేను స్నానమయినను చేయలేదే ఇప్పుడు నేను ఎట్లా సాధన చేతును ? అని అనుకోకుండా సకాలమునకు నీ అనుష్ఠానము ధ్యానమువగైరాలుమానక చేసుకోవలయును.

16) జపసమయమునందు నా మనస్సు నిలుచుటలేదే ? నేను చేయు జపము వ్యర్థమేమో అని భావించక విక్షేపముకలుగు మనస్సును మంత్రమునందుగాని ధ్యేయవస్తువునందుగాని మరల మరల స్థిరత్వము చెందించుటకై ప్రయత్నము చేయుచుండవలెను.

17) మంత్రానుష్ఠానము లేక ధ్యానముజేయుస్థానము మార్చక ప్రతినిత్యమూ ఒకే స్థానమునందు ఒకే ఆసనమునందు కూర్చోనవలెను. కాని అట్లని స్థానము మారినది కనుక ఇపుడనుష్ఠానము చేయకూడదని మానరాదు.

18) అట్లే ఒకే సమయమునకే ధ్యానము ప్రారంభించి చేయవలెను. కాలాతిక్రమణమైనదని సాధనమానరాదు. తిథివారనక్షత్రములు బాగుండలేదనిగాని వర్జ్యములు దుర్ముహూర్తములు వున్నవనిగాని యెంచి సాదన మానరాదు. పరమాత్మ దృష్టిలో కాలమంతయు పవిత్రమైనదే.

19) సాదనాకాలమందు తామసికాహారము విడనాడుట చాలా ముఖ్యము. ఏలననగా "ఆహార శుద్ధౌ సత్వ శుద్ధిః" అనిన్ని "సత్వాత్సంజాయతే జ్ఞానం" అనిన్ని తెలియవలెను.

20) అనుష్ఠానమంత్రం ఒక్కటిగానే వుండవలెను రెండుగాని ఇంకా ఎక్కువగాని జపించరాదు. అట్లే ధ్యేయవస్తువుకూడా ఒక్కటియే అయి వుండవలెను. లేనిచే ఏకాగ్రత కుదరదు.



# 10. రాజయోగము

మంత్ర, లయ, హఠ, రాజయోగములని నాలుగుయోగములు చెప్పబడినవి. ఇందు మంత్ర లయ హఠ యోగములు అభ్యాసయోగములని చెప్పబడును. జ్ఞానయోగమునకే రాజయోగమని పేరు. జీవ బ్రహ్మైక్యమే నాలుగు యోగములకు లక్ష్యము. కాని యిందుత్తమమైనది జ్ఞానయోగము కనుక దానికి రాజయోగమని పేరిడిరి. అభ్యాసయోగములు కఠోరసాధనలతో కూడుకొన్నవి. కష్టసాధ్యమైనవి యగుటయే యిందుకు కారణము. జ్ఞానమార్గమందు కేవలము వేదాంత వాక్యములు చెప్పి మురియుటవలన నేమియు లాభము లేదనియు, తారక యోగాభ్యాసముచే మనశ్శుద్ధి, సాంఖ్యవిచారణచే ఆత్మనిశ్చయము గల్గి అమనస్క యోగముచే అనుభవము పొందుటవల్ల అద్వైతసిద్ధి పొందవలెనని, అవ్వుడుగాని మోక్షము సాధింవలేదని తారకసాంఖ్యామనస్కములు అవసరమని నిర్ణయించిరి. ఐతే తారకామనస్కముల యందు యోగసాధన తప్పనిసరి యగుటచే యీ రాజయోగముకూడ సులభమైనదికాదు. భగవత్ గీతయందలి ఆత్మసంయమయోగమే రాజయోగమని కొందరు అందురు. దీనికిన్ని యమ, నియమ, ఆసన, ప్రణాయామ, ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులు ముఖ్యములై యున్నవి. యీ యోగముకూడా చిత్తవృత్తులను నిరోధించి యేకాగ్రత సాధించుటకు మార్గమైయున్నది. యిందు విధించిన సాధనలు కఠినములును కష్టసాధ్యములును, కొంతమందికే యవ్వన దశలో మాత్రమే సాధన చెయ్యతగినవిన్ని అయివుండుటచే యిదియును రాజయోగమనుట చెల్లదు.

అందరూ అన్నివయసులలో సాధించ తగినదియును, పరమోత్కృష్టమైన శాశ్వత జన్మరాహిత్యమును లక్ష్యముగా కలదియును అయిన పరిపూర్ణబోధమార్గము రాజయోగము అనదగినది కాని మిగతా యోగములు రాజయోగమను పేరునకు తగినవి కావని చెప్పుటకు సందేహము లేదు.

ఈ పరిపూర్ణ రాజయోగమునకు అన్నమయ పురుషయోగము, ప్రాణమయ పురుషయోగము, మనోమయ పురుషయోగము, విజ్ఞానమయ పురుషయోగము అను నాలుగు యోగములును పూర్వాంగములై యున్నవి. యిందు అన్నమయ పురుషయోగమువలన త్రికరణశుద్ధి సాధించి, ప్రాణమయ పురుషయోగము వలన ప్రాణశక్తిని రక్షించుకొని, మనోమయ పురుషయోగమువలన యింద్రియ మనస్సులపై ఆధిపత్యము వహించి, విజ్ఞానమయ పురుషయోగమువలన ఆత్మనిశ్చయము పొందినవారెవరో వారే అచల పరిపూర్ణ రాజయోగమును సాధించుటకు అర్హులు.

పరిపూర్ణ రాజయోగమునందు ముముక్షువునకు గురువు అఖండ జ్ఞానస్వరూపమగు యెరుకను పంచతన్మాత్ర రహితమగు పరిపూర్ణమును తెలియజేసి జననమరణములకు అత్యంత మూలకారణమగు యెరుక భ్రాంతి,నుండి విడిపించగలడు. అయితే ఆ గురువునందు శిష్యునకు అచంచలమైన సంపూర్ణ విశ్వాసముండవలె. మరిన్ని గురువు బోధించిన పరిపూర్ణ బోధమార్గముకాక యితర మార్గములు అన్నియూ పూర్తిగా విడిచివేయవలెను. గురువు కేవలము దైవమేకాని యితరము కాదు అను దృఢత్వము ప్రాప్తించుటకై గురువును యిష్టదైవము వలె వుపాసనగావించలెను. కుక్క ఎంత బలిసినా గోనెబస్తాలను మోయలేనట్లు యెంత మహాశాస్త్రపండితుడు ఐనా, గురుభక్తి, గురుసేవ, గురునిష్ట లేనిచో ఆపాండిత్యము కుక్క బలుపువలె వ్యర్థము. చంచల బుద్ధిచేత లోకమునందు ఉన్న యితర సాధనా మార్గములలో దేనియందును భ్రాంతి లేక గురువు విధించిన మార్గమునందే శిష్యుడు పయనించవలెను.

కర్మవలన జన్మ జన్మవలన కర్మ యిట్లు అనంతముగా సంసారచక్రమునందు చిక్కి మానవుడు పరిభ్రమించుచున్నాడు. కనుక జన్మరాహిత్యము ఆశించిన శిష్యుడు పునర్జన్మకు హేతుర్భూతమైన విధముగా కర్మ ఆచరించరాదు. కనుక కర్మాచరణమునందు అప్రమత్తుడైయుండవలెను. యెట్టి కర్మ ఏరీతి ఆచరించినచో అది పునర్జన్మకు తీసుకొనిరాదు? అను విషయము గుర్తించి అట్టికర్మ ఆవిధముగా జేయవలెను. అందుకు ముముక్షువుయొక్క స్వధర్మము యేదో అది తెలిసి కొని స్వధర్మమును విడువక పరధర్మమును పూనక వర్తించుట ముఖ్యము.

స్వధర్మము అనగా నేది ? స్వ+ ధర్మము = స్వధర్మము. అనగా తనయొక్కపని. స్వ అనగా తాను. తాను. అనగా ఆత్మ కనుక పరమాత్మ నిర్మిత విధానమునకు అనుకూలముగా నుండు విధమున ప్రవర్తించుటయే స్వధర్మము. ఈ స్వధర్మము నిష్కామంగా,నిస్వార్థముగా ఆచరించవలెను.లేనిచో ఆ కామ్యకర్మ అంతఃకరణమందు సంస్కారములనుత్పత్తి చేయును. ఆసంస్కారములే ఆగామికర్మయై, ఆకర్మానుభవమునకు యోగ్యమైన శరీరములతో తిరిగిపుట్టి ఆయా సుఖ దుఃఖములను అనుభవించవలసి వుండును. దేహపోషణకై, చేయు కర్మలు స్వధర్మము లగునా ? కాదా ? యను శంక కొందరికి కలుగవచ్చును. అంటే "శరీర మాద్యంఖలు ధర్మ సాధనం" అని చెప్పబడుతోంది కనుక స్వధర్మాచరణ కొరకే శరీరమును పోషించవలెను. ఆవిధంగా భుక్తిక్రియకు ప్రధానస్థాన మీయబడినది. అవసరమైతే స్వధర్మ నిర్వహణకొరకు దేహమునుకూడా త్యజించవలెను. "స్వధర్మే నిధనం శ్రేయః" అంటూంది భగవద్గీత. ఏది స్వధర్మము? అంటే, భక్తునికి భక్తియే స్వధర్మము. కర్మయోగికి కర్మ జ్ఞానయోగికి జ్ఞానము, ప్రచారకునికి ప్రచారము స్వధర్మములు. ఎవరి స్వధర్మమును వారు పాలించవలెను. వ్యక్తినిబట్టి, దేశకాల పాత్రతలనుబట్టి స్వధర్మము మారుచుండును.

పుట్టుకవలన మాత్రమే స్వధర్మము నిర్ణయించి జీవితమంతా ఆధర్మము పాలింప బడవలెననుట సరికాదు. బ్రాహ్మణాది చతుర్వర్ణములలో పుట్టినవారికి ఆయావర్ణధర్మములే స్వధర్మములని నేటి సమాజములో వర్తింపచేయుట ఆచరణ యోగ్యముకాదు. జన్మతః యితర కులములవారయ్యును బ్రాహ్మణ ధర్మమును పాలించి బ్రహ్మవేత్తలైన రాజర్షి బ్రహ్మర్షులైన వారందరు స్వధర్మము నుల్లంఘించిన వారేనా ? స్వధర్మము వయసునుబట్టియు ఆశ్రమమును బట్టియు దేశకాల పరిస్థితులను బట్టియు మారుచుండును. వారివారి పూర్వజన్మ సంస్కారముల ననుసరించియు వారివారి ప్రత్యేక గుణత్రయ సమ్మిశ్రమమువల్లకు వ్యక్తులకు అంతఃకరణప్రవృత్తి ప్రత్యేక అభిరుచియు కల్గుచుండును. ఒక కులమున పుట్టినవారందరికీ వర్ణాశ్రమారోపిత ప్రవృత్తి మాత్రమే కలుగునని చెప్పరాదు. ఒకనికి యింజనీరింగు, ఒకనికి వైద్యము, మరొకరికి వేదాంతము వగైరా శాస్త్రములయందు ఆసక్తి అభినివేశములు కలుగుచుండును. పిల్లలను పరీక్షచేసి వారి ప్రవృత్తిననుసరించి వారికి శిక్షణనిచ్చి, ఆయా శాస్త్రములందు వారిని నిపుణులను గావించుపద్ధతి రష్యా మొదలగు దేశములందు అమలులోనున్నది. అభిరుచిలేని విద్యయందు ఎంత కృషి చేసినా ఎవరున్ను ఉన్నత శిఖరముల నందుకొనజాలరు. అట్లే పారమార్థిక విషయములలో కూడా ఒకడు భక్తిమార్గము నందు ఒకడు కర్మమార్గమునందు, మరొకడు జ్ఞానమార్గమునందు, వేరొకడు యోగమార్గమునందు కృషి చేయుటకు సహజప్రవృత్తియు అర్హతయు కలవాడై యుండును. కనుకనే భక్తులు, యోగులు, జ్ఞానులు, అన్నికులములయందునూ బుట్టి పేరెన్నికగన్న వారైరి. ఎవరు ఏకర్మచేసినా, ఆకర్మను నిర్దుష్టముగాను, సౌష్టవముగాను చేసి ఆ కర్మలో ప్రథమ శ్రేణికి చేరుటయు కళాపోషణ, సంగీతము, సాహిత్యము, చిత్ర శిల్పకళలు, దానశీలత, పరాక్రమము, వైరాగ్యము వగైరాల యందు ప్రావీణ్యత పుట్టుకతో రావలసినవే గాని తెచ్చిపెట్టుకొంటే రావు. యిట్టి ప్రజ్ఞాదురంధరులు అన్ని కులములందూ నుండుట కదియే కారణము. కనుక స్వధర్మములపై నాధార పడియున్నదను వాదము విశ్వసనీయము కాదు. పారమార్థిక కృషికి మానవులందరూ అధికారులే కాని ఆ కృషి చేబట్టు వారు బహు అల్ప సంఖ్యాకులు మాత్రమే. కనుకనే భాగవతంలో 'అచ్చపు చీకటింబడి గృహవ్రతులై విషయోపభోగులై చచ్చుచు బుట్టుచున్ మిగుల చర్వితచర్వణులై వారికిన్, చెచ్చెర గల్గునే పరులు చెప్పిననైన, నిజేచ్ఛనైన నే మిచ్చిననైన, గానలకు నేగిననైన హరి ప్రబోధముల్ ॥ అని చెప్పబడింది.

"మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

తా॥ అనేక వేలమందిలో ఒకానొకనికి మాత్రమే పారమార్థిక ప్రవృత్తి కలుగుచున్నదని, అందొకానొకడు మాత్రమే కృతకృత్యుడు కాగల్గుననిన్ని అర్థం. అందుచే వర్ణములకు నిర్ణయింపబడిన కర్మయే స్వధర్మమని నిర్ణయించుట ఎంత మాత్రమూ సరికాదు. మానవుడై పుట్టినందుకు ప్రాయశః

తన స్వస్వరూప సాక్షాత్కారము పొందుటకు వలయు కృషియే స్వధర్మము. ఐహికాముష్మికపురోభివృద్ధి సాధించుటయే మానవ కర్తవ్యము కనుక కర్తవ్యకర్మ చేయుటయే స్వధర్మము. అంతఃకరణ ప్రవృత్తి ననుసరించి కలుగు ప్రేరణల యుక్తాయుక్తములను బుద్ధితో చక్కగా విమర్శించి సమిష్టి శ్రేయోదాయకమగు కర్మలను చేయుటయే స్వధర్మము.

మానవులు కర్మఫలములు అంటకుండా కర్మాచరణ చేసినచో జన్మరాహిత్యము సిద్ధించగలదని సర్వాంగీకృత విషయము. కర్మలే చేయకుండ వూరుకొంటే సరిపోలేదా ? అని కొందరందురు. కాని కర్మ చేయకుండా వుండుట అసంభవము. ఏలననగా, వూరక వుండటయే కర్మ. నిద్రపోయిననూ కర్మయే. కాష్ఠవత్తుగా శరీరావయవముల చలనము నిరోధించిననూ చలనాత్మకమగు వాయుభూతాంశముచే ఏర్పడిన మనస్సు నిస్సంకల్పరూపముగా నుండజాలదు. కనుక కాయిక వాచికకర్మ లరికట్టిననూ మానసికకర్మ తప్పదు కనుక కర్మ త్యాగమున పుణ్యజనకమగు సత్కర్మాచరణము రజోగుణ లక్షణము. పుణ్యఫలము వుత్తమ జన్మలకు కారణమై హిరణ్య శృంఖములవలె బంధ కారణమేయగుచున్నది. జన్మయే కలుగరాదు. అని ఆశించిన వానికి యిట్టి కర్మ నిష్ప్రయోజనము. కర్మ చేయుచున్నను ఫలము అంటకుండా పోవలెను. యిందుకు స్వధర్మమగు కర్మను నిష్కామముగ చేయవలయునని సకల కర్మ ఫలితములు ఈశ్వరార్పణము చేయుట యొక మార్గమనీ గీత ఉపదేశించుచున్నది. ఐతే యెట్టి ఫలమును కోరక యెవరైనను యేకర్మయు చేయుట జరుగదు. మరియు "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని। ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః।

తనయందు సర్వమును సర్వము నందు తనను చూచు సమదర్శియగు యోగి మాత్రమే సకలకర్మలను యీశ్వరార్పణ బుద్ధితో చేయగలడు. ఏలనన అతనికి సర్వమూ యీశ్వరుడే. ఆత్మయే యీశ్వరార్పణబుద్ధి. వేరే తెచ్చి పెట్టుకోవలసిన అవసరమే లేదు. తెచ్చి పెట్టుకొన్న యట్టి బుద్ధియే నిష్ప్రయోజనమే. కనుక ఈశ్వరార్పణ బుద్ధితో కర్మచేయుమని శాసించుటయు నిష్ప్రయోజనమే. ఈ విధమగు కర్మఫలత్యాగము సాత్వికత్యాగము అన చెల్లును.

కర్మ చేయుచూ ఆ కర్మ పునర్జన్మకు కారణభూతము గాకుండుటకు గాను చెప్పబడిన కర్మ త్యాగ, కర్మఫల త్యాగకర్తృత్వ త్యాగము అను మూడు విధానములలోను కర్తృత్వ త్యాగము ప్రశంసింపబడినది. కర్తృత్వత్యాగ శ్రేష్ఠత్వమును గూర్చి చర్చించుటకు ముందు కర్మ వికర్మ, అకర్మ అను విషయములను గూర్చి తెలుసుకొనవలసియున్నది. కర్మయనగా స్వధర్మరూపమగు కర్మని తెలుసుకొంటిమి. కొందరు కర్మయనగా విహిత కర్మయని, వికర్మయనగా నిషేధ కర్మయని, అకర్మయనగా కర్మనే చేయకుండుటయని వ్యాఖ్యానించినారు. కాని అదిసరికాదు. వికర్మయనగా విపరీతేన కర్మ వికర్మ అని అర్థము గ్రహించినట్లుయినది, కాని వికర్మ అనగా విశేషణ కర్మ - వికర్మ అని అర్థము కూడ సాధ్యము అయి ఉన్నది.

ఈ అర్థమే గ్రాహ్యము. స్వధర్మ కర్మాచరణము వికర్మ అనగా విశేష రూప కర్మ యెప్పుడగును? స్వార్థము, ఫలాపేక్ష లేక లోక హితార్థముగ యజ్ఞార్థము లేక యీశ్వర అర్పణ బుద్ధితో చేయు కర్మలు విశేషరూపములగును. కనుక స్వధర్మాచరణము యిట్టి మానసిక ప్రవృత్తితో చేసినపుడే కర్మ సంస్కారములంటవని కొందరు అంటారు. కర్తృత్వము ఉన్నంత వరకూ ఫల మంటక మానదు సర్వమూ ఆత్మయే గాని అన్యమేమీ లేదనే భావన యుంటేనే గాని యీశ్వరార్పణమస్తు అని అన్నంత మాత్రమున యీ కర్మకర్తృత్వము పోదు. కర్తృత్వముంటే భోక్తృత్వము తప్పదు. కర్తృత్వ భోక్తృత్వములు జన్మ పరంపలు విధిగా కలిగించును.

ఆత్మయే సర్వకర్త, కర్తయగు ఆత్మ జీవేశ్వర జగద్రూపముగా మార్పు చెంది కర్మలు చేయుచూవుండి "చేటు పాటులు రెంటిచే వచ్చు ఫలము ముమ్మాటికి అనుభవించి మరణ జననములొంద నతడేర కర్త" అని కృష్ణదేశి కేంద్రులు శెలవిచ్చియున్నారు. ఇది యెరుకయే (ఆత్మయే) అన్నిటికి కర్తయై యున్నది. విశేషించి గురుభక్తుడు - శ్లో॥ శరీర మింద్రియం ప్రాణంఅర్థ స్వజన బాంధవాన్ ॥ ఆత్మ దారాదికం సర్వం సద్గురుభ్యో నివేదయేత్ ॥ అన్నట్లు సర్వస్వము సద్గురువునకు నివేదించినపుడు, పంచతన్మాత్రలను అర్పించి యున్నపుడు యింకనూ కర్తృత్వ బుద్ధి విశేషించి యుండునా ? పరిపూర్ణ పరబాహ్యము నందు యెరుకకు మూలము గాని స్థానము కాని లేదు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అను భగవదాదేశానుసారం గురువునకు శరణాగతుడైనవాడు కర్తృత్వము తన యందు ఆరోపించుకొనుట మూఢత్వమే యగును. తానే లేడు గనుక స్వధర్మ కర్మాచరణములో తాను చేయు కర్మలకు తాను బాధ్యుడు కాడు. ఈ దృక్పథముతో కర్మలాచరించు వానికి కర్మ సంస్కారములు అంటవు. అట్లు చేసిన కర్మయే వికర్మయగును. మరొక విధముగా చూచినా కర్మయు కర్తృత్వమును త్రిగుణకార్యములు మాత్రమే అయియున్నందున గుణములు గుణములయందు ప్రవర్తించును. నేను అసంగుడను అకర్తను, అను చిత్త ప్రవత్తితో కర్తృత్వమును వీడి కర్మలు చేసిననూ కర్మ సంస్కారములు తన్నంటజాలవు. స్వధర్మాచరణము యిట్టి మనః ప్రవృత్తితో ఆచరించుటయే వికర్మ. కనుక కర్మ+వికర్మ = అకర్మ యగుచున్నది. అకర్మయనగా కర్మలు మానుటగాదు. కర్మ చేసియు, చేయని వాడు కావలెను. అట్టి కర్మయే అకర్మయగును. పరిపూర్ణ భావములో, అరూఢత సాధించినవాడు యీ విధముగా కర్మాచరణ గావించి కర్మఫలములు అంటకుండా చేసుకొనును. 'యోగఃకర్మసు కౌశలం' యిట్టి కర్మ కౌశలమే యోగమని గీత చెప్పుచున్నది. యిట్టి కర్మ కౌశలమే రాజయోగము నందు మిక్కిలి ప్రాధాన్యత వహించుచున్నది. యిదియే నైష్కర్మ్యసిద్ధి.

స్వధర్మాచరణము వికర్మగా మార్పుచెందు ప్రయత్నము చాలా అవసరము. ఏ పని చేసినా హృదయపూర్వకముగా త్రికరణ శుద్ధితో చేసిన గాని అది వికర్మ కాజాలదు. ఉదాహరణకు శిష్యుడు గురుమూర్తికి నమస్కారము చేయునపుడు "మన్నాథ శ్రీజగన్నాథో మద్గురు శ్రీ జగద్గురుః"

అని గురువు నందు పరమాత్మదృష్టి తన యందు భృత్యభావము వినమ్రభావము వుంటేనే ఆనమస్కారమునకు విలువ ద్విగుణీకృతమగును. ఆ కర్మ వికర్మయగును. అప్పుడు మాత్రమే తాను చేయుకర్మ, కర్మయోగముగా పరిణమించును. లేనిచో అది కేవలము కర్మగానే వుండును గాని అది యోగమే కాదు. యోగమనగా కలయిక, కూడిక అను అర్థము కదా. కర్మదేనితో కూడి కర్మయోగమగును ? అంటే వికర్మ రూపమగు మానసిక వ్యాపారముతో కూడినపుడే అది యొక యోగమగును. కామక్రోధాధికములతో చేయు కర్మయోగ మెప్పుడైన కాజాలునా ? కర్మేంద్రియ వ్యాపారమున కనుకూలమగు అంతరేంద్రియ వ్యాపారమున్నపుడే అది వికర్మయు, కర్మ యోగమును కాగల్గును. ఇట్టి వికర్మవలననే అంతఃకరణశుద్ధి పిదప జ్ఞానోదయమున్ను అగును. కర్తృత్వత్యాగ పూర్వకమైన స్వధర్మాచరణమే నిజమగు సన్యాసము కాగలదు. కాని కర్మ త్యాగము సన్యాసము కాజాలదు. వికర్మపూర్వక స్వధర్మ నిర్వహణలో కర్మయోగియే జ్ఞానయోగియై విరాజిల్లుటయే రాజయోగమనబడును. రాజయోగి అనగా జ్ఞానియగు కర్మయోగి. అకర్మయనగా అన్నియు చేయుచూ వాని ఫలము అంటక పోవుట. స్వధర్మము సేవారూపముగా (విశ్వ రూపములోనున్న ఈశ్వరుని సేవ) కర్తృత్వరహిత బుద్ధితో నిస్వార్థముగా నిర్వహించినపుడు అది అకర్మయగును యిదియే రాజమార్గము. ఇదే నైష్కర్మ్యము.

రాజయోగమునందు కర్తృరత్వహితమగు కర్మ యోగము యిమిడియున్నట్లే భక్తి జ్ఞానాది సాధనలన్నియు యిమిడియున్నవి. గురూపాసన గురుస్వరూప ధ్యానము పరిపూర్ణ పరబ్రహ్మము యొక్కయు అఖండ యెరుకయొక్కయు వస్తు నిర్ణయరూప జ్ఞానప్రబోధయు యుండును. కనుకనే యిట్టి పరిపూర్ణ బోధకు పరిపూర్ణ రాజయోగమని పేరువచ్చినది. రాజయోగమని పేరు పరిపూర్ణ బోధ మార్గమునకే సార్థకమై యున్నది.



## 11. పరిపూర్ణ రాజయోగము

యోగము, రాజయోగము, పరిపూర్ణ రాజయోగము అను మూడు శబ్దములకు గల తారతమ్యమును నిరూపించి పిదప పరిపూర్ణ రాజయోగమును నిరూపించుటయే ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. యోగమనగా రెండు వస్తువులయొక్క కూడిక అని సామాన్యార్థము. అధిష్ఠాన పరబ్రహ్మము అవ్యక్తము అనునవి నిజముగా రెండు వేరువేరు వస్తువులు కాకున్నను ఆ అధిష్ఠాన పరబ్రహ్మము తనశక్తియగు మూలప్రకృతితో కూడినపుడే

జగత్కారణమగుచున్నది. యిదియే మొదటి యోగము. ఈశ్వరునకు మాయతోను, జీవునకు అవిద్యతోను గల సంబంధములు తరువాతి యోగములు. ఈవిధముగా " ఆ బ్రహ్మస్తంభ పర్యంతం" ప్రతివస్తువు రెండు రూపములు (లేక లక్షణముల) సంయోగములో ఏర్పడినదే అయియున్నది. ప్రతి వస్తువునకును ఒక స్థూలరూపము లేక ఆవరణము ఇంద్రియగోచర మగుచున్నది. ఆ వస్తువునందు సూక్ష్మమై వస్తువుయొక్క గుణము లేక శక్తి పరివ్యాప్తమై యున్నది. వస్తువునకు గుణియనియు, వస్తుధర్మమునకు గుణమనియు పేర్లు, యీ గుణి గుణసంబంధము నిత్యము. యిట్టి యోగము ప్రత్యక్షగోచరము.

యమ నియమాసన ప్రాణాయామాది సాధనలు చేసి కుండలిశక్తిని మేలుకొల్పి సహస్రారమునకు హంసనెక్కించి సమాధినిష్ఠను సాధించుట యోగము. యోగపద్ధతు లనేకములు, అందు పతంజలి నిర్ణయించినవే నేడెక్కువగా గాన్పించుచున్నవి. "యోగశ్చిత్త వృత్తినిరోధః" అనగా యోగము చిత్తవృత్తులను అరికట్టునని చెప్పబడినది. యోగములో ప్రాణసంచారమును నిరోధించినంతకాలమే చిత్తచాంచల్యమగును గాని యోగమునుండి బయటకు వచ్చిన పిదప, తిరిగి చంచలత్వము పొందుచునేయుండును. అంతేకాక యోగము సాధించుట చాల కష్టము. అన్ని వయస్కులవారికి అన్ని ఆశ్రమములవారికి ఆచరణ యోగ్యముకాదు. గురువు చెంత లేక యోగసాధన చేయనేరాదు. ఏలనన, యోగసాధన యందెట్టి లోపము వాటిల్లినను శరీరమందనేక రోగములంకురించును. ఇంతకూ చిత్తవృత్తి నిరోధ మొక సాధనము మాత్రమేగాని సాధించి పొందవలసిన సిద్ధికాదు. అంతేగాక చిత్తచాంచల్య మణచి ఏకాగ్రత సాధించుటకు ఒక్క యోగమే మార్గముకాదు. పంతజలియే తన యోగసూత్రములలో "ఈశ్వర ప్రణిధానాద్వా" అని సూత్రీకరించినాడు. అనగా ఈశ్వరోపాసన వల్ల కూడా చిత్తవృత్తులను నిరోధించి ఏకాగ్రతను సాధించవచ్చునని భావము.

భగవద్గీతయందు యోగశబ్దము ఎట్లు వాడబడినదో గమనించనగును. గీతయందు పేర్కొనబడిన 18 యోగము లున్ను 18 మార్గములుగా మనము గ్రహించవచ్చును. ఆ పక్షంలో యోగమనగా మార్గమని అర్థము స్ఫురించుచున్నది. ఐతే యీ మార్గములు ఒకదానితో నొకటి ఏమాత్రమూ సంబంధము లేని ప్రత్యేక బాటలా? మొత్తం గీతయంతయు జ్ఞానమార్గమునే ప్రతిపాదించుచున్నదని కొందరు; కాదు భక్తిమార్గము మాత్రమే గీత బోధించు చున్నదని కొందరు; కాదుకాదు, గీత కేవలం కర్మమార్గము నే సిద్ధాంతం చేసినదని కొందరు; ఎవరి మతాభిమానముచే వారు మిగతా వానిని నిరసించుచున్నారు. కాని గీత యోగశాస్త్రమని గీతాచార్యుడే పేర్కొనియున్నాడు. కనుక జ్ఞానభక్తి కర్మ మార్గములన్నియు ఏ యోగ శాస్త్రమునందంతర్భూతములో అట్టిదే గీతామార్గముగాని ప్రత్యేకము అందేదో యొక్కటే అని చెప్పబూనుట నిజంగా సాహసమే.

ఐతే అట్టి యోగమేది? గీత 18 అధ్యాయములలోనూ గూడా ప్రస్ఫుటముగా ఒక యోగము అంతర్వాహినీ రూపంగా అనుస్యూతమై ప్రవహిస్తూనేయున్నది. అదేదంటే జ్ఞానకర్మలతో గూడిన ఒక విశిష్టమైన రాజమార్గము. అది రాజర్షిమార్గమని కూడా గీతాచార్యుడు పేర్కొనియే యున్నాడు. ఐతే యిందు జ్ఞానకర్మలకేగాని భక్తికి స్థానము లేదా యనుశంక పొడమవచ్చును. జ్ఞానకర్మలకు సంయోగ మొనర్చునదే భక్తి. ఎట్లనగా మనోవాక్శరీరముల మూటి చేతను కర్మ జరుగుచున్నది. జ్ఞానమనగా అదియును ఒక మానసిక కర్మయేగదా. ఉపాసనా రూపమగు భక్తిభావము చేతనే మనస్సు ఏకాగ్రత చెందును. ఏకాగ్రత చెందిన మనస్సునకే వస్తునిశ్చయజ్ఞానము కలుగును. ఏ కర్మ చేయవలెనన్నను మనస్సు దానిపై సరిగా నిలచినపుడే ఆ కర్మ చక్కగా జరుగును. కనుక జ్ఞాన, భక్తి, కర్మలలో ఒకదాని విడచి మరొకటి ప్రవర్తించుటకు నిజముగా సాధ్యమే కాదు.

గుర్తెరిగిగాని, అనగా తెలివి లేకుండా ఎవరున్నూ ఏకర్మయూ చేయజాలరుగదా! కర్మలేనిచో జ్ఞానమునకు ప్రకాశములేదు. కనుక జ్ఞానకర్మలు కలసియే సర్వదా ప్రకాశించుచున్నవి. యీ జ్ఞానకర్మలయొక్క గ్రంధియే యోగము. భాగవతుల కృష్ణదేశికులవారు --

కం॥ ముడిబడి కర్మము జ్ఞానము
విడువక నా రెండు వెలసె విశ్వమన నదే॥ అనిన్నీ

కందార్థము॥ మంత్రముచే సం తెట్లగు
తంత్రము లేకున్న ? కాదు తంత్రముచేతన్
మంత్రము లేకను వడుగీల
మంత్రము తంత్రంబు రెండు మరిగూడికొనీ
కార్యములన్నీ జరిగింపుపూనీ ॥

అనిన్నీ శెలవిచ్చియున్నారు.

"సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయ" అని జ్ఞానరూపమైన సంకల్పము కలిగిన పిదప, 'తత్సృష్ట్వాతదేవాఽ నుప్రావిశత్' అను కర్మరూపవ్యవహారము చేసెను. కనుక యీ జ్ఞానకర్మయోగము పూర్వ మునుంచి ప్రవర్తించుచునే యున్నది. కేవలజ్ఞానమార్గముగాని, కేవల కర్మమార్గముగాని ప్రయోజనకారి కాదనియు, రెంటియొక్క కూడికయందే సర్వవ్యవహారము సాధ్యమనియు, కనుక మోక్షసాధన మార్గము నిర్ణయించుపట్లగూడ జ్ఞానకర్మల రెంటియొక్క యోగముతోనున్న మార్గమే రాజమార్గమని ఆమోదించి జ్ఞానకర్మ సముచ్చయవాదమనే గీత సిద్ధాంతము చేసినదని చెప్పుట సాహసము కాజాలదు.

కర్మలు చేయుచున్నప్పటికీ కర్మలచే బద్ధుడుగాక నిస్సంగుడై ఆత్మస్వరూప నిశ్చయజ్ఞానముతో ప్రారబ్ధమనుభవించుటయే భగవద్గీత నిర్దేశించిన రాజమార్గము. యిదియే రాజయోగ మనబెల్లును. కనుకనే యోగశబ్దమునకు 'సమత్వం యోగముచ్యతే' అనిన్ని "యోగఃకర్మసుకౌశలం" అనిన్ని గీత నిర్వచించియున్నది.

పరిపూర్ణ రాజయోగమనగా కేవల పరిపూర్ణ పరబ్రహ్మమునందు జ్ఞానమునకుగాని చలనరూపమగు కర్మకుగాని జ్ఞానకర్మ సముచ్చయరూపమగు ఎరుకకుగాని సిద్ధాంతరీత్యా స్థానములేదని ఆదిలోనే గ్రహించి ప్రారబ్ధము అనుభవించుచు ఆత్మవస్తు నిశ్చయజ్ఞానము చేత సంచితమును నాశనము చేసుకొని, ఆగామి కర్మఫల రాహిత్యమునకై రాజయోగమును సాధనారూపముగా గ్రహించుట పరిపూర్ణ రాజయోగమని చెప్పబడును. రాజయోగ విధానమునందు ఆత్మోపలబ్ధి మాత్రమే చేకూరునుగాని జీవేశ్వర జగత్తుగా పరిణమించు ఆత్మలక్షణము మాత్రము తొలగిపోజాలదు. పరిపూర్ణ రాజయోగమందట్లుగాక శాశ్వతమగు జన్మ మరణరూప సంసారము యొక్క అత్యంత నివృత్తి సిద్ధించుచున్నది.

అన్నమయ పురషయోగము, ప్రాణమయ పురుష యోగము, మనోమయ పురుషయోగము, విజ్ఞానమయ పురుషయోగము అనునవి పరిపూర్ణ రాజయోగమునకు పూర్వాంగములు. అందు చివరిదగు విజ్ఞానమయ పురుషయోగముచే ఆత్మస్వరూప నిశ్చయము సాధించినవారే పరిపూర్ణ బోధపొందుటకు పూర్ణాధికారులు. ఆత్మస్వరూప నిశ్చయము పొందుటకు మనోమయ పరుషయోగముచే మానసిక స్థిరత్వము సాధించవలెను. ప్రాణమయ పురుషయోగముచే ఆత్మబలమును సాధించినగాని మానసిక స్థిరత్వము గాంచలేడు. అన్నమయ పురుషయోగముచే త్రికరణ శుద్ధి గలిగిన వారికే ప్రాణవిద్య కరతామలకమగును. కనుక పూర్వాంగములందు సుప్రతిష్ఠుడై యున్నవాడే పరిపూర్ణ బోధను సాధించగలడు. అట్టివాడే నిజమగు సాధనసంపత్తిగలవాడు. అట్టివానికే పూర్ణగురువు పరిపూర్ణబోధను దెలుపుటకుపూనుకొని ముఖ్యసాధనేదో తెలుపుమని శిష్యుడు కోరగా నీకింకనూ సాధనలు గావలెనా ? నీవు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ పురుషయోగములను సాధనలందు ఆరితేరి పూర్ణాధికారివై యున్నావు. అట్టివాడవైన నీకు"ఏ సాధన నీ కెందుకు?" అని ప్రశించిననాడు అని తెలియవలెను.

శిష్యుడు పూర్ణధికారి గానిచో, గురు వాతనిని ముందుగా పూర్ణాధికారిని గావించిగాని పూర్ణబోధ దెల్పిన ప్రయోజనము లేదు. కనుక అధికారి పూర్ణబోధ వలన కడతేరుట బహు సులభము. అనధికారి కంతటి కష్టము మరొకటి లేదు.



# 12. అస్పర్శ యోగము

స్పర్శ అనగా తాకుట అని శబ్దార్థము. కనుక అస్పర్శయోగ మనగా అంటని మార్గమని అర్థమగుచున్నది. ఏది దేనిని అంటనిమార్గము అని ప్రశ్నించుకుంటే, మానవుడు చేయు శుభాశుభ కర్మల, సుకృత దుష్కృత, ఫలములు తన్ను అంటకుండా ప్రవర్తించగల మార్గము అని అర్థమగుచున్నది. కానికర్మ చేసిన యెడల ఆ కర్మఫలము అంటకుండా వుండు టెట్లు? ఉదాహరణకు నిప్పుమీద చేయి వేసినచో అది కాల్చకుండునా? మఱియు 'అవశ్యమనుభోక్తవ్యం పూర్వకర్మ శుభాశుభం' అనగా ఇదివరలో చేసిన శుభాశుభ కర్మలయొక్క ఫలితములు అనుభవించక తప్పదు. అని అర్థము. అట్లగుచో అస్పర్శయోగములో మాత్రము కర్మ ఫలములు ఎట్లంటకుండాపోవును ? అని సహజముగా ఒక శంక కలుగుచున్నది. కాని నిప్పుమీద చెయ్యివేస్తే కాలుట దృష్ట ఫలము. అనగా ప్రత్యక్షముగా సంప్రాప్తించు ఫలము. కాని కర్మకు ఫలితము అదృష్టరూపముగాకూడా ఉన్నది. అనగా కానరాని ఫలముకూడా కలిగియున్నది. అనగా ఈ జన్మలో ఆ కర్మకు ఎట్టి ఫలితము లేకుండాపోవచ్చు, కాని ఆగామిరూపముగా ఆ కర్మఫలము ఉత్తరోత్తర జన్మలయందు ఫలప్రాప్తికి రావచ్చు. దీనినే అదృష్టఫలమందురు. ఈ అదృష్టఫలము ప్రాప్తించకుండా నుండుపాయమే అస్పర్శయోగము.

స్పర్శ అనగా తాకుట లేక అంటుట అని అర్థము గ్రహించినాము. త్వగింద్రియమునకు స్పర్శ నెరుగుట ఆధిభౌతికమున స్పర్శ లేక బాహ్యస్పర్శ మాత్రమే కానిజ్ఞానేంద్రియములచే తెలియబడు విషయపంచకమంతయు అనగా శబ్దాది పంచతన్మాత్ర విషయములన్నియు మాత్రాస్పర్శలని భగవద్గీత నిర్ణయించుచున్నది. ఈ మాత్రాస్పర్శవలన కలుగు సుఖదుఃఖములు నశ్వరములై బాటసారులవలె వచ్చుచు పోవుచు ఉండును. కనుక వానిని ఓర్పుతో సహించి ఉండవలెను అని భగవద్గీత హెచ్చరించుచున్నది. ఇవి అన్నియు బాహ్యస్పర్శలే. కనుక ఇంద్రియనిరోధము చేతనో యోగాది మార్గము ద్వారానో వీనినుండి తప్పించుకొనవచ్చును. అట్లు తప్పించుకొనుట అస్పర్శయోగము కాదు.

అంతఃస్పర్శ సూక్ష్ములై పట్టరానివై, నిరోధించరానివై ఉండును. ఇవి పూర్వజన్మ సంస్కారజన్యములు. మరికొన్ని వర్తమాన కర్మజన్యములు. ఇవి ప్రతివాని అంతఃకరణమునందు అంటుకొని సమయమునకై వేచియుండును. కాల కర్మానుసారముగ వాని ఫలితముల నిచ్చుచుండును. వీనిని అంతఃస్పర్శలని అనవచ్చును. ఈ బాహ్యాంతరస్పర్శలకు మూల

కారణమేమి? అని యోచించినచో అన్నిటికి మూలమైన మూలములేని గుర్తెరిగే శరీరమే అని చెప్పవచ్చును. ఏలననగా గుర్తెరుగక ఎవరును ఏకర్మను చేయరు. గుర్తించిన వెంటనే శబ్దాది విషయములయందు అనుకూల లేక ప్రతికూల ప్రవృత్తి కలిగి కర్మచేయును. దాని వలన కలిగే దృష్టాదృష్ట ఫలములను పొందుట జరుగుచున్నది. ఆవిధముగా స్పర్శలు మానవుని బంధించి కర్మజన్మలకు కారణములగుచున్నవి.

శబ్దాది విషయపంచకము గ్రహించి జ్ఞానేంద్రియములను షణ్ముఖిముద్ర లేక సమాధి పద్ధతులలో నరికట్టుయే స్థూలమగు అస్పర్శయోగము. 2. జ్ఞానేంద్రియముల ద్వారా బహిర్గతమై విషయగ్రహణచేయు మనస్సును అమనస్కాది సాధనములవలన ఆరికట్టుట సూక్ష్మ అస్పర్శయోగము అని అనవచ్చును. 3. గాఢసుషుప్తియందు మనస్సు అజ్ఞానమందు మగ్నతచెంది ఏవిషయమును గ్రహించదుగాన దానిని కారణరూపమైన అస్పర్శయోగము అని అనవచ్చును. 4. సమస్తమును ప్రకాశింపచేయు ప్రత్యగాత్మ ప్రకాశముతో ప్రాణసంయోగము లేకుండా చేయట మహాకారణ అస్పర్శయోగము అని అనవచ్చును. కాని ఈ నాల్గింటిలోను కర్మ చేయుట సంభవించదు కనుక యీ నాల్గింటిలో దేనినీ అస్పర్శయోగమనుటకే వీలు లేదు. ఏలననగా కర్మ చేయవలె, చేసిననూ ఆకర్మఫలము తనను అంటకుండా ఉండవలెను. అది అస్పర్శయోగము కాని ఏకర్మయు చేయక అజగరవ్రతంలో వలే, నల్లజాయువలే, ఒక చోట పడియుండుట ఎంతమాత్రం అస్పర్శయోగముగాదు.

అయితే నిజమైన అస్పర్శయోగమేది? అంతర్బాహ్య స్పర్శలకు అన్నిటికి మూలకారణమై సకల కర్మలకు ప్రేరణ ఇచ్చునదియై సుకృత దుష్కృతమును గుర్తెరుగునదియై జ్ఞానస్వరూపమై అన్నిటికి మూలమైఉన్నదో, ఆ మూలంలేని గుర్తెరిగే శరీరమునకు నిజముగా పరిపూర్ణ పరబాహ్యమందు మూలముగాని కొనకు ప్రవేశించేటందుకు స్థానముగాని లేదని పరిపూర్ణ గురుకృపకు ప్రాప్తుడై బోధయందు ఆరూఢస్థితిగలిగి సర్వధర్మాధర్మములను తన కర్తృత్వముతో సహ గురుపాదముల చెంత నర్పించుకొని యధోచితముగా జీవితము గడుపుటయే అస్పర్శయోగము. ఈ అర్థమందు స్థూలసూక్ష్మకారణ మహాకారణ అస్పర్శయోగములని నాల్గు విధములు లేవు. నాల్గు శరీరములు, నాల్గు అవస్థలు లేవు ఒకే అవస్థ. "పరిపూర్ణము నకు శరీరము లేదు. అవస్థలు లేవు"

స్పర్శ అనగా తాకుట అనే అర్థములో స్థూలముగా చూస్తే సంగము అనే మాటకూడా సమానార్థకముగా కనిపిస్తోంది. కాని అది సరికాదు. ఆకాశము సమస్త వస్తువుల బాహ్యాభ్యంతరములందు వ్యాపించి యున్నను వస్తువునుగాని వస్తుధర్మములనుగాని అంటక వానిచే ఏ విధముగాను వికారముచెందక అసంగమైయున్నది. ఈ అసంగత్వమునకును,

అ స్పర్శయోగమునకును ఎట్టి పోలిక లేదు. రెంటికి గల ముఖ్యభేదము ఏమనగా అసంగమైయున్న ఆకాశము ఒక ఉనికి కలిగి యున్నది. కాని అస్పర్శయోగములో స్పర్శలన్నిటికి అత్యంత మూలకారణమైన మూలం లేని గుర్రైరిగే శరీరము పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనే లేదు అనే దృఢభావన పూర్తిగా జీర్ణింపజేసుకొని పరిపూర్ణ రాజయోగి అట్టి ప్రాతిపదికపైన కదా సకల వ్యవహారములు జరుపును! రెండువస్తువులుంటేనే గాని స్పర్శ ఉండుట పొసగదు. సంగములో రెండు వస్తువులున్నవి కనుక అసంగ పద్ధతిలో సాధకుడు స్పర్శలను తన అంతఃకరణమే చేరనీయకుండా జాగ్రత్త తీసుకొనుచుండును. కాని అస్పర్శ యోగములో విషయపంచకముతో సంయోగము చెందిగుర్రైరిగే శరీరము పరిపూర్ణపరబ్రహ్మమందు లేనేలేదని అస్పర్శయోగి ఆరూఢత చెందియుండును. కనుక అసంగత్వము (Non attachment) కంటె అస్పర్శయోగము మరీ శక్తివంతమైయున్నది. అస్పర్శయోగి "అసంగశస్త్రేన దృఢేన ఛిత్వా" అని ప్రయత్న పూర్వకమైన కృషి చేయవలసిన పనిలేదు. అసంగత్వము కృతకం, అస్పర్శయోగము సహజం.

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం ।
నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః ॥

అని చెప్పబడినది.

అనగా సాధకునకు సత్సహవాసమున అసంగత్వము కలిగి మోహవర్జితుడై తత్వజ్ఞానము తెలిసి జీవన్ముక్తిని సాధించును. అస్పర్శయోగములో ఈ విధమైన పూర్వాపర సోపానము లేవియు లేవు. అస్పర్శయోగి తిన్నగా జన్మరహిత్యమునే (సర్వభ్రాంతిరహితమునే) సాధించగలడు.

అస్పర్శయోగమునకు పూర్ణాదికారి ఎవరు? అంటే పూర్వపుణ్యవిశేషమున పూర్ణగురుసందర్శనము కలిగి గురు పాదములాశ్రయించి పరిపూర్ణ మెరుకలను గురుకృపకు పాత్రుడై తెలుసుకొని, సర్వకర్తృత్వమును గురుచరణసన్నిధి సమర్పించుకొని శేషజీవితమును కొనసాగించుటలో యెట్టి ఆశయు లేక గడిపెడివాడే ఈ యోగమునకు పూర్ణాధికారి. అతడు తప్పక కృతకృత్యుడు కాగలడు.



# 13. యోగః కర్మసు కౌశలం

"యోగఃకర్మసు కౌశలం" అనగా కర్మ(పని) చేయుటలో నేర్పరితనమే యోగమని అర్థము. ఏది నేర్పరితనము? అంటే :- ప్రతిపనికీ ఒక ఫలితముండును Action and reaction are equal and opposite అనగా ప్రతిపనికిన్ని దానికి తగిన (దానికి సమమైన) ప్రతిక్రియ వుండును అని అర్థము. చేసిన ప్రతిపనియున్ను దానికితగిన ఫలము నిచ్చును. అని భావార్థము. మంచిపనిచేసిన మంచిఫలము, చెడ్డపని చేసిన చెడ్డఫలము కలుగనున్న మాట. మంచిపనిచేయుట చే వచ్చు ఫలమును పుణ్యఫలమనియు యిది సుఖము కల్గించుననియు, చెడ్డపనిచేయటచే వచ్చునది పాపఫలమనియు, యిది దుఃఖమును కల్గించుననియు చెప్పబడినది. యీ ఫలములు దృష్టఫలమనియు అదృష్టఫలమనియు రెండువిధములు. ఈ జన్మలో చేసిన పుణ్య పాపకర్మలకు యీ జన్మలోనే కలిగే ఫలము దృష్టఫలము. ఈ జన్మలో ఫలప్రాప్తికి రాక సంస్కారముగా నిలువవుండి రాబోయే జన్మలయందు ఫలప్రాప్తికి రాబోయే పుణ్యపాప ఫలితములు అదృష్టఫలములని లేక అగామి కర్మయని యనబడును.

ఇందు దృష్టఫలములు అనివార్యములు అనగా తప్పించరానివి. ఉదాహరణకు :- నిప్పుమీద చేయి వేసినచో చేయి కాలుట తప్పదు. కాని అదృష్టఫలము కలుగకుండా కర్మచేయుట సాధ్యం. కర్మచేయుటలో నేర్పు వుంటే అదృష్టఫలము రాకుండా అరికట్టవచ్చును. ఈ నేర్పరితనమునే "కర్మసుకౌశలం" అని భగవద్గీత పేర్కొన్నది. ఈనేర్పరితన మెట్టిదో వివరించుటకు ముందు దృష్టఫలము యెందుకు అనివార్యము కలుగుచున్నదో కొంచెం వివరించుట అవసరం. ఈ జన్మలో అనుభవించవలసిన సుఖదఃఖములు యిదివరలోనే నిర్ణయింపబడి యున్నవి. గతజన్మలో చేసిన శుభాశుభకర్మల యొక్క అదృష్టఫలములను యీ జన్మలో అనుభవించుటకై పుట్టుకతోకూడా తెచ్చుకొన్నాము. దీనికే ప్రారబ్ధమని పేరు. ప్ర+అరబ్ధము = ప్రారబ్ధము - చక్కగా ఆరంభమైనది అని అర్థము. తల్లిగర్భమందు చేరుటతోనే యీ కర్మానుభవము ఆరంభించబడినది. కనుకనే యీ శరీరమునకు ప్రారబ్ధశరీరమని పేరు. సంధించి విడిచిపెట్టబడిన బాణము దాని వేగము ననుసరించిపోయి వేగమునశించిన వెనుకగాని యెట్లు ఆగదో తల్లిగర్భమునందు ప్రారంభమైన కర్మానుభవము శరీరపతనముతో గాని ఆగదు. కనుక ప్రారబ్ధములో చేరియున్న దృష్టఫలము లనుభవించి తీరవలసినదే. 'బుద్ధిఃకర్మానుసారిణీ' యనునట్లు ఆయా కర్మలను చేయుటయు తత్ఫలితముగ సంభవించు సుఖదుఃఖములుకల్గి అనుభవించుటయు అనివార్యములే. పైనయీ యబడిన దృష్టాంతములో నిప్పుమీద చేయి వేయవలెననే సంకల్పం.

చేయివేస్తే కాలుట ఈ ప్రారబ్ధము లోనున్నది. "అవశ్య మనుభోక్తవ్యం పూర్వకర్మ శుభాశుభం" అనగా పూర్వకర్మల శుభాశుభఫలములు తప్పక అనుభవించితీరవలసిన దేనని అర్థము. మన మెంత ప్రయత్నించినా యీ ప్రారబ్ధరూపమగు సుఖదుఃఖములు అనుభవించి తీరవలసినదే.

ఇక కర్మసుకౌశలం అనగా కర్మఫలము లంటని విధంగా కర్మచేయు మంచి నేర్పరితన మేదియో తెలిసి కొందుము. అసలు కర్మ మూడు విధములుగా జరుగుచున్నది. 1) మనస్సుచే చేయబడు కర్మ మానసిక కర్మ అనగా ఆలోచించుట 2) వాచికకర్మ - అనగా వాక్కుచే మాటలాడుట. 3) కాయక కర్మ - అనగా శరీరముచే చేయు కర్మ. ఈ త్రివిధ కర్మలు లేని అవస్థ గాఢసుషుప్తి, గాఢసుషుప్తి యందు కూడ సమానవాయువు, ప్రాణవాయువు పనిచేయుచునే యుండును. కాని ఉద్దేశపూర్వకముగా మనము సంకల్పించకనే వాని పనులవి చేయుచున్నవి గనుక అవి పుణ్యపాప సంస్కారములనుత్పత్తి చేయజాలవు. స్వప్నావస్థయందు మానసిక కర్మ జరుగుచున్నను ఆస్వప్నకార్యములు చేయుటలో జ్ఞానము ఆ కర్మలతో సంయోగపడనందున యీ అవస్థయం దొనర్చిన పుణ్యపాపకర్మలు ఫలప్రాప్తినీయవు. ఒక్క జాగ్రదవస్థలో చేసిన కాయక, వాచిక, మానసిక కర్మలు మాత్రమే దృష్టాదృష్ట ఫలహేతువు లగుచున్నవి. ఫలము నాశించక చేయు నిష్కామకర్మ వలన ఫలమంటదనియు. భగవదర్పితముగా నిస్వార్థబుద్ధితో కర్మచేయవలెననియు చెప్పబడినది. నిష్కారణముగా యెవరున్న యేకర్మయును చేయరు. తన యొక్కయు తనపై నాధారపడిన కుటుంబముయొక్కయు పోషణకొరకు ఒకడు ద్రవ్యార్జనచేయ సమకట్టి వుద్యోగమో, వ్యవసాయమో, వ్యాపారమో కేవలం కూలిపనియోచేయును. ఆపనికి ప్రతిఫలమాసించియే అపనులు చేయుచున్నాడు. ఆ కర్మ నిష్కామ కర్మగాదుగదా! ఇక భగవదార్పణబుద్ధితో ఆ కర్మలు చేయు మందురు. ఇందు కర్మలు యీశ్వరార్పణ బుద్ధితో చేసి కర్మ యొక్క దృష్టఫలములను తానే భోగించుచున్నాడు. తన భోగతృష్ణ చల్లారుట లేదు. అధికాధికభోగానుభవమునకై తన కర్తృత్వము పెంచుకొని నూతన కర్మాచరణకు ప్రేరేపింపబడుచున్నాడు. కర్మలను, కర్మఫలములను శ్రీకృష్ణార్పణమస్తు అంటూ చేస్తూ ఫలానుభవమును తానే పొందుచున్నప్పుడు తన స్వార్థము నశించుట లేదు. మరియును ఈశ్వరార్పణ బుద్ధితో కర్మ చేస్తే తనను పాపపుణ్యము లంటవన్నప్పుడు అంతఃకరణ శుద్ధి లేనివాడు దుష్టప్రవృత్తితో దుర్మార్గములు చేయుటకు వెనుదీయుడు.

అట్లుగాక 'ఆత్మవస్తుకామాయ। సర్వం ప్రియం భవతి' తనయందు ప్రేమచేతనే భార్యా పుత్ర విత్తాదులయందు ప్రేమ కల్గుచున్నది. ఈ ఆత్మ ప్రేమయే స్వార్థమును కోరికలను, ఆశలను పెంచును. తనయందు తనకు ప్రేమ లేనిచో దేని ఆనందముకొరకు దేనిని మానవుడు ప్రేమించును? తనయందు తనకు ప్రేమ లేనివాడే నిజమగు నిస్వార్థపరుడు. నిజమగు వైరాగ్యపరుడు. తన ఆత్మయందు ప్రేమ వున్న వానికి అహంకార అభిమానములు భోగతృష్ణ

ఎప్పటికీ నశించవు. "నాహంకార్తాన భోక్తా" నేను కర్తనుగాను, భోక్తనుగాను, నన్ను ప్రేరేపించి, తన సత్తానిచ్చి సకల కార్యములుచేయించు పరమాత్మయే కర్త, అతడే భోక్త. నేనతిని చేతి పనిముట్టును, అతడెట్లాడించిన నట్లేయాడు కీలుబొమ్మను అని, సర్వభారమును ఆ పరమాత్మపైన నే యుంచి తన విధ్యుక్త ధర్మములను మాత్ర మొనర్చువాడే కర్తృత్వ త్యాగము చేసినవాడు. అతడే అకర్త. అభోక్త అతనికి శుభాశుభ కార్యములు చేయుటలో పుణ్యపాపము లంటవు. యిది శరణాగతి లక్షణము. పరిపూర్ణ బోధమార్గమందు వున్నదొక్క పరిపూర్ణమే. యీ సిద్ధాంతమునందు, అఖండయెరుక లేనేలేదు. అవుడు వ్యష్టియెరుకయు, దానియొక్క ఆగామీ సంచిత ప్రారబ్ధములున్నూ పూర్వపక్షమైపోవును. ఎట్లనగా దీనిని, ఒక దృష్టాంతముచే బలపరచుచున్నారు. యెట్లనగా, రాజుగారు మరణిస్తే, ఆయనయొక్క ముగ్గురురాణులూ ముండమోస్తారా? లేక అందిద్దరు మాత్రమే ముండమోసి ఒకతే మాత్రం సువాసినిగానుంటుందా? అని ప్రశ్నిస్తున్నారు. కాని యెట్టి జ్ఞానిని వారు మనస్సులో నుంచుకొని యీ నిర్ణయము చేసిరో తెలుసుకొంటే సరిపోతుంది. " నవద్వారపు రే దేహే నైవకుర్వన్ న కారయేత్" యీ దేహము నందున్న ప్రత్యగాత్మనే నేను. దేహేంద్రియ విశిష్టుడై కర్తృత్వ భోక్తృత్వములు గలిగిన జీవుడనుగాను - అని ఆరూఢుడైన జ్ఞానికి కర్తృత్వభోక్తృత్వము లేవు. గనుక ప్రారబ్ధనుభవమున్ను లేదని అద్వైతులు భావింతురు. కాని ఆ ప్రత్యగాత్మయే అంతఃకరణతో గూడి జీవుడును పేరుతో వ్యవహరించు చున్నాడుగదా! ఆ ప్రత్యగాత్మ ప్రకాశము యొక్క సత్తాలేనిచో ప్రాణమూ, జీవేంద్రియములు పనిచేయ జాలవు. కనుక ఏదిలేకుంటే ఏ వ్యవహారమూ వుండదో అదియే వ్యవహార కారణము కనుక ప్రత్యగాత్మ పరమాత్మల రూపంగా నుండి, సర్వ వ్యవహార కారణమైయుండు ఆత్మయే కర్త, భోక్త, అపుడు కర్తృత్వం త్యాగము అంటే పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఆత్మలేనేలేదు. అను ఆరూఢత కలిగియుండుటేయగును.

జ్ఞానికి ప్రారబ్ధము లేదు అని బహుళ వ్యాప్తిలో నున్నది. యిది యెట్లు? ప్రారబ్ధశరీరము ప్రత్యక్షముగా తోస్తూవుంటే ప్రారబ్ధమే లేదనుట యెట్లు? అంటే ప్రారబ్ధశరీరమున్నప్పటికి జ్ఞానికి ప్రారబ్ధనుభవము లేదు. సుఖదుఃఖలక్షణములు జ్ఞాని శరీరమందు చూపరులకు ప్రత్యక్షముగా కానవస్తూవున్నా, జ్ఞానిమాత్రం ఆ శరీర తాదాత్మ్యము లేనివాడై, నేను దేహేంద్రియాదులకు విలక్షణమైన ఆత్మనే, నాకు జన్మ వ్యాధిజరామరణాదులు లేవు అని ఆత్మదృష్టి యందుండుటచే అతని కాసుఖ దుఃఖానుభవము లేదు. అన్యుల దృష్టిలో అతనికి ప్రారబ్ధనుభవమున్నూ వున్నట్లే దోచునుగానీ, స్వదృష్టిచేమాత్రం లేదు. సుఖదుఃఖానుభవము మనస్సునకే గదా ! ఆమనస్సు ఆత్మతో తాదాత్మ్యము చెందినపుడు అదియే అమనస్క మనబడుచున్నది. మనస్సుగాని, దాని అధిష్ఠానమగు ఆత్మగాని, పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేనేలేదని ఆరూఢత నందినవానికి

అనుభవించునదే లేదు. కనుక అనుభవమే యుళక్కి యగుచున్నది. తానేలేదు. కనుక తనకు తోచిన సమస్తము తనతోగూడా యేమీలేదు. ఇట్టి ఆరూఢతతో యేకార్యములు చేసినా, చేసి చెయ్యని వాడగుచున్నాడు. ఇదియే నిజమగు కర్తృత్వ త్యాగము. ఇట్టి త్యాగికి అదృష్టరూపముగ యెట్టి సంస్కారములు ఏర్పడజాలవు. ఎట్టి అదృష్టఫలప్రాప్తిని కల్గింపజాలవు. కర్మత్రయ మారీతిగా నశించిపోవుచున్నది కనుక వేచిన విత్తనము మొలకెత్తజాలనట్లు జన్మరాహిత్యము సిద్ధించును. కర్తృత్వత్యాగయుక్తమగు కర్మాచరణమే కర్మయోగమని కీర్తింపబడినది. భగవద్గీత 18 యోగములుగా విభజింపబడినది. యోగమనగా మార్గము. కనుక కర్తృత్వ త్యాగపూర్వక కర్మాచరణ ఒక యోగము. కనుకనే "యోగఃకర్మసు కౌశలం" అని గీతాకారుడు యీ మార్గమును కీర్తించినాడు. కనుక అదృష్ట కర్మఫలములను అనగా ఆగామి సృష్టికాకుండా కర్మ చేయు నేర్పరితన మీ కర్తృత్వ రహిత కర్మాచరణ విధానమునందే కలదు. కర్మత్యాగము అసంభవము. ఏలననగా కూర్చున్నా నిలుచున్నా పూరకవున్నా శరీర వాక్ మనసులనే త్రికరణములలో యేదియో ఒకటి పని చేయుచు ఆగామిని వుత్పత్తి చేయుచునే యుండును. కర్మఫల త్యాగముకూడ ఆచరణయందు సుసాధ్యముకాదు. కర్తృత్వ త్యాగపూర్వక కర్మాచరణమే ఆగామిని వుత్పత్తి చేయకుండా వుండగలదు.

కర్మఫలములే జన్మకారణము గనుక త్రివిధ కర్మ రాహిత్యమునందు జన్మరాహిత్యము కల్గునని సర్వులూ అంగీకరించుచున్నారు. ఐతే, కొందరు. ---

శ్లో॥ ప్రారబ్ధం భోగతో నశ్యేత్, తత్వజ్ఞానేన సంచితం,
ఆగామి ద్వివిధం ప్రోక్తం తద్వేషీ ప్రియవాదినౌ॥

అనుశ్లోకమును ప్రమాణముగా గైకొనుచున్నారు. ప్రారబ్ధకర్మ అనుభవించుటచేతను, సంచితము తత్వజ్ఞానమువల్లనూ, నశించుననియు, అజ్ఞానిని దూషించువారు అయన పాపమును భూషించువారు, పుణ్యమును తీసుకొనుటరీత్యా ఆగామికర్మ నశించుననియు ఈ శ్లోకమున కర్థము. దూషించువారు కొందరు, భూషించువారుకొందరు ఉంటేనేగాని జ్ఞానియొక్క ఆగామికర్మ నశించదని అవిధముగా ఆ జ్ఞానియొక్క మోక్షము పరులపై నాధారపడి యుండునని సిద్ధించుచున్నది. ఎంత హాస్యాస్పదము ! కనుక యీనిర్ణయము అంగీకరించుటకు వీలులేదు.



# 14. నైష్కర్మ్యసిద్ధి

"కర్మ" యనగా 'పని' యని సామాన్యార్థము. ఐతే ---
కర్మమున బుట్టు జంతువు,
కర్మముననను వృద్ధిపొందు, కర్మమున చెడున్,
కర్మమె జనులకు దైవము,
కర్మము సుఖ-దుఃఖములకు కారణ మధిపా ॥

అని మహాభారతమునందు చెప్పబడిన విధముగా, సృష్టి స్థితి లయములకు, సుఖ దుఃఖములకు కారణమైన కర్మయొక్క విశేషార్థమేమి ? కర్మ యెట్లు బంధకారణమై, జనన మరణ రూప సంసారములో మానవుని పరిభ్రమింపచేయునో ముందుగా గమనించవలసి యున్నది.

ఫలములీయనికర్మలు నిర్వీరములై నశించును. అట్టిపనులను కర్మలనుటకే వీలులేదుకనుక కర్మయనగా కర్మఫలమే. కర్మ ఫలము రెండురూపములుగా నుండును. 1) దృష్టఫలము, 2) అదృష్టఫలము. ఇందు దృష్టఫలమనగా చేసినపనియొక్క ఫలితము వెంటనేకలిగి సుఖమునో దుఃఖమునో కలిగించును. ఉదా : నిప్పుమీద చేయి వేసినచో కాలి బొబ్బలెక్కి బాధించును. అట్లే ఏదైనా నేరము చేసినచో సంఘమో లేక ప్రభుత్వమో అతణ్ణి నేరమునకు తగినట్లు శిక్షించును. "అన్నము తిన్నను ఆకలి, తిన్నగ నీరంబుద్రావ తృష్ణయు, రోగం బెన్నగ నౌషధ సేవను" నివారణయగుట దృష్టఫలములకు మంచి ఉదాహరణలు. అష్టసిద్ధులన్నియు కూడా దృష్టఫలములే. వేయేల ? ఈ జన్మములో మనం చేసిన కర్మకు ఫలితంగా యీజన్మలోనే కలుగు సుఖదుఃఖములన్నియు దృష్టఫలములు. అట్లుగాక యీజన్మలో చేయబడిన పుణ్య పాపకర్మ కర్మలకు ఫలితము లీజన్మలోనే సిద్ధించక పోవచ్చును. ఐననూ బుద్ధిపూర్వకముగా చేసిన సర్వకర్మలూ నిరర్థకముగా పోవు. ఎప్పుడో ఒకప్పుడు ఫలప్రాప్తి గల్గింపక మానవు. అకారణముగా యీజన్మలో మనకు తటస్థించు సుఖ దుఃఖములు పూర్వజన్మలలో చేసిన కర్మలయొక్క అదృష్ట ఫలములే. అట్లే యీజన్మలో చేసిన కర్మలకు ఫలితములు యీజన్మలోనే ప్రాప్తించని యెడల అవి అదృష్టరూపముగా నిల్వవుండి కాలాంతరమున, జన్మాంతరములలో ఫలము నిచ్చును. బుద్ధిపూర్వకముగా చేసినకర్మ యెప్పుడో ఒకప్పుడు ఫలము నీయక తప్పదు. "చేసినవారికి చేసినంత మహాదేవ" యనునట్లు కర్మకు తగిన ఫలము సిద్ధించక మానదు.

ఒకదొక నేరముచేసి పట్టుబడక, శిక్షణను తప్పించుకొంటినిగదాయనిసంతోషపడుట మూర్ఖత. "తాతాచార్యుల వారి ముద్ర భుజము తప్పినా వీపు తప్పదు" అన్నట్లు (అనగా సమాశ్రయణ కాలములో వైష్ణవ బాలురకు భుజములపై, సలసలకాగు నేతిలో బాగావేడెక్కిన శంఖుచక్రముల ముద్రలతో కాల్చెదరు. ఒకముద్ర ఒక భుజముపై పడినతోడనే బాలుడు బాధ భరించలేక పరుగిడును. కాని పురోహితుడు వాని వెనుక పరుగెత్తి భుజము దొరకనిచో వీపుపైనైనా ఆ ముద్రను వేసితీరును) ఈ జన్మలో కాకున్న మరోజన్మలోనైనా కర్మఫలము సుఖదుఃఖరూపముగా సంప్రాప్తించి తీరును. దీనినే అదృష్ట మనియు అపూర్వమనియు చెప్పెదరు. అపూర్వమనగా కాలాంతరమున ఫలమునకు వచ్చు కర్మశక్తి. 'అదృష్టఫలము' అను శబ్దమునకు యింద్రియగోచరముకాని ఫలమని అర్థము. దృష్ట ఫలమనగా యీజన్మయందే వెంటనే తెలియబడునది. ఫలము యొక్క స్వరూప మేమి ? సుఖదుఖఃములను గల్గించు శక్తియే దాని స్వరూపము. అదృష్టఫలము ఫలప్రాప్తిని గల్గించు వరకు యెందుదాగియుండును ? అంటే కర్తయొక్క అంతఃకరణయందే (మనస్సునందే) పుణ్య పాప సంస్కార రూపములలో దాగి యుండును. మనస్సు సంస్కారముల మూట అన్నాడు - వివేకానందస్వామి.

సంస్కారము లున్నంతవరకు మనస్సు నశించదు. మనస్సునంత వరకు ప్రాణము దానిని నీచోత్తమ యుపాధుల యందు ప్రవేశపెట్టుచునే యుండును. సంస్కార మన్నను వాసనయన్నను యొక్కటే. సంస్కారము లేక వాసన యంటే నేమి ? చేసిన పనులు (సుకృత దుష్కృతములు) యొక్క స్మృతి జ్ఞానము, మనస్సునందు ముద్రింపబడి అజ్ఞాతముగ నిల్చి యుండుటే సంస్కారము లేక వాసన. ఈ సంస్కారములే వుత్తరోత్తర జన్మలకు కారణములై విత్తనమునందు సూక్ష్మ రూపములో నిక్షిప్తమైయుండు అంకురములవలె మనస్సు నందు దాగి యుండును.

ఆ॥ వె॥ అంతరంగమందు అపరాధములు చేసి
మంచివానివలెనె మనుజుడుండు ।
ఇతరు లెరుగకున్న యీశ్వరు డెరుగడా !
విశ్వదాభిరామ వినుర వేమ ॥

అని చెప్పినవాడు వేమనయోగి. ఆ ఈశ్వరు డెరవో గాదు. వ్యష్టి సమిష్టి రూపముగా నుండు ఆత్మప్రకాశమే. ఇదియే మనస్సునందు సంస్కారముల నేర్పరచుటకు కారణముగా నున్నది. అంతరంగమందలి అపరాధము లేమియనగా - మానసికకర్మలు. వాచిక, కాయిక కర్మలు యితరులకు తెలియబడునేగాని మానసిక కర్మలను యితరులు చూడజాలరుగదా ! ఆయంతరగమందేయున్న ఈశ్వరుడు గుర్తింపజాలడా! అని అర్థము. అపరాధములంటే తప్పుపనులు. మంచిపనులుకూడా మనస్సు చేయుచున్నది గదా ! మంచి తలంపులన్నియు మనస్సుచేయు మంచిపనులేగదా ! కనుక మనస్సునందు కలుగు మంచి చెడు తలంపులన్నియు

కూడా సంస్కారములను యేర్పరచుచున్నది. అట్లే త్రికరణములగు మనో వాక్కాయములు చేయు సకల కర్మలు శుభాశుభ సంస్కారము లేర్పరచుచునే యుండును.

దృష్టఫల మనుభవించిన పిదపకూడ అది సంస్కారముత్పత్తి చేయునా ? అంటే వుత్పత్తి చేయుననే చెప్పాలి. "నేనా పాపకార్య మొనర్చితిని. ఏతత్ఫలితముగా కారాగార శిక్ష ననుభవించితిని. దానితో నా పాపప్రక్షాళన మైపోయినది. ఇక నెన్నడు నట్టి పాపకార్యములను చేయ"నని నిజముగా పశ్చాత్తాపముచెంది యిక దానిని తలంపక యూరకుండెనేని ఆపాపకార్య మెట్టి సంస్కారమును యుత్పత్తి చేయకపోవచ్చును. అట్లుగాక ఆకర్మల ఫలితముగా అనుభవించిన సుఖదుఃఖములను గురించి మరచిపోక పదేపదే దానిని గురించి చింతించుచుండెనేని అట్టి తలంపే (మానసిక కర్మ యగుటచే) సంస్కార జనకమగును. కనుక మానవుడొనర్చిన సుకృత దుష్కృతములగూర్చి జ్ఞప్తిలోనికి తెచ్చుకొనరాదు. స్మరింపరాదు. స్మరించినచో లేక యితరులతో చెప్పుకొనుచుండినచో సంస్కార ముత్పత్తి కాక తప్పదు. కనుక దృష్టఫలము, అదృష్టఫలములు రెండే గాక, దృష్టఫల స్మరణచే యేర్పడే సంస్కారఫలము కూడా కలుగుచున్నది. దానికి దృష్టాదృష్టఫలమని నామకరణము చేయవచ్చును. కనుక 1. దృష్టఫలము, 2. అదృష్టఫలము, 3. దృష్ట్యాదృష్ట ఫలము అని కర్మ ఫలమును త్రివిధముగా విభజించవచ్చును.

కర్మ యనగా ఫలమునిచ్చు కర్మయేగాని, యెట్టి ఫలమును కలిగించని కర్మలను (పనులను) కర్మలే యనరాదని ముందుగానే సూచించితిమి. దానిని ఏమని పిలువవలెను ? దానిని అకర్మయని పిలువనగును. బాహ్యదృష్టికి కర్మ లక్షణములు గానవచ్చునేగాని ఆకర్మ ఫలమీయదు గనుక దానిని అకర్మయన్నారు. కర్మ, అకర్మ, వికర్మయని భగవద్గీతా శాస్త్రము కర్మలను మూడు తరగతులుగా విభజించినది. ఇందు కర్మయనగా, శాస్త్రోక్తమైన కర్మయనీ, వికర్మయనగా శాస్త్రమందు నిషేధింపబడిన కర్మయనిన్నీ, అకర్మయనగా కర్మ శూన్యతయనిన్నీ సామాన్యముగా చెప్పుదురు. యజ్ఞయాగాది కామ్యకర్మల నభిమానించు మీమాంసకులా కామ్యకర్మలే కర్మయనిన్నీ, మిగిలినకర్మలన్నియు వికర్మలనిన్నీ చెప్పుదురు. సర్వకర్మ శూన్యతనే అభిమానించు సన్యాసమార్గీయులు ఏకర్మయూ చేయకుండ నుండుటే "అకర్మ" యని యందురు. గీతావ్యాఖ్యాతలలో చాలమంది సన్యాసులే యగుటచే యీ అర్థమునే గ్రహించిరి. కాని ఏకర్మయు చేయకుండావుండుట అసంభవము అని గీతయే చెప్పినది.

"నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠ త్యకర్మకృత్" గాఢ సుషుప్తియందు తప్ప మనోవాక్కాయములు మూడుకూడ పనిచేయకపోవుట అనూహ్యము. అకర్మయొక్క నిజార్థమును విమర్శించి తెలుసుకొనవలసియున్నది.

సంస్కార ముత్పత్తి చేయని కర్మ బంధకారణముకాదు. బంధకారణముకాకుండా కర్మచేయు టెట్లు ? కర్మలను చేయువాడు (కర్త) యెవరు అనువిషయము ముందుగా నిశ్చయము

చేసుకొనవలసియున్నది. కర్మకర్తృత్వ విషయంలో వివిధ మార్గస్థులు వివిధాభిప్రాయములు కలిగియున్నారు.

**సాంఖ్యులు** :- ప్రకృతి యందలి సత్వ రజస్తమో గుణములు మూడున్ను కర్మకారణములన్నారు. ఏలననగా వారి సిద్ధాంతం ప్రకారం పురుషుడు కర్త, అభోక్త. పురుషుని సన్నిధానములో ప్రకృతియే సృష్టి స్థితిలయాది సర్వకార్యములు చేయుచుండును. కాని ప్రకృతియును దాని గుణములున్ను జడములని చెప్పబడుచున్నవే ! జడమునకు కర్తృత్వం చెప్పవచ్చునా ? ఒక డొక కత్తితో నొకని చంపినపుడు ఆ హత్యకు కర్తృత్వము కత్తికి చెప్పరాదు కదా ! చైతన్యవంతుడగు పురుషుడు ప్రకృతితో గూడిన సకల కర్మలకు కారణమగుచున్నాడు. అథవా, కేవలము కర్తగాకున్నను సాన్నిధ్యమాత్ర కర్తృత్వమున్నదిగదా ! కనుక కారయిత (చేయించువాడు) యైనను అయివున్నాడని చెప్పకతప్పదు.

"కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః" అనగా 1 కర్త, 2 కారయిత, 3 ప్రేరేపించినవాడు, 4 ఆమోదించినవాడు - యీ నల్వురకు ఆ కర్మఫలమంటునని చెప్పబడినది. భగవద్గీతకూడ "కర్మబ్రహ్మోద్భవం విద్ధి, బ్రహ్మాక్షర సముద్భవం" అంటూ చెప్పుచున్నది. అంటే అక్షర పురుషుడు (ప్రకృతితో కూడిన పురుషుడు) కర్మకు కారణమైయున్నాడు అనియే చెప్పబడి యున్నది. కనుక, మానవునకు కర్మస్వాతంత్ర్యము లేదనిన్ని గుణత్రయములే కర్మచేయించు చున్నవనిన్ని గుణాతీతుడై ప్రకృతిని జయించవలసి యుండునని చెప్పెడి మాటలు సంపూర్ణ సత్యములని చెప్పవలను పడదు. ఏలననగా సంకల్పించకనే లేక గుర్తెరుగకనే యెవరున్ను ఏకర్మయూ చేయరు. అట్లు చేయబడిన కర్మ ఎట్టి సంస్కామున్ను ఉత్పత్తి చేయదు. కనుక ఆ గుర్తిచేదీ లేక సంకల్పించేదీ యేదియో అదియే కర్మకు అత్యంత మూల కారణమని చెప్పితీరవలసినదే.

**యోగసాధకులు** :- మనస్సేకర్మ కారణము కనుక మనోజయమును యోగముచే సాధించవలెనందురు. అంతఃకరణము అంతఃకరణ పరిణామములగు మనోబుద్ధి చిత్తాహం కారములున్నా కూడా జడములే అయివున్నవి. "అహంకార విమూఢాత్మాకర్తాహ మితి మన్యతే" అని గీతావాక్యం. అహంకార విమూఢాత్ముడనగా అహంకారమే "నేన" ను కొన్నవాడా ? లేక ఆత్మ తాదాత్మ్యముచెంది నేనే ఆత్మను అనుకొన్నవాడా ? నేనే ఆత్మను అనుకొన్నవాడు జ్ఞానిఅగును కాని మూఢుడు కాడుగదా ! కనుక జడమగు అహంకారమే (లేక అంతఃకరణమే) నే ననుకొన్నవాడే మూఢుడని తేటతెల్లము కనుక యోగులు చెప్పే విధముగా కర్మకర్తృత్వము మనస్సునకు (లేదా అహంకారమునకు గాని, అంతఃకరణమునకు గాని) కలదనుట సరికాదు. సాంఖ్యులు చెప్పే ప్రకృతి గుణములకు కర్తృత్వము యెట్లు లేదో యోగులు చెప్పే అహంకారము (లేక అంతఃకరణము) నకు కర్తృత్వము చెప్పరాదు.

**భక్తులు** :- వారేయే నామరూపములతో వుపాసించినా వారి ఇష్టదైవమే సర్వ కర్తృత్వ భోక్తృత్వ నిమానుకత్వ నియంతృత్వ సర్వేశ్వరత్వాదులుగల ఈశ్వరుడని విశ్వసించి ఆమూర్తియందు భక్తిగల్గి యుందురు. ఆ యీశ్వరుని చేతిలో తాము కీలుబొమ్మలు. అతడెట్లాడించినా, యెట్లు పాడించినా యెట్టికర్మ చేయించినా, అట్లు చేయుచుందుమని భావింతురు. "కర్తా కారయితాచైవ, ప్రేరక శ్చానుమోదకః" అనుకర్మ పల భాగస్వాములు నలుగురూ ఈశ్వర స్వరూపులే. ఆ ఈశ్వరుడే ఫలప్రదాత. కష్టసుఖములన్నియు ఆయన ఆగ్రహానుగ్రహ ఫలితములే. అంతఃకరణమందేవున్న ఆయన ప్రేరణ చేతనే కర్మప్రవృత్తిగల్గి వివిధ కర్మ లొనర్చుచుందుము. కనుక యేకర్మకూ మేము బాధ్యులము కాము. ఆయన ప్రీతి కొరకే మేము కర్మలు చేయుచుందుము. కనుక మేముచేయు కర్మయంతయు ఈశ్వరారాధనమే. కర్మఫలమంతయూ ఈశ్వరార్పణ బుద్ధితో చేయుచూ ఈశ్వరుని కర్పించుట మాధర్మము. అప్పుడు "work in worship" అనగా కర్మ చేయుట ఈశ్వరారాధనయే యగును. కనుక "యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం" అనగా నే చేయు సమస్త కర్మలు నే చేయు ఆరాధనయే అనే భావముతో కర్మ చేయవలెను. మరిన్ని ---

శ్లో ॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుధ్యాత్మనా వా ప్రకృతి స్వభావాత్ ।
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి

అనగా త్రికరణముల చేతను త్రిగుణస్వభావము చేతను యేకర్మలు చేతువో అవన్నియు శ్రీమన్నారాయణామూర్తి కే సమర్పించుమని వారాదేశింతురు. యీ విధంగా వారున్ను కర్తృత్వ బాధ్యతను తమనుండి త్రోసివేయుదురు.

**వేదాంతులు** : - మాయక్రమ్ముకొనుటచేత, ఆత్మాహం కారములు రెండు యెకటేనని జీవుడు తలంచునుఅని వేదాంతులంటారు. మరియు 'జీవో బ్రహ్మైవనాపరః' అనిన్ని వారంటారు. కనుక బ్రహ్మయే మాయావరణము చేత తాననుకొన్నటువంటి అహంకారముతో తాదాత్మ్యతనొంది అహంకార విమూఢాత్ముడైతేనే కర్త నంటాడన్నమాట. ఇట్లనుటలో నిజంగాతాను కర్త కాదు కాని కర్తనని అనుకొంటున్నాడని అర్థమా ? కాదు. 'తస్యకర్తారమపి మాంవిద్ధ్యకర్తారమవ్యయం' అని గీతలో చెప్పబడినది. అనగా నేను నిజముగా కర్తనైనా కర్తను గానని తెలుసుకొ మ్మంటున్నాడు భగవానుడు. మరిన్ని మూడులోకములయందున్ను యేకర్తవ్యము లేనప్పటికి నిరంతరంకర్మ చేస్తూనే వుంటానని చెప్పుచున్నాడు. ఈ వాక్యములు పరస్పర విరుద్ధములుగా నున్నట్లు స్థూలదృష్టికి గోచరించును. కాని యించుక విచారించినచో సమన్వయము సులభ సాధ్యమే.

ఎట్లనగా - సృష్టికి పూర్వము అహంస్ఫురణయే లేనపుడు బ్రహ్మము అచలస్థితిలో వున్నపుడు నిష్క్రియమై నిర్వికారముగా నున్నది. అపుడది అకర్తయు, అభోక్తయు నైవున్నది. జాగ్రదవస్థలో మనము సకలక్రియలు చేయుచున్నను గాఢసుషుప్తిలో నిస్సంకల్పరూపముగ నుందుము. అపుడు మానసిక, వాచక, కాయిక, కర్మలేవియు లేవుకదా ! అట్లే పరమాత్మ తొలిరూపంలో నిష్క్రియమై పిదప సర్వక్రియాత్మక మగుచున్నది. కనుకనే "శుద్ధేసుషుప్తి దృష్టాంతం" అని చెప్పబడినది. సృష్టి స్థితి లయ నిగ్రహానుగ్రహములను పంచ కృత్యములాతని కర్తవ్య కర్మలుకావు. ఐనను యెట్టి స్వార్థ ప్రయోజనమున్ను తనకు లేనప్పటికి తన యందు బీజరూపములో అణగిమణిగియున్న ప్రకృతి యొక్క త్రిగుణరూప కర్మలను (అనగా సృష్టిస్థితిలయములను) చేయుచున్నాడు. ఐనను అతని కాదిలో యెట్టి కర్తృత్వాభిమానమున్ను లేదు. పరిణామ దశలో అట్టి కర్తృత్వాభిమానము కల్గినపుడు మహదహంకారమని ఆ బ్రహ్మమే పేరొందినది.

ఈ విధంగా సాంఖ్యులు, యోగాభ్యాసకులు, భక్తులు వేదాంతులు కర్మ కర్తృతము బంధకారణమని యెంచుట చేతనేయని మనము సులభముగా నిర్ణయించవచ్చును. కర్మ ఎట్లు బంధకారణమగుచున్నది ? ఫలకాంక్షవుంటే కర్మ బంధకారణ మగునని పెక్కుమంది భావింతురు. గీతయు "తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచార" అని ఆదేసించుచున్నది. వారి దృక్పథమేమి? ఫల మాసించువారందరు తమ తమ కర్మ సత్ఫలితము లీయవలెనని కోరుకొందురేగాని దుష్ఫలితము లెవరున్ను ఆశించరు. అందుచే సత్ఫలితము లందు రాగము. దుష్ఫలితములందు ద్వేషముకల్గి అంతఃకరణము రాగద్వేషములకు, అభిమానమునకు, అహంకారమునకు క్రమముగా ఆలవాలమై మలినమైపోవును. ఏకోరికయైనా అసలు యెట్లు కలుగుచున్నది ?

"ధ్యాయతో విషయాన్ పుంసాన్
సంగస్తే షూపజాయతే,
సంగా త్సంజాయతే కామః"

అని గీత వివరించినది. విషయములను గూర్చి చింతించుట వలన ఆ సుఖములయందు సంగము యేర్పడి, ఆయా సుఖములయందు కోరిక పెంపొందును. కోరిక తీరుటకు అడ్డు వచ్చినవారియందు క్రోధము, కోరిక సఫలమైతే లభించు వస్తువునందు లోభము, క్రమముగా ఆ వస్తువుయందు మోహము, వస్తువు యెవరిచేతనైనా హరింపబడునేమో యని భయము, వస్తువు నిజముగా పోయినచో శోకము యీ విధముగా సమస్త దుర్వాసనలచే అంతఃకరణ మావరింపబడి నరుడు జనన మరణ ప్రవాహమున కొట్టుకొని పోవుచుండును. కనుక విషయచింతన సంగమునకు, కామ క్రోధాదులకు కారణము, విషయగ్రహణమునకు జ్ఞానేంద్రియము మూలాధారము. జ్ఞానేంద్రియము ద్వారా ప్రసరించు మనస్సు ఆత్మ ప్రకాశముచేతనే ప్రవర్తిల్లుచు విషయచింతన చేయుచున్నది. కనుక సకలకర్మలకు అత్యంత మూలకారణము జ్ఞానరూపమైన ఆత్మయే, గుర్తెరుగకుండా ఎవరున్ను ఏ కర్మయున్ను చేయరు గదా! కనుక సంగమునకు అత్యంత

మూలకారణము గుర్తు లేక యెరుక లేక జ్ఞానము. జ్ఞానమే స్వరూపముగాగల ఆత్మ, సంగమునకు తోడు కర్తృత్వాభిమానముంటే అగ్నిదేవునకు వాయుదేవుడుకూడా తోడైనట్లే. కర్తృత్వమును వదలినగాని ఫలకాంక్ష పోనేపోదని దృఢముగా చెప్పవచ్చును. కనుకనే కర్తృత్వ రహిత విధానము నవలంబించి కర్మాచరణ చేయవలెనని పరిపూర్ణ భావజ్ఞులు ఆదేశించుచున్నారు.

"యోగః కర్మసు కౌశలం" కర్తృత్వ రహిత కర్మాచరణ విధానమే కర్మ కౌశలము. సృష్టి సంకల్పము కలిగి ఆత్మయే అనేకముగా మార్పులుచెంది, వానియందు తానే జీవరూపముగా ప్రవేశించి ఆ యుపాధులను చైతన్యవంతముగావించి అయా ప్రపాధులను పోషించుచూ, చివరకు ఊర్ధ్వ పరిణామ రూపములో తానే ఇమిడిపోవుచున్నది. జీవో పాధులచే వానివాని కర్మలు జరుపుటకు వలయు తెలివి, శక్తి, యుక్తులు ఆత్మయే వాని కనుగ్రహించుచున్నది. కనుక ఆత్మయే సర్వ క్రియలకు, లేక కర్మలకు కర్తయై యున్నది.

ఈ విషయమునే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు--
"ఆటాడి యాడకుండును --
ఆటాడిన మేని బొమ్మ ఆటాడకనే --
యాటాడు, యెరుక యనియెడి -
ఆటాడించేటివాడు అతడే కర్తా -
అన్నిటికీ యచల మకర్తా -
చేటు పాటుల రెంటించే వచ్చు ఫలము
ముమ్మాటి కనుభవించి మరణ జననములొంద
నతడేర కర్తా; అన్నిటికీ యచలకర్తా॥"

అని కందార్థములో యద్ఘాటించినారు. కనుక కర్తృత్వ రహిత విధానమే కర్మయోగ రహస్యము.

"సమత్వం యోగ ముచ్యతే" అని కూడ గీత కర్మ యోగ నిర్వచనము గావించినది. ఆ సమత్వ మెట్లు సిద్ధించును ? గుర్తు లేక యెరుకవున్నంతవరకు భేదము గోచరించక తప్పదు. భేదమును గుర్తించుచునే సమదృష్టి పూనాలిగదా యని కృత్రిమముగాక సమదృష్టి సహజమైపోవాలి. అంటే గుర్తు (యెరుక) యొక్క రహితమునందు గాని సిద్ధించదు. కొందరు అహంకార మమకారములు లేక కర్మ యొనర్చినచో అది కర్మయోగ మగునని చెప్పిరి. అహంకార మమకారములకు "నేను" మూలముకదా ! కనుక ఆ "నేను" గుర్తించి దాని రహితముకొరకు పరిపూర్ణ రాజయోగమును ఆశ్రయించినవాడే నిజమగు కర్మయోగి, అతడే రాజయోగి. అతడు చేయు పని అంతయు "అకర్మ"యే అగును. అతడు కర్మ చేసియు చేయని వాడే అగుటచే అకర్తయు అభోక్తయు నగుచున్నాడు. ఇట్టి అకర్మద్వారా తప్ప నైష్కర్మ్యసిద్ధి కాదు.



# 15. భక్తి జ్ఞానములు

మోక్షసాధన మార్గా లన్నిటిలో భక్తి సాధనయే శ్రేష్ఠమన్నారు. "జ్ఞానం వినా మోక్ష నసిద్ధ్యంతి' జ్ఞానం లేక మోక్షం దొరకదు అని చెప్పబడి యున్నప్పుడు భక్తి సాధనయే శ్రేష్ఠమని ఆదిశంకరులవారేయనుట చాల చిత్రముగా దోచవచ్చును. ఐతే "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ" అని వూరుకొనక వెంటనే ఆయన "స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" అని ఆ భక్తికి నిర్వచనం యిచ్చినారు. కనుక ఆచార్య స్వాములవారి దృష్టిలో అట్టి భక్తి జ్ఞానముకన్న అభిన్నమనియే దేలుచున్నది.

భక్తి అన్నప్పుడు ద్వైతం తప్పదు. భక్తుడు ఒకడు, భగవంతుడొకడు. వారిద్దరిమధ్య సంబంధమే భక్తి. ఐతే భక్తునకు భగవంతునియందుండే ప్రేమను భక్తియనీ, భగవంతునికి భక్తునిపై నుండే ప్రేమను వాత్సల్యమనీ యనవలెను. శంకరులవారి నిర్వచనం ప్రకారం స్వరూపానుసంధానము చేయువాడు భక్తుడు. అనుసంధానము చేయుటయే భక్తి. కాని స్వరూపమును తెలుసుకొన్నగదా దానిని అనుసంధానము చేయుట? అయితే స్వరూపమును తెలుసుకొనుటయే జ్ఞానముగదా ! కనుక ఆచార్య స్వాములవారు చెప్పే భక్తి జ్ఞానమే అనవలెనా? లేక తద్భిన్న మనవలెనా ?

భక్తి మార్గములో ద్వైతభావము తప్పదు. అద్వైత మత ప్రతిష్ఠాపనాచార్యులగు ఆది శంకరుల ద్వైతమార్గమును, భక్తిని యెట్లంగీకరించిరోయని శంక కలుగక తప్పదు. అద్వైతము జ్ఞాన మార్గమని చెప్పినప్పటికి తత్, త్వం, పద పదార్థములను అన్వయ వ్యతిరేక యుక్తులచే శోధించుచూ శ్రవణ, మనన, నిధి ధ్యాసలు చేయు సాధనాకాలమందు మాత్రమే ద్వైతము తప్పదు. వాక్యార్థజ్ఞాన మారూఢమగు వరకు జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయ - రూపమగు త్రిపుటి తప్పదు. అంతవరకు "మాయామాత్ర మిదం ద్వైతం, అద్వైతం పరమార్థతః" అని వాచా చెప్పుకొంటూండవలసినదే. అట్లు గాక "మయ్యేవ సకలం జాతం, మయి సర్వం ప్రతిష్ఠితం ! మయి సర్వం లయం యాతి ... ... ..." అనగా నాయందే సర్వము పుట్టుచున్నది. నాయందే మరుగగుచున్నది. అట్టి బ్రహ్మయే నేను, నేనే ఆ బ్రహ్మము అని ఆరూఢజ్ఞానము కలిగినవాడే అద్వైతము. అపుడే జ్ఞాతృ జ్ఞాన, జ్ఞేయాది ద్విపుటి త్రిపుటులన్నియు పరమాత్మయందే పర్యవసించును. తాను పరమాత్మయై వుండుట జ్ఞానమార్గమందు చరమస్థితి. ఇందుకు సాధన జ్ఞేయమగు పరమాత్మానుసంధానమే. సాధనా కాలమందు భక్తి, సిద్ధావస్థయందు జ్ఞానము మొదటి మార్గము. రెండవది గమ్యము. ఈ విధముగా నిర్ణయించి భక్తి, జ్ఞానమున కొక సోపానము మాత్రమే కనుక జ్ఞానము గొప్పది. భక్తి

తక్కువది అని కొందరు అందురు. మరి కొందరు జ్ఞానమే సోపానము; పరాభక్తియే గమ్యము అని వాదింతురు. స్వరూపమును తెలియుట జ్ఞానము. పిదప తెలిసి అనుసందానముచేసి కృతార్థుడగుటయే భక్తి అని వారు చెప్పెదరు. కాని ఎట్లు చెప్పుకొన్నా యొకటియే. ఆరూఢ జ్ఞానమున్ను ఐకాంతిక భక్తియున్ను చివరకు ఒక్కస్థానము నందు కేంద్రీకరించుట (కలుసుకొనుట) తప్పదు.

"ఆత్మన్యేవోపాసీత"; "ప్రియమిత్యుపాసీత" అనగా ఆత్మనే వుపాసింపుము. అది ప్రేమస్వరూపమైనదిగా తెలిసి వుపాసింపుము అని ఈ శ్రుతుల తాత్పర్యము. సరి అయిన భక్తుడే నాకు ప్రియతము డంటున్నాడు, గీతాచార్యుడు. భక్తునకా భగవంతునికంటె ప్రియతమమైనదిన్నీ లేదు కనుక భక్తియే ప్రేమస్వరూపము. ప్రేమయే భగవంతుడు. కనుక భక్తియొక్క స్వరూపమే భగవంతుడు. విభక్తి కానిదే భక్తి. కనుక "ఏకమేవా ఉ ద్వితీయం" అని చెప్పబడినదేభక్తి. ఈ విధంగా విచారిస్తే భక్తి జ్ఞానములు వేర్వేరు అని అనజెల్లునా ?

రాధాకృష్ణుల ప్రేమ దివ్యము అట్టి ప్రేమయే భక్తి యొక్క పరాకాష్ఠ. అట్టి ప్రేమ తరతమ భేదముచే యెట్లు ఆత్మయందే పర్యవసించుచున్నదో చూడుడు !

విత్తాత్ పుత్రః ప్రియం భవతి
పుత్రా త్స్వశరీరం ప్రియం ।
యింద్రియాణి ప్రియా ప్రాణః
ప్రాణా దాత్మా పరః ప్రియః ॥

అనగా విత్తము, పుత్రుడు, స్వశరీరము, యింద్రియములు, ప్రాణము ఆత్మ ఇవి పూర్వా పూర్వములకంటె వుత్తరోత్తరములు ఒకదానికంటె నొకటి ప్రియతరములై, చివరిదైన ఆత్మ అన్నిటికంటె ప్రియతమమైయున్నది అని భావము. కనుక పరమాత్మయందు పర్యవసింప జేయని ప్రేమకు సార్థక్యము లేదు. "ఆత్మవస్తు కామాయ విత్తం ప్రియం భవతి, ...... (అంటూ చివరకు) "ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అని బృహదారణ్యక శ్రుతియును, యుద్ఘాటించుచున్నది. అనగా, తానైన ఆత్మయందు సహజముగా తనకు ప్రేమ యుండుటచేతనే విత్తము, పుత్రుడు, భార్యా, యిత్యాదులయందు తనకు ప్రేమ కలుగుచున్నది. కాబట్టి అట్టి ఆత్మయే ప్రేమనిధానము. ప్రేమకు (భక్తికి) పరంధామము అయివున్నది. ఆత్మకు సత్య జ్ఞానానందములు (సచ్చితానందములు లేక అస్తి భాతి ప్రియ లక్షణములు) స్వరూపమే అయివున్నవి. కనుక స్వరూప లక్షణముచేత కూడా ఆత్మ ప్రేమరూపము, జ్ఞానరూపముకూడ నైయున్నది. ఏతత్ప్రాప్తికి ప్రేమసాధన. (భక్తి) జ్ఞానసాధన రెండున్నూ మార్గములే. ఈ రెంటి లక్ష్యములున్ను ఒక్కటే, మార్గము కూడా ఒకటేగాని భిన్నముకాదు అని విమర్శించి తెలుసుకో నగును.

# 16. కర్త - కర్మ - క్రియలు

కర్త - కర్మ - క్రియలు అనగా నేమి ? కర్త అనగా చేయువాడు; అతడు చేసే పనియే కర్మ; క్రియ అనగా చేయుట. సర్వప్రాణులు పనిచేయుచున్నవి. మనస్సు, వాక్కు, శరీరము యివి పనిచేయుటకు ముఖ్యమైన పనిముట్లు. కనుకనే వానిని త్రికరణములన్నారు. అందేది పనిచేసినా కర్మ జరిగినట్లే. సర్వప్రాణులలోనూ యిందేదియో ఒక పనిముట్లు (ముఖ్యముగా శరీరము) పనిచేయుచునే వుండును. మానవులందు మాత్రము మూడు పనిముట్లూ పనిచేయుచుండును. గాఢసుషుప్తిలో సహితము శ్వాసక్రియ, పచనక్రియ, రక్త ప్రసరణ మొదలగు పనులు సర్వప్రాణుల శరీరములయందు జరుగుచునేయుండును. కనుక సజీవమైన యే ప్రాణియైననూ ఎట్టిపని చేయక పూరక నుండజాలదు. తనకు తెలిసియో తెలియకనో యేదో యొకపని జరుగుచునే యుండును. కనుక కర్మత్యాగమనేది వుండనే వుండజాలదు. చిరకాలము సమాధినిష్ఠలో వుండివున్న మానవ శరీరమందు గూడా పని జరుగుచునే వున్నది. అంతకు పూర్వము కుంభించిన వాయువు నందలి సత్తాను ఆ శరీరము ఆహారముగా గైకొనుచున్నది. తన రక్తమాంసములనే తన శరీరము భుజించి సజీవముగా నుంటున్నది. నఖ రోమములు పెరుగుచున్నవి. శరీరమునకు వృద్ధాప్య లక్షణములు వచ్చుచున్నవి. కనుక బ్రతికి యున్నంత వరకు కర్మ జరుగుచునే యుండును. అంతరేంద్రియ, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పనిచేయక పోయినా, ప్రాణేంద్రియములలో సమాన ప్రాణములు శరీరమును ధరించి, భరించుచున్నవి, కనుక ఎట్టిపనీ జరుగక, యేప్రాణి శరీరమున్నూ బ్రతికియుండ జాలదు.

క్షణం కూడా కర్మచేయకుండా యెవరున్నూ యుండజాలరని గీతయందు యుద్ఘాటింపబడినది. కర్మలు రెండు విధములు - 1) గుర్తెరుగకుండా చేయబడు కర్మలు - ఆగామి ఫలములనీయవు. అనగా పుణ్యపాప సంస్కారముల నుత్పత్తి చేయవు కనుక రాబోవు జన్మలలో సుఖదుఃఖముల కలిగింప జాలవు. 2) బుద్ధి పూర్వకముగా చేయబడు కర్మలు. ఇవియే మానవులకు ఆగామిఫలమును ఇయ్యగలవు కాని పశుపక్షి క్రిమికీటకములు చేయు పనులకు ఆగామి ఫలముండజాలదు. ఏలననగా వానికి యుక్తాయుక్తములు నిర్ణయించు బుద్ధిలేదు. వాని వాని యుపాధికి సహజమగు కర్మలను అవసరాను సారము మాత్రమే ఆయాప్రాణులు చేయుచుండును. ఐతే గోవులన్నియు ఒకేజాతికి చెందియున్నవిగదా ! వానిలో కొన్ని పరమసాధు స్వభావము కలిగియుండగా! మరికొన్ని క్రూరస్వభావము గలవై యుండుటకు కారణమేమి ?

యని సంశయము గలుగును. ఏకజాతియైనా వాని అంతఃకరణ యందలి గుణత్రయములు హెచ్చుతగ్గుపాళ్ళలో నుండుటయే యిందుకు కారణమని చెప్పనగును.

బుద్ధిపూర్వకముగా చేయబడు కర్మలే పుణ్య పాప ఫలములనిచ్చును అన్నాము. బుద్ధి పూర్వకముగా కర్మచేయు వాడే కర్త యనదగును. ఉదాహరణ :- పసిబాలుడు ఆడుకొంటూ చీమలను యితర క్రిములను బాధించి చంపును. అది వాని కొక ఆటమాత్రమేకాని ఆకార్యము హింసాకార్యమని తత్ఫలితము పుత్తరోత్రా తన్ను బాధించుననీ వానికి తెలియదు. అట్లే పిచ్చివాడు చేయు కర్మఫలము లాతని నంటవు, మరియు సత్కర్మలనే గావించునెడలకూడా అని వార్యముగా కొంత హింస జరుగవచ్చును. ఎట్లనగా - బీదలకు అన్నదానము చేయవలెనని సంకల్పించి వంటలు చేయించునపుడు వంటకట్టెలలోను, కూరలలోను, వేడిగంజి వార్చు నపుడును అనేక క్రిములు నాశనమగుచుండును. మరియు మనము సంచరించునపుడు ఇంట దీపములు పెట్టుకొన్నపుడు చివరకు వుఛ్వాసనిశ్వాసలు జరుగునపుడుకూడ ప్రాణహింస జరుగుచున్నది. ఈ పనులు చేయునపుడు ఆయాప్రాణులను హింసించవలెనని మన కెట్టి కోరికయు లేదు. కనుక మనము కర్తలము కాము. అకర్తలమే అగుదుము. కనుక ఆయా కర్మల ఫలితము మనల నంటజాలదు. అంతేగాక బుద్ధిపూర్వకముగా మనముచేయు హింసాత్మక చర్యలవల్లకూడా కొన్నిటి యెడల మన కెట్టి పాపము కలుగదు. క్రూరజంతువులను, మనలను బాధించు పాములు తేళ్ళు నల్లులు దోమలు మొదలగు వానిని మనం బుద్ధిపూర్వకముగా చంపినను పాపమంటదు. నల్లులను చంపుట పాపమూ కాదా యని శ్రీ రామకృష్ణ పరమహంసగారిని ప్రశ్నించి తెలుసుకొనవలెనని ఆయన శిష్యుడొకడు ఆయనవద్దకు పోయేసరికి ఆయన మంచమొకదానిని ఎండలోవేసి నల్లులను వెదకి వెదకి పట్టి చంపుచుండెనట. ఆవిధముగా ఆశిష్యునికి జవాబు లభించినది. అంతేగాక సమష్టి శ్రేయస్సు కొరకు లేదా యెక్కువమందిని కాపాడుటకు తక్కువ మందిని చంపవలసి వచ్చినా దోషము లేదు. బలవంతుని బారినుండి బలహీనులను కాపాడుటకై బలవంతుని ఆస్తిరక్షణకుగాని చేయు హింసాకార్యములున్ను పాపహేతువులు కాజాలవు.

ఇంతవరకు జనులుచేయు కర్మలయందలి పుణ్యపాప ఫలములు అంటువిధానమును గూర్చి కొంతచర్చించితిమి. ఇక పారమార్థికాభ్యున్నతికోరు సాధకులుచేయు కర్మ విధానముల గూర్చి విచారించెదము.

ప్రతినరుడూ సుఖమునే ఆశించునుగాని దుఃఖమును గాని కష్టములనుగాని యెవరున్ను కోరుకొనరు. దీనికి విరుద్ధముగా పాండురాజు ప్రథమ భార్యయగు కుంతీదేవి మాత్రం కష్టములే తనకెప్పుడూ కలుగవలెనని కోరుకొని యుండెనని ఒక కథకలదు. ఎట్లనగా శ్రీకృష్ణుడు నిర్యాణముచెందు సమయమున తన బంధుజనముల రావించి ఎవరెవరు యేయే కోరికలు

కోరుకొందురో కోరుకొండని; అవి సిద్ధించునట్లు వరములిచ్చెదననియు ప్రకటించగా అందరూ అన్ని కోరికలు కోరుకొనిరట. అందరికీ అన్నివరములూ శ్రీకృష్ణుడనుగ్రహించెనట. మేనత్తయగు కుంతీదేవి మాత్రము ముందుకు వచ్చి యెట్టికోరికలు కోరుకొనకుండ ఒక మూల కూర్చుండెనట. ఆమెను పిలచి నీవువచ్చి అందరివలె యెందుకు కోరుకొనలేదు ? అని అడుగగా ఆమె తనకేకోరికలు లేవు అని చెప్పగా "అట్లాకాదు, నన్ను సంతృప్తి పరచుటకైననూ యేదైన నొకటి కోరుకొమ్మని వత్తిడిచేయగా ఆమె తనకు ఎప్పుడునూ కష్టములే ప్రాప్తించునటుల వరమిమ్మని అడిగెనట. ఎవరైనను కష్టములు కోరుకొందురా ? యిదేమి కోరికయని యెల్లరు ఆశ్చర్యపడిరి. నీవేల కష్టము కోరు కొంటివి ? అని శ్రీకృష్ణుడామెను ప్రశ్నింపగా "స్వామీ, సర్వ సుఖములూవుంటే నీవెవరికి కావలెను ? నాజీవిత మంతయూ కష్టములతోనే గడచినది. ఆ కష్టములలో నున్నందుననే నిరంతరము నిన్ను స్మరించుచూ శాంతి పొందుచుంటిని. లేనిచో నీవుగాని నీ నామస్మరణగాని యెవరికి కావలెను ? యిట్టి భక్తి శేషజీవితములో చివరవరకూ నా కుండవలెనంటే కష్టములూ దుఃఖమూ వుంటేనే అది సాధ్యపడ గలదు. కనుకనే నాకెప్పటికీ కష్టములే వుండవలెనని కోరుకొంటిని' ' అని ప్రత్యుత్తర మిచ్చెను. ఐతే కుంతీదేవి కోరికకూడా "అందరూ సుఖమునేగాని దఃఖమునెవరున్నూ కోరుకొనరు" అనే సూత్రమునకు మినహాయింపుగా పైకథ నిలువజాలదు. ఏమనగా -- కష్టములలోనుండి దైవస్మరణ చేసుకొనుటలో గల శాంత్యానందములను కుంతి కోరుకొన్నట్లే అయినది. కనుక ఆమెకోరికకున్ను సుఖాభిలాషయే మూలము అని చెప్పనగును. ఐతే కొందరు ప్రాపంచిక సుఖములను మాత్రమే కోరుకొందురు. మరికొందరు ఆముష్మిక సుఖములను కోరు కొందురు. ఇంకా కొందరు ఈ ఐహికాముష్మిక సుఖములను కోరక బ్రహ్మానంద రూపమగు పరమ సౌఖ్యమునే కోరుకొందురు. ఈ త్రివిధ రూపములగు సుఖములలో యేదిన్ని శాశ్వతముకాదు. తానున్నంతవరకు జనన మరణములు తప్పవు. కనుక సుఖదఃఖములున్ను తప్పవు. కనుకనే జన్మరాహిత్యమునే వుత్తమోత్తమ జిజ్ఞాసులు కోరుకొని అట్టి శాశ్వత జన్మరాహిత్యమునే పరమావధిగా నెంచుచున్నారు.

ప్రపంచమునందలి సకల మతకారులను సత్కర్మాచరణను విధించియున్నారు. కారణ మేమనగా సాధకుడు పరిశుద్ధాంతఃకరణము కల్గియుండుట ముఖ్యావసరము. మలవిక్షేప ఆవరణదోషములు, నానా వాసనలు గూడుకట్టుకొని యున్న అంతఃకరణము రాళ్ళతోడను రప్పలతోను ముండ్ల మొక్కలతోను నిండియున్న అడవిభూమి సేద్యమునకు అనుకూలముగానట్లు పారమార్థిక వ్యవసాయమునకు యోగ్యమైన క్షేత్రమే కాజాలదు. శుద్ధాంతఃకరణమునందే ఆత్మప్రకాశము చక్కగా ప్రతిఫలింపగలదు. గురువునాటిన జ్ఞానబీజములు మొలకెత్తి ఫలింపగలవు. కనుక పారమార్థిక సాధకులందరికీ త్రివిధ తపస్సులు (కాయక వాచిక మానసిక - తపస్సులు) అత్యంతావశ్యకములై యున్నవి. కర్మ, భక్తి, యోగ, జ్ఞాన, అతీత జ్ఞానార్గముల వారందరూ త్రివిధ

తపస్సులూ త్రికరణశుద్ధీ, సత్కర్మాచరణము విధిగా పాటించవలసియున్నది. అట్లుగాక శ్రీరంగనీతులు మాత్రము వాచా వల్లెవేయుచూ క్రియాచరణ లేనివారు మిధ్యాచారులని గీత పేర్కొనియున్నది.

కర్మచేయుటయూ తప్పదు. దాని ఫలము అనుభవించుటయూ తప్పదు. అందరూ కర్మచేయువారే. అందరూ కర్మిష్టులుకారు. కర్మయోగులసలేకారు. వేదోక్తకర్మలు విధి పూర్వకముగా చేయువారు అనగా యజ్ఞయాగాది క్రతువు లొనర్చి దేవతలను సంతృప్తిపరుచువారు పుణ్యఫల మార్జించి దేవతాలోకములలో సుఖభోగములనుభవించకోరుదురు. వీరు విధినిషేధములను పాటించి నిషిద్ధకర్మలు మానివేయుదురు. నిత్యనైమిత్తిక కర్మలను చేయుదురు. వీరు కర్మిష్టులగుదురే గాని కర్మయోగులు కాదు. సత్కర్మాచరణచేయుటచే వీరి అంతఃకరణము కొంతవరకు పరిశుద్ధముకాగలదు. "క్షీణేపుణ్యేమర్త్య లోకం విశంతి" అనే న్యాయంగా పుణ్యము క్షీణించగనే మరల భూమియందు జన్మలెత్తుదురు.

ఇక కర్మయోగ మేదియో యించుక విచారించనగును. చేసెడి కర్మ అంతయు కర్మయోగ మెపుడు కాగలదు ?

అంటే

1) ఐహికాముష్మిక సుఖభోగములందెట్టి కోరికలూ వుండరాదు. వున్నచో ఆతని కర్మలు కామ్యకర్మలేయగును. గాని నిష్కామకర్మ (లేక నిస్వార్థకర్మ) యెట్లు కాగలదు ?

2) మానవుడు జ్ఞానేంద్రియములచే శబ్దాదులను గ్రహించి వానికి లోలత్వమును చెందుచున్నాడు కనుక దృఢమనస్సుచే యింద్రియ చాపల్యమును అరికట్టవలెను.

3) యజ్ఞార్థము మాత్రమే కర్మచేయవలెను. యజ్ఞార్థ మనగా తన స్వార్థముకొరకు గాక లోకహితార్థం అనగా పరోపకారము నిమిత్తము కర్మచేయవలెను. తనకీ జన్మలో ప్రాప్తించిన సంపదలు పూర్వ జన్మలలో తానుచేసిన పుణ్యకార్యముల ఫలితములుగా దైవదత్తములై యున్నవి. వానిని లోక శ్రేయస్సుకై వినియోగించక పూర్తిగా తానే అనుభవించువాడు దొంగయే యగుచున్నాడని గీత యద్ఘాటించు చున్నది. కాని తన దేహయాత్ర కొరకు అవసరమైనంతవరకు అనుభవించక తప్పదుకదా ! కనుక దైవత్తమగు తన సంపదను యజ్ఞ శేషముగా (ప్రసాదముగా) మాత్రము అవసరమైనంతవరకు వినియోగించుకొని శేషించునది లోక శ్రేయస్సు కొరకు వినియోగించవలెను. ధనమును వస్తుసంపదను విపరీతముగా కూడబెట్టుట దూష్యము. ఏలననగా ఆవస్తుసంపద మిగతావారికి అందుబాటులో లేక కరువుకాటకములు ఏర్పడు చున్నవి.

4) స్వధర్మ రూపమైన నియతకర్మను అసంగముగ (ఫలాసక్తిలేక) చేయవలెను. వైరాగ్యము యింద్రియ నిగ్రహముకల్గి. స్వధర్మమును వీడక చేయబడు సమిష్టి శ్రయోదాయకమగు కర్మలు

మాత్రము కర్మయోగములో చేరును. నేను లోకమునకు మేలు చేయుచున్నాననే అహంకార మేమియు నుండకూడదు. సేవారూపముగా నేను చేయుచున్నాను. అను వినమ్రభావముతో మాత్రమే చేయవలెను. మరిన్ని పరోపకారముతో లోకసేవా పరాయణముగ జీవించునవకాశము తనకు లభించినదిగదా యని సంతోషపూర్వకముగ సేవాధర్మము నిర్వర్తించవలెను.

ఇట్టి కర్మయోగి భక్తుడా ? లేక జ్ఞానియా ? భక్తుడగు కర్మయోగి చేయు కర్మకు జ్ఞానియొక్క కర్మకు వారివారి అంతఃకరణ దృక్పథములో మాత్రమే తేడాకలదు. అది ఎట్టిదో యించుక పరిశీలించుటకు ముందు వారిర్వురకుగూడా శీల సంపత్తి ముఖ్యావసరమనిన్ని అందుకు సత్కర్మాచరణము ఆవశ్య కర్తవ్యమనిన్నీ మరువరాదు. కర్మయోగముతో గూడని భక్తిజ్ఞానములు వ్యర్థములు. కనుకనే భగవద్గీత యందు యించుమించు అన్ని అధ్యాయములందును కర్మ ప్రశంస విరివిగా చేయబడుచు వచ్చినది. ఉత్తముడగు భక్తుడు వుత్తమ కర్మయోగియే అగుచున్నాడు.

భక్తుడగు కర్మయోగి దైవసమర్పణముగ మాత్రమే సకల కర్మలు చేయుచుండును. అతడు సేవకుడు. తన ఇష్టదైవమే ప్రభువు తానుచేయు పనులచే స్వామిని సంతృప్తిపరచుటకే భక్తుడు శ్రమించుచుండును. అతని ఆజ్ఞలను శిరసావహించి, పాలించుటే అతని కర్తవ్యము, ఆ దైవకృపయే అతడాసించును. యితర ఫలాపేక్ష యేమియు నాతనికి వుండదు. కనుక అతనికి కర్మసంస్కారములంటవు. ఆగామి కర్మఫలములే సృష్టింపబడవు.

శ్లో॥ యత్కరోషి, యదశ్నాసి యజ్జుహోషి తదాసియత్।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥

నీవు యే కర్మ చేసినా యేదితిన్నా, ఏ యజ్ఞ దాన తపస్సులు చేసినా అవన్నియు నాకర్పింపుము అను భగవదాదేశమును భక్తుడు పాటించును.

అంతేగాక పరమభక్తుడు తన్నే భగవానునికి పూర్తిగా అర్పించుకొనును. ఆపైన తాను భగవంతుని చేతి కీలుబొమ్మగానే భావించును. తన్నాడించువాడాయనే. ఆయన ఆడించిన అట్లే ఆడుచున్నానని తలంచును. తనకర్మల కన్నిటికి ప్రేరణ యిచ్చునది ఆయనే, చేయించునదీ ఆయనే తత్ఫలముల ననుగ్రహించునదీ ఆయనే. కర్త కర్మ, క్రియలన్నియును ఆయనే. ఆరీతిగా తానకర్త, అభోక్త, తనద్వారా చేయబడుకర్మ యొక్క ఫలములు తన్నంటనే అంటవు. కనుక ఫలములీయని ఆ కర్మలను కర్మయే అనరాదు: అది అకర్మయే అగును. "సర్వ ధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ" అను భగవచ్ఛాసనము పాలించి అతడు సర్వార్పణ బుద్ధితో శరణాగతి చేసిన వుత్తమభక్తుడు.

ఇక జ్ఞాని ఎట్టు అంతఃకరణ ప్రవృత్తితో కర్మాచరించునో తెలిసికొందము - వాచా వేదాంతసూక్తు లుద్ఘాటించు వాడు జ్ఞానికాడు. కాయిక వాచక మానసిక రూపములగు త్రివిధకర్మల

యందునూ తానుద్ఘాటించు వేదాంత సూత్రములను ఆచరణయందుంచి అనుష్ఠించువాడే జ్ఞాని. తానాచరించు సకల కర్మలయందు అతడాత్మదృష్టి వీడడు. ఆత్మ బ్రహ్మైక్యానుభవమునే అతడు కోరును. కనుక ఆ అనుభవసిద్ధికై అతడాత్మదృష్టిని యెన్నడు వీడడు. "ఆత్మనోన్యం నకించన" ఆత్మ కంటె అన్య మేమీ కొంచమైనా యేమీ లేదనే నిశ్చయముపై దృశ్యాదృశ్యమగు సర్వము ఆత్మస్వరూపముగా గుర్తించు అమృత దృష్టియే ఆత్మదృష్టి. ఆత్మ అకర్త, అభోక్త అయివున్నాడు. ఆ ఆత్మయే నేను. కనుక "నాహం కర్తానభోక్తా" నేను కేవలము సాక్షీభూతుడను. కర్మచేయునవి దేహేంద్రియ మనస్సులే కాని సాక్షీభూతమైన ఆత్మ కాదు. "అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే" అనగా దేహాదులతో తాదాత్మ్యముపొంది ఆ నేనే ఆత్మయని అజ్ఞానిమాత్రమే భావించి తాను కర్తననుకొంటాడు. అజ్ఞాని దృష్టిలో ఆకాశ నిజాంశమగు అంతఃకరణమే తాను కనుక తానే కర్త అని భావించును. ఇట్లు భావించుట యేల సరిగాదు ? అంటే జ్ఞానికి ప్రత్యగాత్మయే తాను. 'ప్రత్య గాత్మా శివోహం శివోహం' ఆ విషయం తెలియక, అజ్ఞాని అంతఃకరణమే తానను కొంటున్నాడు. పంచతాన్మాత్ర విషయములందు లగ్నత చెంది దేహేంద్రియ మనోహంకారములతో ప్రవర్తించుచు కర్మనొనర్చును. ఆత్మయట్లు విషయము లందు మగ్నత చెందదుగదా ? కనుక అట్టి యాత్మకు కర్తృత్వము అంటగట్టుట అజ్ఞాన మన్నారు. ఆత్మవస్తు నిశ్చయము లేకపోవుటచేతనే అజ్ఞాని ఆత్మకు కర్తృత్వ మాపాదించినాడు. ఆత్మకర్తగాకపోతే, మరి గీతదృష్టిలో కర్తయెవరు ? అంటే "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః" అనిన్నీ "గుణా గుణేషు వర్తంతే యితిమత్వాన సజ్జతే" అనిన్నీ (అనగా త్రిగుణములే-గుణరూపములగు విషయము లందు వర్తించుచున్నవనిన్నీ) యింద్రియములు వానివాని విషయములయందు వర్తించుచుండుట మాత్రమే ననిన్నీ గీత సమాధానము చెప్పుచున్నది. త్రిగుణ ప్రవృత్తిచేత యింద్రియములు (మనస్సుతో సహా) కార్యము లొనర్చుచున్నవి. కనుక కర్తృత్వము వానిదేకాని ఆత్మకట్టి కర్తృత్వము లేదని గీత నిశ్చయించినది. అంటే ఫలాపేక్ష. కర్తృత్వము యీ రెండూ కూడా అంతఃకరణకేగాని ఆత్మకు లేవు. గనుక ఆత్మైన నాకు కర్తృత్వమే లేదు. సర్వము నేనైవున్నాను. "మమాత్మా సర్వభూతాంత రాత్మా" అని జ్ఞాని నిర్ణయించుకొని సకల కర్మలు ఆత్మదృష్టిచేతనే చేయును. ఆవిధముగా కర్మఫలములీయని ఆతని కర్మలుకూడా అకర్మలే అయి అజ్ఞాని కెట్టి ఆగామికర్మ లేకుండా పోవుచున్నది.

ఇక పరిపూర్ణభావజుని కర్మవిధాన మేమి ? యెట్టి అంతఃకరణ ప్రవృత్తితో అతడు జీవయాత్ర సాగించును ? అను విషయములనుగూర్చి విచారింతము. గుర్తెరుగకుండా యెవరున్ను ఏకర్మయుూచేయరు. కనుక గుర్తే సకల కర్మలకు మూలం కనుక ఆ గుర్తే కర్తఐతేగాని పరిపూర్ణబోధరీత్యా మూలంలేని గుర్తెరిగే శరీరం యేమీ లేదు. పరిపూర్ణ పరబ్రహ్మము యీ యెరుకకు మూలంగాని స్థానంగాని లేదు. మరొకటేదీ లేనేలేదు. కనుక మరొక మూలంకూడా యేమీ లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు యెరుక పుట్టనేలేదు. దాని యందు లేకనే తోచినది. అట్లులేక తోచిన యెరుక సకల సంకల్పములు చేయుచు సకల కర్మలకు మూలమైయున్నది.

అట్టి యెరుకను విడచుటే నిజమైన త్యాగము. "త్యాగేనైకే అమృతత్వ మానశుః" యిట్టి త్యాగికి అమృతత్వము అనగా జనన మరణ రాహిత్యము కలిగి తీరును. ఎరుక సత్యమని భ్రమించి చేయు కర్మలు పుణ్య పాపములకు కారణ మగును. కాని ఎరుక విడచిన తాపసులకు అట్టి పుణ్య పాపములంటవు. లేని యెరుకకు కర్తృత్వ కారయితత్వములున్నూ నుండజాలవు. ఈ పరిపూర్ణ బోధ ఆరూఢము అయినవానికి ప్రవృత్తి నివృ త్తులు లేవు. భుక్తి ముక్తి క్రియలయందు సంగముగాని అసంగముగాని లేక పనులు చేయును. అతడు రాగియూ కాడు, విరాగియూ కాడు. మూలంలేని గుర్తెరిగే శరీరము యేమీ లేదనే దృఢ నిశ్చయంపైననే అతడెల్లపుడూ నుండును. కనుక నాతనిని అశరీరి అన్నారు. యిట్టి స్థితి సామాన్యం కాదు. ఆరూఢత యేమియు చేకూరనిదే, నేను అచల పరిపూర్ణుడను, అశరీరిని యని పరిపూర్ణగురువును చేరిన ప్రతివాడూ అనుకొంటే అది ఆత్మవంచనయే కాగలదు.

ఐహికాముష్మిక సుఖములకై చేయబడు కర్మలు. ఆత్మైక్యరూపమగు మోక్షమును గోరిచేయు కర్మలూ కామ్య కర్మలే, మరిన్ని బంధకారణములే."కేవల మోక్షాపేక్ష సంకల్పో బంధః" అని నిరాలంబోపనిషత్ వాక్యము. ఈ త్రివిధ కర్మలలోను స్వార్థమున్నది స్వ+అర్థము = స్వార్థము కనుక యిందు "స్వ", అనగా తాను, తన ప్రయోజనమూ వుంటూనేవున్నవి. కనుక నిస్వార్థకర్మ, లేక నిష్కామకర్మ కాజాలదు. తాను లేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. పరిపూర్ణ భావజ్ఞుడు తాను లేననే ఆరూఢతపై చేయు కర్మలే నిస్వార్థకర్మలు కాగలవు. అతడే, అకర్త. కర్మలు చేసియు చేయనివాడగుచున్నాడు. తానే లేడు గనుక తనకు కర్మఫల మంటునా ? యిట్టి భావనాబలముతో చేయబడు కర్మాచరణ విధానమే అశరీర పద్ధతి.

పరిపూర్ణ బ్రహ్మమునందు పురుషప్రకృతులు లేవు. పురుషుడు లేనిచో పురుషార్థములు లేవు. కావున చతుర్విధ పురుషార్థములు వాని ఫలప్రాప్తియు అశరీరికి లేవు. కనుక అతడుచేయు కర్మయే శుద్ధనిష్కామకర్మ, లేక నిస్వార్థకర్మ కాగలదు.

ఇంతవరకు ఏయే మార్గస్థులు ఏయే దృష్టితో కర్మాను ష్ఠానము చేతురో చేసిన వివరణ క్రింద క్లుప్తముగా పొందు పరచడమైనది.

1) సామాన్య మానవులందరు స్వార్థదృష్టితో కామ్యకర్మలను యిహలోక సుఖము నాశించి చేయుచున్నారు.

2) స్వర్గాది పరలోక సుఖముల నాశించి కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములు యజ్ఞయాగాది క్రతువులు కొందరు చేయుచున్నారు. నిష్కామముగ యజ్ఞాదులుచేసి శాశ్వత బ్రహ్మలోకము పొంది చివరకు బ్రహ్మతోసహా మోక్షము చెందగలమని పూర్వమీమాంసకులు.

3) నిష్కామముగ నిస్వార్థబుద్ధితో లోకసంగ్రహణార్థము యితర ఫలాపేక్ష లేక కర్మచేయువారు కర్మయోగులు.

4) కేవలం భగవత్ప్రీతి కొరకు భగవత్కైంకర్యముగ (యితర ఫలాపేక్ష లేక) భగవత్ప్రేరణతో కర్మచేయుచున్నామనే ప్రవృత్తితో కర్మచేయువారు భక్తులు. ఇది భక్తియోగము. భక్తి మార్గము జ్ఞానమార్గమునకు సోపానమని ఆదిశంకరులంటే, జ్ఞానమార్గమే భక్తికి సోపానమని రామానుజు లంటారు. అదే పరాభక్తి.

5) నేనే ఆత్మస్వరూపుడును. ఇంద్రియ మనస్సులు గుణకర్మల ప్రేరణతో సకల కర్మలు చేయుచున్నవి. నేను సాక్షిమాత్రుడను, అసంగుడను. నాకెట్టి కర్తృత్వము లేదు. కనుక ఆయా కర్మఫలితములు నన్నంటజాలవు అని జ్ఞానియొక్క దృక్పథము. జ్ఞానమార్గ కర్మమార్గములు రెండూ కలిసినపుడు అది కేవలము వాచాడంబర వేదాంతము గాక అనుష్ఠానవేదాంతమై బుద్ధి యోగమని ప్రసిద్ధికెక్కినది.

6) పరిపూర్ణ భావజ్ఞునిదృష్టిలో స్వయంప్రకాశముగల ఆత్మయే సర్వమునకు మూలము.

జ్ఞానము (గుర్తు) లేకుండా అనగా సంకల్పించకుండా ఎవరున్నూ యెట్టికర్మయు చేయరు. ఏది లేకుంటే ఏకర్మయు జరుగదో దానినే కర్తృత్వమని చెప్పవలెను. "తేన వినాతృణాగ్రమపి నచలతి" అనగా సర్వసత్తాంశరూపమగు ఆత్మయే లేనిచో ఏదీ జరుగదు. కనుక సర్వమునకు ఆ యాత్మయే కర్త. పరిపూర్ణబ్రహ్మమందు నేనైన యీ ఆత్మలేదు అని దృఢపరచుకొని కర్మలు చేయువానికి ఆ కర్మఫలము లంటవు. కర్మసంస్కారము లావిధముగా అంటనివానికి జనన మరణ రహితమేనని పరిపూర్ణుల భావము.

కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగములలో యేదో యొకదానిని మాత్రమే అభిమానించి అదొక్కటియే గొప్పదని వాదించువారు దురభిమానులనియే చెప్పవలెను. పరిపూర్ణరాజయోగములో కర్మ, భక్తి, జ్ఞానమార్గములు అన్నియు చేరియున్నవి, కర్తృత్వ రహిత విధానములో చేయబడు కర్మసుకౌశలము, సర్వార్పణబుద్ధితో గురుని సేవించు గురుభక్తి, ఆత్మ స్వరూప నిశ్చయముతో సమదృష్టి కలిగి సాధకుడు, అశరీరస్థితి గురుకృపచే ప్రాప్తించు వరకు కృషిచేసి కృతార్థుడు కాగలడు కనుక యీ సిద్ధాంతపద్ధతికే పరిపూర్ణ రాజయోగమని సార్థకనామ మేర్పడినది.

క్రియ అనగా పనిచేయుట (లేక పనిచేయు విధానము). కర్మ మనగా చేయబడిన పని (లేక దాని ఫలితము). కర్తయే లేనిచో క్రియా లేదు, కర్మాలేదు. కనుక కర్తృత్వ రహిత కర్మాచరణ విధానమైన కర్మకౌశలము తెలియుటకు పరిపూర్ణ బోధ గురువుల పాదము లాశ్రయించి గురుభక్తి గురుసేవ, గురునిష్ఠ కలిగి గురుకృపకు పాత్రులై పరిపూర్ణము యెరుకల నెరిగి తుదకెరుకవీడి అశరీరస్థితిలో శేషజీవితము సాగించి కృతార్థులగుదురుగాక ! ! !



# 17. ఆత్మవస్తు నిశ్చయము ఆవశ్యకత

"యతో వా ఇమాని భూతాని జాయంతే । యేన జాతాని జీవన్తి । యత్ప్రయంత్యభిసం విశంతీతి । తద్విజిజ్ఞాసస్వ । తద్బ్రహ్మేతి" తై॥ ఉ॥

దేనియందు సకలము జన్మించుచున్నదో, పెరుగు చున్నదో, చివరకు నశించుచున్నదో - అది బ్రహ్మము అని అర్థము. ఆవిధముగా జగత్కారణమగు వస్తువు ఆత్మ (లేక బ్రహ్మ) యని, సకల శ్రుతి స్మృతుల తాత్పర్యమై యున్నదని పరిపూర్ణ దర్శనములోని సృష్టి విజ్ఞాన ప్రకరణములో సిద్ధాంతము చేయబడినది. జన్మకారణమగు వస్తువే శాశ్వతము, అంతకంటె అతీతమగునది ఏమీ లేదు. దానిని చేరుటే మోక్షము అను భ్రాంతి యున్నంతవరకు జనన మరణములు శాశ్వతముగా పొందవలసియే యుండును. అట్టి భ్రాంతి రహితమునకు శ్రీ శివరామ దీక్షితులవారి సిద్ధాంతము. ఆ సిద్ధాంతమును విపులపరచుటకే శ్రీ భాగవతుల కృష్ణ దేశికేంద్రుల కందార్థ - కందపద్యములు ప్రవర్తిల్లినవి.

కందార్థములలో "పరిపూర్ణమనే దొకటి, లేనెరుకానె దొకటి, పరిపూర్ణ మెరుకల నెరిగి, యెరుకనుమాను" అని యీ సిద్ధాంతసారము సూత్రీకరింపబడినది. పరిపూర్ణ మెరుకల నెరిగిన పిదప యెరుకనుమాను అనుటలో యెరుకను యెరుంగుట అవసరమన్నట్లేగదా ?

యెరుగుట అనగా దానిని గురించి వినుట, చదువుట మాత్రమే కాదుగదా ! దాని (గురించిన) అపరోక్షజ్ఞానము కలిగినపుడే దానిని పూర్తిగా యెరిగినట్లగును. అపరోక్ష జ్ఞానమనగా యింగ్లీషులో చెప్పవలసివస్తే Direct Cognition అనుటకంటె గత్యంతరములేదు. చూచువాడు (ద్రష్ట) చూపు (దృక్కు) చూడబడేది (దృశ్యము) వేరైయున్నంతసేపు అది direct cognition కాదు. చెవులతో విన్నా, కంటితో చూచినా అది indirect cognition మాత్రమే అగును. మనస్సుతో చూచినపుడే అది direct cognition అపరోక్షము అని చెప్పవలెను. చూడబడు వస్తువు యొక్క రూపం మనస్సు చెందినపుడు నిజముగా మనస్సుతో చూచుట. మనస్సు ఏకాగ్రమైన క్షణములో (ఉష్ణముచే మెత్తగానైన లక్కవలె) ఆ చూడబడే వస్తు స్వరూపము చెందగల శక్తి మనస్సునకు గలదు. ఆ విధముగా చూచినపుడే యా వస్తువు అపరోక్షమైనది అని అనాలి. ఇదే వస్తునిశ్చయ జ్ఞానము. indirect cognition అనగా పరోక్ష జ్ఞానము అనగా జ్ఞానేంద్రియ పంచకమగు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణముల చేగల్గు యింద్రియజన్యజ్ఞానము కలుగును. ఇందువల్ల బుద్ధి నిశ్చయమే గాని, ఆత్మనిశ్చయరూపమగు అపరోక్ష సాక్షాత్కారము సిద్ధించదు. శ్రీ కృష్ణ దేశికేంద్రులు "పరిపూర్ణ మెరుకల నెరిగి" అనుటలో అపరోక్షముగా నెరుగుటయే పుద్దేశింపబడెను.

ఐతే, కంటికిగాని మనస్సునకుగాని గోచరించని పరిపూర్ణము (absolute Brahman) పట్ల అపరోక్షశబ్ద మెట్లన్వయించును ? ఎరుకనుగాని, ఎరుకలోగల వస్తువులనుగాని యెరుకచేత గుర్తించనగును. ఎరుకలేని పరిపూర్ణమును యెరుక లేక సేవింపదగును. ఎరుకలేక సేవించుటే, పరిపూర్ణ బ్రహ్మము యొక్క అపరోక్షము, "అపరోక్షమౌను మనుజులకు పరోక్షం బైనబైలు గురుకృపగలుగా; కీలిదెలేని యెరుక తాతొలుగా" అని కృష్ణదేశికేంద్రు లనుటలో, పరిపూర్ణ మపరోక్షమగుట కన్ను లేని యెరుక తొలగుటకున్ను గురుకృపయే కారణమై యున్నది. ఎరుకయే అపరోక్షముగానిచో, తెలియని యెరుకను విడచుట, అంగడిలోయున్న బెల్లమును గుడిలోనేయున్న దేవునికి, చెయ్యి మాత్రమే యిటనుండి త్రిప్పి నైవేద్యము చేయుటవంటిదే యగును. ఎరుక అపరోక్షమైనపుడుగాని, ఎరుక స్థాన స్వరూపములు తెలియబడవు.

కనుక పంచసాధనలచేత (అనగా 1. గురుమంత్రాను స్థానము, 2. గురూపాసన, 3) గురూపదిష్ట మార్గమున సత్కర్మాచరణము, 4) గురుస్వరూపధ్యానము, 5) గురుతత్వమును గూర్చి శ్రవణ మనన నిధి ధ్యాసలు) గురుకృపా సంసిద్ధి కలుగును. గురువు బోధించిన మాటలను చిలుక పలుకుల వలె తిరిగి పలుకగలుగుట మాత్రమే అయినచో అది వాచా వివేకత్వమే (లేక మెట్టవేదాంతమే) యగును.

సాధన సాధ్యమైనది (సాధనలచే సాధింపదగినది) యెరుక. సాధనాంతర నిరపేక్షకమైనది (సాధనలచే సాధింపరానిది) పరిపూర్ణము. "ఏ సాధన నీ కెందుకు" అని కృష్ణదాసుగారు అన్నారంటే, తన్నాశ్రయించుటకు వచ్చినవాడు "సాధన సంపత్తియు గల సాధకుడు" కనుకనున్ను "బోధచేయుము పుణ్యపురుషా, మాబోంట్లకు - సాధించదగు ముఖ్యసాధన " అని అడిగినాడు కనుకనున్న, వాని నుద్దేశించి "నీకే సాధనలు అవసరములేదు. సాధనలచే పొందదగు సిద్ధి యిది వరకే నీవు పొందియున్నావు. ఇక నీకిప్పుడు కావలసినది ఏ సాధనల నపేక్షించని పూర్ణ బోధ. యింకా నీకు సాధనల యందాశపోనిచో నీవు రావలసిన పనిలేదు" అని చెప్పినారు. అంతేగాని యే సాధనలూ చేయక ఆత్మవస్తు నిశ్చయము లేని వాడు వస్తే వానికి కూడ "మొదలచలము నెరిగించెద" నంటారా ? ఓ,న,మ, లు రానివానికి M.A పాఠం చెపుతారా? యోచించవలెను. పూర్ణాధికారి కాని శిష్యుడు వస్తే ముందుగా వానిని అధికారిని చేయు పూచీ గూడ సద్గురువు వహించును. ఆత్మసాక్షాత్కారము పొంది ఆ యానంద మనభవించినవాడు మరల మరల అట్టి ఆనందానుభవమునకై ప్రాకులాడుట సహజము. పూర్ణబోధలో ప్రవేశించిన తరువాత కూడ అట్టి ఆశకు లోనగునేమోనని యెంచి శ్రీ శివ రామదీక్షితుల వారు అదే (ఆ పరమాత్మ) నేను కావలెనని భ్రాంతి మోక్షభ్రాంతి, అనుభవభ్రాంతి వున్నవార్కి చెప్ప వద్దని హెచ్చరించినారు. అదేవిధముగా "రోసితి మోక్షాద్యపేక్ష రూఢిగ వినుమిా; నీవిట్టి ఆ రూఢత గనుమిా . . . . ." అంటూ కృష్ణదేశికేంద్రులున్ను పూర్ణాధికారి నిరూపణ చేసినారు. యీ మాటలన్నీ అనధికారికి అనగా మోక్ష

స్వరూపము (అఖండ యెరుక స్థానము) యెరుగనివానికి చెప్పిన మాటలుకావు. ఎరుక ఏదో తెలియనివారికి ఎరుక నిరసన గావించుట, పచ్చికాయను పండుగావించ యత్నించినట్లే. అది క్రుళ్ళికంపెత్తునుగాని యెన్నడును పండనేరదుగదా!

"నిన్ను (నీ నిజస్వరూపమైన ఎరుకను) విడచి చూస్తే, అంతా కుంఠితంగాని వైకుంఠమే కల్పనారహితమైన కైలాసమే (పరిపూర్ణ పరబ్రహ్మమే)"అను మాటలు యెరుక యొక్క అపరోక్షానుభూతి కలవానికే అని తెలియవలెను. ఎరుక యేదో తెలియకుంటే దేనిని విడచిచూచును? కనుక ఎరుకను వస్తునిశ్చయరూపంగా దెల్పి, శిష్యునిచే సాధనలచేయించి, ఆత్మనిశ్చయం గావించి తీరవలసినదే! అటుపిమ్మట యెరుక నిరసనగావించి, దానికతీతమైన పరిపూర్ణమునందు ఆస్తిక్యబుద్ధిని కలిగించవలసినదే!

అందుచేతనే యితర బోధల విషయ మెట్లున్నా పరిపూర్ణ బోధవిషయములో మాత్రం గురు వత్యంతావసరము. "గురువు లేని విద్య గ్రుడ్డి విద్య" అనుట పరిపూర్ణ బోధ విషయములో పరమ సత్యము.

శ్లో॥ శ్రీగురోః పరమం రూపం వివేకం చక్షు రగ్రతః ।
మందభాగ్యా నపశ్యంతి అంధః సూర్యోదయంయథా॥

అంటూంది గురుగీత. పరమాత్మ వస్తువును చూడలేనివాడు, మందభాగ్యుడు. ఇక వస్తునిశ్చయము తెలియని గురువు విషయంలో వేమ యోగీంద్రుడు "తన్ను తా నెరుగడు, తానెవ్వనికి జెప్పు, పాలుమాలినయట్టి పశువుకొడుకు" అని క్రూరముగా నిందించినాడు. వస్తు నిశ్చయము లేని గురు శిష్యులు, తాము చెడుటయే గాక, లోకమునుగూడ చెరపిన వారగుదురు.

గురువు యెరుకను వస్తు నిశ్చయముగా చూపగల్గు నేమోగాని, పరిపూర్ణమును ఎట్లు చూపును? శిష్యుడెట్లు చూచును ? చూపుట, చూచుట యెరుకేగదా! చూస్తూనే యెరుక పారిపోదా? ఆ పరిపూర్ణము దృశ్యమా ? యద్దృశ్యం తన్నశ్యం కాదా ? యిట్టి ప్రశ్నలు పరిపూర్ణ బోధ తెలుసుకున్న వారే వేయుదురా! వేస్తే వారి కేమి తెలిసినట్లు ? వారిగురువులు వారి కేమి తెలిపినట్లు ? గురువు తెలుపలేదా ? ఇవి గురువులవల్ల మాత్రమే తెలుసుకొనవలసిన విషయములు కావా? గురువులకే తెలియనిచో తెలిసిన గురువుల నాశ్రయించి తెలుసుకొనవద్దా? అట్లు గురువును విడచి మరొక గురువును ఆశ్రయించుట దోషమనుకొనుటయే దోషము.

మధులుబ్ధో యథాభృంగః పుష్పాత్పుష్పాంతరం వ్రజేత్ ॥
జ్ఞానలు బ్ధస్తథా శిష్యోగురోర్గుర్వంతరం వ్రజేత్ ॥

అను గురుగీతా శ్లోకమున్నూ, "పరిపూర్ణ బోధ నెరుగని గురుశిష్యులు బోధకొరకు కోర పనిబడున్, గురువర్యు నొకని మరలను ...... " అను కందార్థమున్నూ గమనించవలెను.

"యద్దృశ్యం తన్నశ్యం" కనుక గురువుచూపుట,. శిష్యుడు చూచుట అనేది శాశ్వతమైన పరిపూర్ణ విషయంలో చెప్పవచ్చునా? అని ప్రశ్నించుట తగదు. ఏలననగా చూచేవి కళ్ళు; కళ్ళద్వారా చూచేది మనస్సు. యీ రెంటిచే చూచుట లేదుగదా! "లేనెరుకతో దీని కనిపెట్టి పాదోట్టు మెరుక" అన్నారు కృష్ణదాసుగారు. యిట్టి వన్నియుగురు ముఖతః సందేహనివృత్తి చేసుకోదగినవి మాత్రమే కనుకనే "గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః" అని చెప్పబడినది. గ్రంథముచేత గాని, వూహపోహలచేగాని, యుక్తిగా తెలుసుకొన్న వారిదగ్గర నుంచి రాబట్టుటకు ప్రయత్నించుటగాని వృథా.

షోడశితో ద్వాదశిని గుర్తించి రెంటినీ పంచదశితుల్య మని భావించుమనే మాటలు, ద్వాదశి షోడశుల వస్తు నిర్ణయార్థ మెరుగనివారి మాటలు. వారికి బ్రహ్మాండైక్య విషయంగాని, తుదకు పిండబ్రహ్మాండములు వస్తు నిర్ణయముగాని తెలిసియుండదనుట నిస్సంశయము. షోడశి యనగా యెరుక యని, ద్వాదశి యనగా పరిపూర్ణమని వారి భావన. ఐతే షోడశితో ద్వాదశిని గుర్తించుటనగా యెరుకతో పరిపూర్ణమును గుర్తించి అని అర్థముకదా ! "ఎరుక యెరిగిన వస్తువు యెరుకాని తెలియుము" అనీ, "లేనెరుకతో దీన్ని కనిపెట్టు"మనీ "ఎరుకలేక సేవింపదగు" ననీ శ్రీకృష్ణ దేశికేంద్రులంటున్నారుగదా! ఎరుకతో వుండచూచుకొనుట మాత్రమే సాధ్యము. పరిపూర్ణము నెరుగుట యనగా యెరుక విడచి యెరుగటయేనని తెలియవలెను. గురుగోప్య విషయములు గురువుద్వారా శిష్యుడైనవాడే తెలుసుకొనగలడు. ప్రశ్నోత్తరములద్వారా, లేక వుత్తర ప్రత్యుత్తరముల ద్వారా లేక వ్యాస వుపన్యాసములద్వారా తెలియబడవు. తెలిసినా వస్తువనిశ్చయము లేనివారికి బధిర శంఖారావవత్ అని గ్రహించదగును.

జన్మకారణమగు వస్తువునందు సత్యత్వ భ్రాంతిరహితము కానిచో జనన మరణ భ్రాంతిరహితముకాదు. సృష్టికి పూర్వమున్న అఖండ యెరుక (లేక పరమాత్మ)కు పరిపూర్ణ బ్రహ్మమునందు మూలముగాని స్థానముగాని లేదని పరిపూర్ణ బోధ సిద్ధాంతము. ఈ సిద్ధాంతము దృఢమగుటకు ఆ అఖండ యెరుకయొక్కయు (పరిపూర్ణమందు అదిలేనిదగుటచే దానిని లేనెరుకన్నారు) పరిపూర్ణముయొక్కయు వస్తునిశ్చయము అవసరము, ఎందుకూ పనికిరానిదీ ఎట్టిదీ కానిదీయగు ఆ పరిపూర్ణము అంతటా నిండున్నదని గురువాక్యాం, నమ్మితే అది నీకు జన్మలేకుండా చేసునా? అంటారు. నిజమే, చేయదు. కాని అది వున్నదనీ దానియందు నీవు లేవనీ, ఆరూఢమైతే నీకు జననమరణభ్రాంతి రహితమై తీరును. కనుక పరిపూర్ణము యొక్కయు నీయొక్కయు వస్తునిశ్చయము ముందుగా కావలసివచ్చుటలేదా ? పరిపూర్ణ మొకటి లేనెరుక కనే దొకటి అని అన్నారు కదా ! లేని ఎరుక ఏదో తెలుసుకొంటే, అది కాని దేదో అది పరిపూర్ణమని తేలుతోంది. కాని యిట్లు చెప్పుట అనుమాన ప్రమాణముచే వాచా చెప్పుటయేయగును. రెండింటినీ వస్తునిర్ణయముగా తెలియవలెను. లేనెరుకను విడచినపుడే పరిపూర్ణ మపరోక్షము.

"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞానం భవతీతి" (అనగా ఓ ఒక్కటి తెలుసుకొంటే సర్వం తెలియబడుతుంది. "యజ్ఞాత్వానేహభూయోన్యత్ ! జ్ఞాతవ్య మవ శిష్యతే" అనగా దేనిని

తెలుసుకొంటే యిక తెలివిచే తెలియదగినదియుండదో అట్టి సర్వస్వరూపమైన ఎరుక తెలియ బడకపోతే వాని జ్ఞానమంతయు వ్యర్థమే. ఆ వస్తువును (ఆత్మ స్వరూపమును తెలియకుంటే ఏమియు తెలియనట్లే! అట్టి యెరుకను తెలియకనే దానికతీతమగు కేవలాత్మను (పరిపూర్ణ పరబ్రహ్మమును) తెలియగోరుట పుట్టి కెగురలేని పూరకుక్క స్వర్గమునక కెగురుటకై పురకలు వేసినట్లే యని యెంచ దగును.

"అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా" పరతత్వము తెలియబడకపోతే వాని శాస్త్రజ్ఞానమంతయు నిష్ఫలమే; బూడిదలోపోసిన పన్నీరే.

"నేనెంత లెస్స చదివిన దీనిని తెలియంగగలరె దేశిక వర్యున్ పూని సేవించకుండిన" అనిన్నీ "నాలుగు శుశ్రూషణములు లోలత గావించుకొనుచు, లోకాతీతం బాలోకించీ గురునిచే యీలోకముజోలి విడువుమింతే, చాలన్నా నీతో గూడ; యిది మరువకన్నా ..." అనిన్నీ "ప్రవిమల చిత్తుడు శిష్యుడు సవినయమున దేశికునకు శరణాగతుడై బోధవిను" మనిన్నీ "సిగ్గువిడచి కొలవుమా నీతివంతా అభిమానం పోనీ నీదంతా" అనిన్నీ కృష్ణదేశికేంద్రు లంటున్నారు. "శిష్య స్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అన్న తర్వాత గాని కృష్ణభగవాన్ గీతోపదేశము చేయలేదు. మరిన్ని "తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అని గీతాశాస్త్రము శాసించుచున్నది. మేమెప్పుడో ఏగురువులనో ఆశ్రయించి పరిపూర్ణ బోధవాక్యములు రెండు విన్నాంకదా, అని అను కొని పూరుకోక "మేమేమి వింటిమి ? ఏమి తెలిసితిమి ? మేము బోధ సమగ్రంగావింటే మాకిన్ని సంశయములు ఏల వస్తున్నవి ?"

"గురు గురుబోధలచేతను పరిపూర్ణము నెరిగి
యెరుక బాసిన యతనిని గురుతింప నొరుల శక్యమె ?
యెరిగిన నరులిట్టి బోధ నెరిగేరోయన్నా;
వారెరుగని మరుగుండదన్నా"

అంటున్నారే కృష్ణ దేశికేంద్రులు!! "నా కిన్ని సంశయములు వస్తుంటే నాకు సమగ్రంగా బోధ తెలియలేదేమో ? మానవ జన్మయెత్తినందుకు యీ జన్మ వృధాకాక పూర్వమే సర్వ సంశయరహితము గావించుకొనవలదా ! అని అంతరంగ పరీక్ష చేసుకొని నిరభిమానులై, తమ సంశయరాహిత్యము కావించుకొనుట ముముక్షువుల ధర్మమైయున్నది. "సంశయాత్మా వినశ్యతి" "న సుఖం సంశయాత్మనః" అనిన్నీ భగవద్గీత యుద్ఘాటించుచున్నది. "చిదిమిన కొద్దీ చిగుర్చు" "యెరుక కూకుడువేరు నెరిగి త్రవ్వు" మంటున్నారు కృష్ణ దేశికేంద్రులు.

కనుక వస్తునిర్ణయ మెరిగిన గురువుల నెన్నుకొని, గురు భక్తి, గురుసేవ గురునిష్ఠ కలిగి, సేవించి గురుకృపకు పాత్రులై జననమరణభ్రాంతి రహితము చేసుకొందురుగాక !



# 18. పరిపూర్ణ బోధ మార్గంలో సాధన లేదా ?

శిష్యుడు :- సర్వమునకు ఆధారమైనది ఏది ?

గురువు:- జ్ఞానము, తెలివి,యెరుక, ద్రష్ట, సాక్షి, సచ్చిదా నందము మొదలగు పేర్లన్నియు దానికే. సాలెపురుగు వలె సృష్టి స్థితి లయములు చేయునది అదే. పట్టుపురుగు వలె తనగూడులో తానే చిక్కుకొని జనన మరణముల చెందుచూ కర్మబంధమున చిక్కుకున్నదీ యదే. జగ ద్వ్యాపకమై యున్న దదే. చిదాకాశమన్నా అదే; కూటస్థచైతన్యము, అధిష్ఠానము అదే. తాను ప్రకాశిం చుచూ సర్వమును ప్రకాశింపచేయునది అదే ఎరుగు చున్నపుడు ఎరుకనీ, మరచినపుడు మరుపనీ దానికిపేర్లు.

శిష్యుడు :- అది యెందుండి యే విధముగా వచ్చినది ?

గురువు :- దానికి మూలము లేదు; తనకుతానే వచ్చినది. అది గొడ్రాలుబిడ్డ వంటిది.

శిష్యుడు :- మూలములేని వస్తువుగాని, గొడ్రాలుకు బిడ్డగాని యెట్లుండును ? కనుక ఎరుక ఏమీ లేనిదేనా ?

గురువు :- పరిపూర్ణ పరబ్రహ్మమందు దానికి మూలములేదు. అనగా పరిపూర్ణమం దది పుట్టలేదు. ఎరుకయందే ఎరుక పుట్టినది. ఎరుకయం దెరుక సత్యమే.

శిష్యుడు :- పట్టుగాఉన్నది అర్థమయ్యేలా శెలవీయండి స్వామీ !

గురువు :- జాగ్రతయందు కల లేకపోయినా, కల కాలమందు కల దృశ్యములన్నియు సత్యములై సుఖ దుఃఖాను భవము కల్గించునట్లే నని తెలియవలెను.

శిష్యుడు :- లేని కల లేకపోతే గాఢనిద్రయో, లేక మెళుకువయో వుండును. అట్లే లేనెరుక లేకపోతే మిగిలి వుండునది శూన్యమా ? లేక పూర్ణమా ? ఆ శేషించిన వస్తువేది ?

గురువు :- శూన్యమనిగాని, పూర్ణమనిగాని, నిర్ణయింపరాని దేదో అది ఉండును. దానికే అచలమని, బయలని, పరిపూర్ణమని పేర్లు పెట్టినారు. అది అవాఙ్మానస గోచరము.

శిష్యుడు :- అది తెలియరానిది కాదు ! అది పరమ సత్యమని తెలిసినా తెలియకున్నా అది వున్నదే గదా ! ఇక మీ బోధవల్ల ఏమి సాధించినట్లు ?

గురువు :- సకల భ్రాంతులకు మూలమైన ఎరుక ఏమీ లేదని దృఢమగుటవల్ల సర్వభ్రాంతి రహితము సిద్ధించును గదా! "భ్రాంతి రహిత మిదం మోక్షం" అన్నారు. యిక కావలసిన దేమి ?

శిష్యుడు :- మరి, యీ యెరుక రహితమున కే సాధన చేయవలెనో సెలవీయండి స్వామీ !

గురువు :- కలకంటూ కలవరించేవాడు కలలోని భయభ్రాంతులు రహితమగుటకు ఏమి సాధన చేయవలెను ?

శిష్యుడు :- మెలకువలోనున్నవాడు జాలిచెంది, ఆ కలలో కలవ రించేవానిని మేల్కొలుపవలె.

గురువు :- శెహభాష్ ! అట్లే భ్రాంతి రహిత స్థితిలో (మెలకువలో) వుండే గురుమూర్తి ఎరుక భయభ్రాంతులలో చిక్కి అలమటించేవానిని చూచి జాలిపడి, భ్రాంతి రహితస్థితి (మెలకువ) అతనికి కల్గించవలె.

శిష్యుడు :- అట్టి గురుకృపా సంసిద్ధికొరకైనా శిష్యుడు సాధన చేయవలెనా ? వద్దా ?

గురువు :- అవశ్యము చేసి తీరవలెను.

శిష్యుడు :- ఆ సాధన యెట్టిది ?

గురువు :- గురుసేవ గురునిష్ఠ, గురూపాసన, గురుమంత్రజపము, గుర్వాజ్ఞాపరిపాలనము. "అన్యథా శరణం నాస్తి" -- "మామేకం శరణం వ్రజ" అన్నాడు భగవాన్.

శిష్యుడు :- ధన్యోస్మి



## 19. సంసారము

భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు మొదలగు వానితో గూడిన ఒక గృహస్థుయొక్క కుటుంబనిర్వహణ రూపమగునదే సంసారమని సామాన్యార్థము. ఈ అర్థములో తన యొక్కయు, తన కుటుంబ సభ్యులయొక్కయు సుఖ సంతోషములకై మానవుడు నిరంతర ప్రయత్నముచేయుచు జయాపజయములు, లాభనష్టములు తత్ఫలితముగా సుఖదుఃఖములు పొందుచూ నానాయాతనలు పడుచున్నాడు. ప్రపంచములో దుఃఖము 90 పాళ్ళు, సుఖము పదిపాళ్ళు మాత్రమేనని చెప్ప బడుచున్నది. ఆ సుఖ లేశము కొరకే మానవు డాసపడి చేయరాని దుష్కృత్యము లెన్నో చేయుచున్నాడు.

అనేక పూర్వజన్మ సుకృత విశేషములచే ఒకానొక మానవుడు యీ సంసారమునందు నిజముగా దుఃఖమేగాని సుఖము శూన్యమని గుర్తించి ఆనందావ్యాప్తి యెట్లుకలుగును ? అత్యంత దుఃఖనివృత్తి యెట్లు కాగలదు ? అని జిజ్ఞాస గావించుచున్నాడు.

"జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః !
సంసారసాగరం దుఃఖం తస్మాత్ జాగ్రతజాగ్రత !"

అని వివేకము తెచ్చుకొనచున్నాడు. పిరికివాడగుచో, సంసారమును త్యజించి బిచ్చ మెత్తుకొనియో ఏ ఆకు అలములు తినియో జీవిత శేషమును పూర్తి చేసుకొన నెంచుచున్నాడు. లేక ఆత్మహత్యయే గావించుకొనుచున్నాడు. మరికొందరు సన్యాసాశ్రమ స్వీకారము గావించు చున్నారు.

ఉత్తముడగు జిజ్ఞాసి "సంసారమెట్లు కలిగినది ? పుట్టి వుండబట్టి కదా యీసంసారము ! పుట్టుకేలేనిచో సంసారము కలుగదుకదా కనుక జన్మరాహిత్య రూపమగు మోక్షము నొందవలె. మోక్షస్థానమగు ఆత్మైక్యము నొందవలెనని, నిశ్చయించుకొని కర్మ భక్తి యోగ జ్ఞాన మార్గములయందు సాధన చేయుచున్నాడు. ఆత్మయొక్క పరిణామ రూపమగు యీ విశ్వము ఆత్మనుంచే వచ్చినపుడు ఆత్మయం దైక్యము సాధించినా, అట్టి ఆత్మతోపాటు మరల సృష్టిలోనికి రావలసి నదేగదా ! తనకు యీ సమస్త విశ్వమునకు బీజరూపమగు ఆత్మయొక్క రహితస్థితి యందుగాక తనకు శాశ్వతజన్మ రాహిత్య రూపమగు మోక్ష మెట్లు సిద్ధించును ? అని వితర్కించి అట్టిస్థితి పరిపూర్ణబోధవలన గాక మరెట్లు సిద్ధించును ? అని పరిపూర్ణ గురువుల నాశ్రయించి గురూపదిష్ట మార్గము నందు మరి కొందరు కృషిచేయుచున్నారు.

సంసార దుఃఖమును భరించలేక సంసారమునుండి తప్పించుకొనుటకు అనేకులు, వివిధములగు సాధనా మార్గములను చేపట్టుటకు కారణమేమి ? వారెన్నుకొన్న మార్గములు సంసార శబ్దమునకు వారిచ్చు నిర్వచనము పైననే ఆధారపడియున్నది. ఎట్లనగా :-

1) "సంసారమనగా భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులతో కూడి వున్నదే సంసారము" అను నర్థమును గ్రహించిన కొందరు వివాహము మాని యితర మార్గములలో ఆ వైవాహిక సుఖ మనుభవించుచున్నారు. ఉత్తములైతే ఘోటక బ్రహ్మచర్యక్తమునే అవలంబించి మాకు సంసార దుఃఖము లేదని భ్రమించుదురు. లేక వివాహమైతే ఆ భార్యాబిడ్డలను, ఆస్తి పాస్తులను సన్యసించి సంసారీ దుఃఖీ - సన్యాసీసుఖీ అని ప్రగల్భాలు పలుకుదురు.

2) శరీరధారణమే సంసారము అని అర్థమును నిర్ణయించుకొన్నవారు శరీరంలేకుంటే సంసారం లేదనుకొని మూర్ఖులై కొందరు ఆత్మహత్యలకు పాల్పడుదురు. అదృష్ట వశాత్తు యిట్టి మూఢులు

బహు తక్కువే. కొంతమంది వీరిలో బుద్ధిమంతులు పుట్టుక యెందుకు కలిగినది ? కర్మ ననుభవించుటకే గదా ! కనుక కర్మవలన జన్మ కనుక దేహోత్పత్తి కారణమగు అదృష్టమే సంసారము అని అర్థము చెప్పుకొని మంచికర్మవలన మంచిజన్మ; చెడుకర్మవలన చెడ్డజన్మ కనుక ప్రారబ్ధరూపముగా వచ్చిన సుకృత దుష్కృత ఫలితములగు సుఖదుఃఖము లనుభవించుచు, రాబోవు జన్మ యందు సుఖముగలుగుటకు యీ జన్మలో సుకృతకర్మల నొనర్చవలెను అని యజ్ఞ యాగాది క్రతువులు, దానధర్మములు విరివిగా చేసి స్వర్గసుఖము లనుభవించవలెననే కోరికతో కొందరట్లు గావింతురు. కాని స్వర్గములో పుణ్య ఫలము ఖర్చుకాగా 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' అనే గీతాసూక్తి ప్రకారం భూలోకమున జన్మించి మరల సంసార దుఃఖ భాజనులగుచున్నారు. ఏకర్మ చేసినా యేదో జన్మ వస్తూ వున్నదే ! కర్మయే చేయకుండా ఊరుకొనుట సాధ్యము కాదే ! మరి యెట్లు ? కర్మజఫల మాశించక నిష్కామకర్మ చేసినచో ఆ కర్మఫలానుభవమే వుండదు కనుక మరల జన్మింప నవసరముండదు. కనుక కర్మఫలత్యాగ మొనర్చి కర్మలు చేయవలెనని కొందరందురు.

3) కాని ఏఫలమున్నూ ఆశించక ఏకర్మనైనా ఎవరైనా చేయుదురా ? కనుక నిష్కామకర్మాచరణ సాధ్యముకాదు. కర్తృత్వాభిమానము లేకపోతే కర్మఫల భోక్తృత్వ ముండజాలదని మహనీయులు కొందరు సిద్ధాంతముచేయుచున్నారు. ఎట్లనగా -- యజమాని చెప్పినట్లు సమస్త వ్యవహారములు చేయు గుమాస్తాకు ఆ వ్యవహారములో చివరకు కలుగు లాభ నష్టములతో యెట్టి సంబంధము నుండజాలదుగదా ! అట్లే నా సమస్తము గురునికే యర్పించి ఆత్మ నివేదన గావించి యున్నాను. నేను నిమిత్తమాత్రుడనైనా విధ్యుక్త ధర్మముల నాచరించుచున్నాను. అందలి జయాపజయములు లాభనష్టములతో నాకు నిమిత్తము లేదు. అట్లే ఆ పాపపుణ్యములతోనూ నాకు నిమిత్తము లేదు అనే దృఢముతో అహంకార మమకారములు లేకుండా భక్తుడు సకలకర్మలు నాచరించియు ఆ కర్మఫలములచే బద్ధుడగుట లేదు. కాని భ్రాంతికారణమైన తెలివి వున్నంతవరకు శాశ్వతముగా జన్మ రహితముగాదు.

ఇక జ్ఞానమే జన్మ కారణము. స్వస్వరూప విస్మృతియే సంసారముఅనే జ్ఞాని "అహం బ్రహ్మాస్మి" అని దృఢనిశ్చయము గలవాడై, "నాహం కర్తాన భోక్తా" నేను ఆత్మ స్వరూపుడను; ఈ దేహేంద్రియ మనోబుద్ధులుగాను. "ప్రత్యగాత్మా శివోహం" మరియు ఆత్మ అగ్నిహోత్రమువలె మహా పరిశుద్ధిమైనది. దాని నేమియు మలినపర్చజాలవు. వ్యవహార మంతయు మిథ్య. మాయాకార్యము. పాపపుణ్యములు, జనన మరణములు, బంధమోక్షములు అన్నియు భ్రాంతియే అని ఆత్మనిశ్చయమందే యుండును కనుక నన్ను సంసారము గాని అందలి సుఖదుఃఖములుగాని బాధించవుఅని భావించు వారు ఆత్మస్థానరూపమగు మోక్షము చెంది ఆత్మతోపాటు మరల సృష్టిలో ప్రవేశించుచున్నారు.

ఇక పరిపూర్ణ భావజ్ఞులు - జ్ఞాతృత్వ ప్రమాతృత్వములే సంసారకారణము అంటారు. అనగా గుర్తెరిగితేనే ఇది సుఖ కారణము, ఇది దుఃఖ కారణము, ఇది సుఖము, ఇది దుఃఖము అని గుర్తెరిగి దుఃఖనివృత్తికి, ఆనందావ్యాప్తికి మానవులు ప్రాకులాడుచున్నారు. కనుక గుర్తెరిగితేనే ఆశ. గుర్తెరుగకపోతే యే ఆశా లేదు. నిస్పృహలేదు. కనుక జ్ఞానమే సంసారము. శ్రీ శివరామదీక్షితులవా రందుకనే మూలం లేని యీ గుర్తెరిగే శరీరం తోచడమే సంసారమన్నారు. కనుక సృష్టికారణమై జ్ఞానస్వరూపమైవున్న ఆత్మయే సంసారము. వ్యుత్పత్త్యర్థముచేగూడ యీ నిర్వచనము సమంజసమై యున్నది. ఎట్లనగా సం+సారము = సంసారము సారా సారవిచారము గావించినచో ఈ ప్రపంచములో అత్యంత సారభూతమగు వస్తువు ఏది ? సృష్టి కత్యంత మూలకారణము జ్ఞానఘనమైన ఆత్మయే అని తెలియబడుచున్నది. యిదియే సం+సారము-అత్యంత సారభూత వస్తువు. యిదియే యెరుక కూకుడువేరు. ఇది పోయినచో సృష్టికారణమే వుండదు. కనుక సృష్టి, ఆ సృష్టియందు వచ్చిన నేనూ వుండదు కనుక పూర్ణగురువు నాశ్రయించి పూర్ణబోధ గ్రహించి యీ సంసారమూలమును ఛేధించవలసియున్నది.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" బంధకారణము మనస్సని చెప్పేరన్నమాట. ఐతే మనోరూపము వహించేదీ, మనస్సును ప్రవర్తింపచేసేదీ. మనస్సుకు కారణమైనదీ యీ జ్ఞానమే అయియున్నది. కనుక మనస్సు లేక గుర్తించే జ్ఞానమే సంసారకారణము.

శరీర మున్నంతవరకు మనస్సుండక తప్పదు. ఏ ఆశ్రయమందున్నా అనగా బ్రహ్మచర్యాది చతురాశ్రమములలో ఏ ఆశ్రమమందున్నా, మనస్సు లేకుండాపోదు. అడవులకేగినా, కొండలకేగినా మనస్సు వదిలిపెట్టదు. ఏకాంతముగావుండి ధ్యానాదులచే మనస్సు నిర్మలము గావించు కొందామంటే మనస్సు ఏకాగ్రత చెందినపుడుతప్ప దాని విక్షేపమణగిపోదు. ఏకాగ్రత వదలిన మరుక్షణముననే మనో వికారములు తిరిగి ప్రారంభమగును. యోగసాధనలు చేసినా అంతే. సర్వసంగపరిత్యాగము చేసిన సన్యాసినైనా యీ మనోసంసారము వదలదు. అతని దండకమండలాదులే అతని కొక సంసారము. కనుక మనస్సును వదలకున్నంతవరకు సంసారమున్నట్లే, మనస్సును అణచి బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్యాసములలో ఏ ఆశ్రమమందున్నా పరవాలేదు, కర్మసన్యాసము చేయనక్కరలేదు. పరిపూర్ణబోధచే మనస్సుమాత్రమేగాక సర్వసృష్టికి అత్యంత మూలకారణమైన మూలంలేని గుర్తెరిగే శరీరము పరిపూర్ణమునందు లేనే లేదని దృఢనిశ్చయముపొంది ఆ నిశ్చయముతో సకలకర్మలు చేసినా చేయనివాడగుచున్నాడు. ఇదొక్కటే సంసారతరణోపాయము.



# 20. ఆశ

ఆశ యనగానేమి ? తనకప్పట్లో స్వాధీనానుభవములో లేనిదానిని కోరుటయే ఆశ. "కోరుట కామంబు" అంటున్నారు. అన్నివిధములగు కోరికలు కామ్యములే, ఆశలే అందరానిదాన్ని కోరుటయే ఆశ అని కొందరంటారుగాని అట్టి ఆశను పేరాశ దురాశ, అత్యాశలని వేరే పేరులతో మాత్రమే వ్యవహరించాలి.

ఆశ అనేది మానవులకు మాత్రం ప్రకృతి సిద్ధంగా సంక్రమించిన ప్రధానగుణం. ఏడాదిలోపు పసిబిడ్డకూడా, ఫలానా అనిచెప్పలేకపోయినా, ఆశకులోనవుచూ వుండడం మనం చూస్తాం. మిగతా సృష్టిలోగల పశుపక్ష్యాదుల కీయాశ అంతగా గన్పట్టదు. ఆహారాదుల విషయంలో మాత్రం తాత్కాలికంగా వానికి కూడా కొంత ఆశ లేకపోలేదుగాని, "పశువుకు తిన్నది పుష్టి, మనిషికి వున్నది పుష్టి" అనే లోకోక్తి ప్రకారం, అవసరమయ్యేదానికంటే అధికం కోరటం మానవ ప్రత్యేక లక్షణం అనియే అనవచ్చు, పశుపక్ష్యాదుల ఆశలకు మితమూ వుంది, తృప్తీ వుంది. మానవునికి మాత్రం ఆశకు అంతులేదు. చీమ తేనెటీగ మున్నగు వానికీమాత్రం మానవునికివలెనే కూడపెట్టే, లేక ప్రోగుచేసే స్వభావం వుంది కాని, అందులోకూడ ఒక మితముంది. ఐతే, సృష్టిలోకెల్ల గొప్పవాడని చెప్పబడే మానవునికి మాత్రం, ఈ అమితాశ, అసంతృప్తి కల్గించుటలో సృష్టికర్త యుద్దేశమేమి ? అణువు మొదలు బ్రహ్మపర్యంతం అఖండంగా వ్యాపించియున్న బ్రహ్మతత్వమే, తన నిజరూపమని మానవుడు తెలిసికొని తత్స్వరూపమును నిజరూపముగా చేసుకొని ప్రవర్తించాలని ఆశించి, మానవుని ఆశ అపరిమితం చేసేడేమో ననుకోవాలి. మానవుని గొప్ప కోరికలు లేక ఆశలు ఏవో మనం గమనిస్తే, యీ విషయం స్పష్టమౌతుంది. తానెప్పుడూ శాశ్వతంగా వుండాలని తనకు తెలియనిదంటూ లేకుండా సర్వజ్ఞుడు కావలని, దుఃఖమనేదేమీ లేకుండా ఎల్లప్పుడూ ఆనందంగా వుండాలనీ, దేవతలకుండే సర్వ శక్తులూ తనకు కలగాలనీ, తన కెట్టి అరిష్టములు ఎన్నడూ కలగరాదనీ, మణి, మంత్ర, ఔషధ ప్రయోగములన్నీ తనయెడల నిర్వీర్యములు కావాలనీ తనకే అందరూ సర్వవిధములా విధేయులై, సర్వనియంతృత్వ లక్షణములన్నీ తనకు సంక్రమించాలనీ మానవుడు కోరుకునే పెద్దకోరికలు, ఇట్టి కోరికలు తీరుట అసంభవములనీ, యివన్నీ కేవలం దురాశాజనకములనీ, స్థూలదృష్టికి తోచవచ్చును. ఇవి అడియాశలుగాని, పేరాశలుగాని కావు. వీనినన్నిటినీ సాధించిన మహాత్ములు నాటికీ, నేటికీ గూడ నున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆప్తకాముడైన పరమాత్మకు మాత్రమే యిట్టి సర్వశక్తులూ సహజములై యున్నాయి. గనుక, అట్టి పరమాత్మస్వరూపుడే తానైతే యీ సర్వకామ్యములూ ఒక్కసారిగా చేకూరగలవు. ఆశలన్నింటిలోనూ

గొప్ప ఆశ ఏదంటే తానే బ్రహ్మస్వరూపుడగుట. క్రొత్తగా తాను ఆ పరబ్రహ్మస్వరూపుడు కావాలో ? అవసరం లేదు. ఏలననగా తనకు తెలిసినా తెలియకున్నా తానూ, తనతోపాటు, సమస్త విశ్వమూ బ్రహ్మయే అయివున్నది. ఈవిషయం ఆరూఢ మగుటే బ్రహ్మమగుట. యిట్టి ఆరూఢ జ్ఞానికి సర్వమూ బ్రహ్మమయమే. ఆ యారూఢత సిద్ధిస్తే యిక అప్పుడాతనికింక ఏమైన యాశలుండునా ? "కిమిచ్ఛన్, కస్యకామాయ" అనురీతిగా అపుడాతడు దేని నాశించి ఏ కోరిక తీర్చుకొనుటకై ఏపని చేయును ? ఇట్టి ఆరూఢజ్ఞానులే ఆశలుడిగిన అయ్యలు. యిట్టివారి కేయాసలూ వుండనే వుండవు; కలుగనే కలుగవు.

పారమార్థికదృష్టిలేని ప్రాపంచికులకు, అన్నియాశలూ నుండును. వీరి యాశలకు సర్వతోముఖముగా సమ్రముగా చర్చించాలంటే కష్టమేఐనా, పెద్ద లిదివరకే వీనిని మూడు ముఖ్యమైన తరగతులక్రింద విభజించి యున్నారు. ఏ ఆశ అయినా యీ మూడింటిలో ఏదో ఒక తరగతిలోనికి వచ్చి తీరుతుంది. (1) స్త్రీ సంబంధమైన ఆశ (2) ధన (లేకవస్తు వాహనాది సంపద) సంబంధమైన ఆశ, (3) సంతానసంబంధమైన ఆశ. వేదాంత పరిభాషలో వీనిని 'ఈషణ త్రయము' అనగా 'దారేషణ, ధనేషణ, పుత్రేషణ' అంటారు. మొదటి రెండు ఆశలూ కామినీ కాంచనములు లేక కాంతా కనక ములకు సంబంధించినవి.

**1) దారేషణ** :- కాంతాకనకముల రెంటిలో యేది బలవత్తరమైన బంధకారణమగునంటే చెప్పుట కష్టమేయైనా దారేషణయే బలవత్తరమై ప్రథమస్థాన మాక్రమిస్తుందేమో ననిపిస్తుంది. దారేషణ అనుట పురుషుని వుద్దేశించి ప్రధానముగా చెప్పబడినా, స్త్రీలకు పురుషులయెడ గల భ్రాంతి లక్షణముకూడా గ్రాహ్యమే. కనుక స్త్రీ పురుషు లిర్వురిలో ఒండొకరులయెడగల కోరికలన్నీ దారేషణలోనికి చేరుతాయి. ఒండొరులయెడల స్త్రీ పురుషులకు కొంచ మించుమించు 16 సంవత్సరాల ప్రాయమునాటికి కామప్రవృత్తి బలీయమగుట ప్రారంభించును. అది యౌవ్వనారంభవేళ! తదాది కామినీ కాంచనముల యాసకులోనై మానవుడు అకార్యకరణములు (చేయరానిపనులు) యెన్నో చేయుచుండును. వలచిన స్త్రీని వశీకరణము గావించుకొనుటకు ప్రాణములనుగూడ గోల్పోయిన పురాణ దృష్టాంతములు కోకొల్లలు. దశకంఠుడగు రావణబ్రహ్మవంటి మహా దురంధరుడు స్త్రీ సాంగత్యముకోరి ప్రాణములను గోల్పోయెను. కైక మోహవాగురులలో జిక్కి దశరథుడు ఆమె మాట కెదురాడలేక ప్రియ నందనుడైన రాముని అరణ్యములకు బంపి దుఃఖవశుడై ప్రాణములుగూడ గోల్పోయెను. మోహినీ మోహావేశుడై రుక్మాంగదుడు, కుమారుని కుత్తుక నరకుటకు ప్రయత్నించెను. చిత్రాంగి యందలి ప్రేమపాశ వశుడై రాజరాజనరేంద్రుడు, కుమారుని కాలుసేతులు నరికించెను. యెనిమిదవ ఎడ్వర్డు చక్రవర్తి యొక సామాన్యస్త్రీని పెండ్లాడుటకై సూర్యుడస్తమించని బ్రిటీషు సామ్రాజ్యమునే పరిత్యజించెను. కనుక ధనేషణ కన్నా, పుత్రేషణకన్నా దారేషణ బలీయమని ప్రథమమున చెప్పదగునని తోస్తుంది.

కాని కొన్నియెడల ధనాశావేశముచే భార్యలను భర్తలు, భర్తలను భార్యలు, చంపుచుండుట కూడ కానవస్తుంది. అట్టియెడ వారికి భార్యలయెడ లేక భర్తలయెడ ప్రేమానురాగములు లేవనియే చెప్పనగును. కొన్ని యెడల ప్రేమ యున్నను ధర్మముకొరకై భార్యా పరిత్యాగం చేసినవారు సహితం లేకపోలేదు. సత్యవాక్పరిపాలనకై చంద్రమతిని హరిశ్చంద్రుడు బజారులో అమ్మివేయుటయే యిందుకు దృష్టాంతము.

**2) ధనేషణ:-** కాని నేడు అన్నిటికన్న ధనమే ప్రధానస్థాన మాక్రమించుచున్నదని చెప్పవలసివస్తోంది. ధనం పేరు చేపితే నేడు కడుపులోపిండం, కాటిలోని శవంకూడా ఆశతో యెగిరెగిరి పడుచున్నవి. "ధనమూల మిదం జగత్", "మాతా పుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః" ఏ విధంగానయినా ధన మార్జించుటే పరమ పురుషార్థముగా భావింపబడుతూంది. అన్నవిక్రయ, కన్యావిక్రయ, విద్యావిక్రయాదులు నిరాక్షేపణీయంగా జరిగిపోతున్నాయి. కులవృత్తులచే, ధర్మయుతంగా ధనార్జనచేయుట పోయినది.

వ్యక్తులలోవలెనే ప్రభుత్వాలలో కూడా యీ ధనేషణే రాజ్యమేలుతోంది. పూర్వము రాజులసొమ్ము రాళ్ళ పాలనేవారు. యివ్వ డేమనాలి ? మట్టిపాలు, మంటపాలు, మహాసముద్రాలపాలు అనవలసినదే !

కీర్తికూడా యొకవిధమగు ధనమే. ధనములలో కీర్తి ధనమే అత్యుత్తమం "శిబి ప్రముఖులున్ ప్రీతిన్ యశః కాములై యీరే కోర్కెలు?" అని పోతనగారన్నారు. అట్టి కీర్తి ధనమాశించి ప్రాణములైన యర్పించెడివారు. ధనమొక లెఖ్ఖా ? "పాకీది గడింపదే ధనము, కీర్తికిరాని ధనంబు కాల్పనే" అన్నారు మహాకవులు. ఆశలలోకెల్లా సత్కీర్తి గడించాలనే ఆశ మెచ్చదగినదే కాని నెరమెచ్చుల దాతృత్వమువల్ల సత్కీర్తి రానేరదు.

**3) పుత్రేషణ :-** సంతాన సంబంధమగు కోరికలన్నీ పుత్రేషణ క్రిందికే వస్తాయి. సంతానాపేక్ష, పురుషుల యందుకంటే స్త్రీలయందే మెండు. మాతృత్వసిద్ధిలేని స్త్రీ జీవితం వ్యర్థంగా భావిస్తుంది. పురుషుడు ఆముష్మికసుఖం కోరి, పూర్వం, పుత్ర సంతానాన్ని ఆశించేవాడు. "అపుత్రస్య గతిర్నాస్తి' ' అనే కారిక కూడా పుట్టింది. కన్న సంతానం లేకుంటే, మరొక పురుషుని వలన స్వస్త్రీయందు సంతానం పొందేవాడు. పుత్రులు లేనివారు దత్తత చేసుకోడం యిప్పటికీ కలదు. అంతకంతకు పుత్రులే కావలెనని ఆశ అడుగంటుచున్నది. సత్సంతాన ప్రాప్తికే వుద్దేశింపబడిన వైవాహిక సంస్కారము నేడు కామసంతృప్తి కొరకే వినియోగింపబడుతోంది. స్త్రీ తన యౌవన సౌభాగ్యము నశించు నేమో అను భయముచేతను తన బిడ్డలను పోషించ నశక్తుడనగుదునేమో అను భయముచే పురుషులును సంతాన నిరోధ ప్రయత్నములు చేస్తున్నారు. సంతాన ప్రాప్తికై స్త్రీలు వ్రతములు, పురుషులు యజ్ఞయాగాదులు చేయుకాలము వెనుకబడుచున్నది. పూర్వము పెద్దలు పశువులు (గోవులు)

శిశువులులేనియింట విస్తరేసేవారుకాదు. నేడు పాశ్చాత్య విజ్ఞాన ప్రభావమున సులువుగా పుత్రేషణను మాత్రం కొందరు జయింప గల్గుచున్నారు.

కామినీకాంచనములు, సంతానములు ఆది మాధ్యాంతములయందు దుఃఖమునే కల్గించునవి కనుక యీ యీషణ త్రయమును జయింపవలెనని వేదాంతులు చెప్పుచున్నారు. వైరాగ్యమువల్ల బంధరాహిత్యమయి మోక్షము గలుగునని వారి ఆశ. మోక్షమనగా బ్రహ్మైక్యము అని వారి తాత్పర్యము. కారణరూప బ్రహ్మముతో తనకు తెలిసినా తెలియకున్నా తాను ఏకమయ్యేవున్నాడు. అది ప్రాప్య ప్రాప్తవ్యము. కేవల పరిపూర్ణ బ్రహ్మముతో యెవరికీ యెన్నడూ ఐక్యత అనేది లేనేలేదు. కనుక వేదాంతులు చెప్పే మోక్షాపేక్ష కూడా "కేవల మోక్షాపేక్ష సంకల్పో బంధః" అనీ నిరాలంబోపనిషత్. మోక్షాపేక్షకూడా బంధమే అంటూంది. పరిపూర్ణ బ్రహ్మమం దైక్యము అసంభవము. కనుక వట్టి యాశలచేత పట్టుపడకను యీ గుట్టు దేశికునోట గట్టిగా తెలుసుకు భావించపదగునూ ...." అంటున్నారు శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు.

యీషణ త్రయమును జయించుటకు వేదాంతులు చెప్పిన మార్గమేమి ? మరి పరిపూర్ణ భావజ్ఞుల పరిష్కారమేమి ?

"ఆశా పరమం దుఃఖం నిరాశా పరమం సుఖం" అంటారు, వేదాంతులు. నిరాశ అనగా పిరికితనముతో గూడిన వైరాగ్యము లేక నిస్పృహ (Despair) కనుక కామినీ, కాంచనములను పుత్రులు వదలి సన్యసించినపుడే ఈషణత్రయము తొలగునని వారి ముఖ్యాభిప్రాయము. ఐహిక సుఖాలతో గూడిన ఆశలన్నీ యెండమావులవంటివి. కొరివి దెయ్యాలవలె వానివైపు పయనించినకొలదీ, భ్రాంతిజనకము లగుచునే వుండుననీ, కనుక సన్యసించి వానినుండి పారిపోవుటయే కర్తవ్యమనీ వారంటారు. నీకుముందుగాపోవు నీ నీడను పట్టుకొనుట నీకసాధ్యము. కాని వెనుకకు మరలినచో ఆ నీడ నీవెనుకనే వచ్చుననిన్నీ, కనుక నీవు వైరాగ్యపరుగడవై సన్యసించుటే మార్గమనీ వారందురు.

కాని, "ఆశ పాపజాతి అన్నింటికంటెనూ, ఆశచేత యతులు మోసపోరె ?" అన్నట్లుగా సర్వసంగ పరిత్యాగం చేసిన విశ్వామిత్రాదులు సహితం స్త్రీవ్యామోహంచేత పతితులైనవారెందరో యున్నారుగదా ! కనుక వైరాగ్యం గాని సన్యాసంగాని పరిష్కారమార్గం కాజాలదు.

మోక్షాపేక్షకూడ నొక ఆశయై వున్నపుడు "ఆశలేని వాడు అనలు లేడు" అని అనవలసివస్తోంది. ఆశలు లేక కోరికలున్నంతవరకు జన్మరాహిత్యము చేకూరదనే సర్వశాస్త్రములుచెప్పుచున్నవి.

ఇక మా ప్రబోధచే మాత్రమే జన్మరాహిత్యము కాని యితర విధంగా చేకూరదని వుద్ఘాటించు పరిపూర్ణభావజ్ఞుల పరిష్కారమార్గమేది ?

యించుక విచారంచవలసియున్నది. ఆశకు మూలమేమి ? అని విచారించి సకలకోరికలకు, ఆశలకు, భ్రాంతులకు మూలం, మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే అని నిర్ణయించి, దాని రహితమునందు తప్ప ఆశలు బంధకారణము అవుతూనే వుంటాయి అని నిర్ణయించినారు. "నేను" అనేది వున్నంతవరకు అన్నీ భాధిస్తాయి. "నేనే" లేకుంటే, యిక ఆశలెవరికి ? భ్రాంతి యెవరికి ? బంధమెవరికి ? జనన మరణాలెవరికి కనుక ఆ "నేను" లేకుండా చేయుమార్గమే పరిపూర్ణ బోధమార్గము. ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమే పరమసత్యము. దానియందుఎరుకకు వుత్పత్తి స్థితి లయములు లేనే లేవు. అట్టి పరిపూర్ణ బ్రహ్మమును, లేనియెరుకను, యెరిగి, యెరుకను విడచుటే పూర్ణ మార్గము. ఆ విధంగా మేలుకొన్న పురుషుడు యెరుకనే కలలోనిపనులే చేయుచున్నట్లు ప్రాపంచికులకు గానవచ్చినా, అతడు కలవాడు కాదు. కర్తృత్వత్యాగ రూపమైన కర్మకౌశలముతో, రాజయోగరీవితో, భార్యా బిడ్డలతో, ధనకనకవస్తు సంపత్తితో తులతూగుచుండినా, అన్ని భ్రాంతులకు మూలమైన భ్రాంతికారక వస్తువునువిడచినవాడుగాన, అతనికి యీషణత్రయాది సర్వవ్యామోహ ములుండనే యుండవు. అతడు సర్వకర్మలు చేసినా చేయని వాడే యగును. యిదే పరిపూర్ణ భావజ్ఞుల పరిష్కారమార్గము.

